# విషయసూచిక

శ్రీ

# అంకితము

## శ్రీ కీర్తిమూర్తి కట్టమంచి రామలింగారెడ్డిగారికి.

ఆ. నీదు నగవుబిగువు, నెఱపల్కుపదను, నీ
తెలివిలోఁతు, నడత తెగువ, నీదు
నిండుతెలుఁగు మనసు, నీయోర్మి, నీకూర్మి
మచ్చుమందులగుచు మరపె నన్ను.

వయసునందుఁ, గలిమి, వైదుషీగరిమ, లో-
కానుభూతి, మించువోని ప్రతిభ
నెంత దొడ్డవాఁడవీవు ! నాకిచ్చిన
దెంత చనవు ! మఱుతునెట్లు దాని !

సరసమిత్రుఁడనఁగ, గురుఁడనఁ, జేపట్టి
పయికినెత్తినట్టి ప్రభువనంగ,
ముత్తెఱఁగుల మనసు ముడిగొన్నవారు నా
జీవితమున లేరు నీవుదక్క.

ధర్మతత్త్వ దృక్పథంబుల భిన్నవా-
దంబు కొంత మనది; దానికేమి ?
నీదు సౌహృదంబె నిన్నును నన్నును
దానియెల్లలెల్ల దాఁటఁ జేసె.

అన్నిటికిని దొడ్డదై కావ్యదీప్తికిఁ
గరఁగు మనసు నీది-
కట్టమంచి రామలింగరెడ్డిరాజ !
యీచిఱుకాన్క-
దానికిత్తు; నొండు దడవలేను.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఆంధ్ర సారస్వత పరిషత్తు ముఖ్య కార్యక్రమాలలో గ్రంథ ప్రచురణ యొకటి. ఈ ఆర్థిక సంవత్సరమున పరిషత్తు ప్రకటించిన రెండు గ్రంథాలలో సుప్రసిద్ధ పండితులు, బహుభాషా వేత్తలు, విమర్శకాగ్రగణ్యులు, కవివర్యులు నైన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తెనిగించిన శాలివాహన గాథాసప్త శతీసారము ఒకటియైనందుకు పరిషత్తు మిక్కిలి సంతోషించుచున్నది.

ఈ గ్రంథ విశిష్టతను గూర్చి ప్రస్తావనలోను, పీఠికలోను చేసిన వివరణకు ప్రకాశకుల పక్షాన చేర్చ దగిన దేమియునులేదు. 1931 సంవత్సరమున మొట్టమొదటిసారి ప్రకటితమైన యీ గ్రంథములో 395 గాథలు మాత్రమే చేరగా, యీ కూర్పులో మొత్తము 734 గాథలు చేరినవి. ఈ విధముగా పెరిగిన యీ గ్రంథమును ప్రచురించు బాధ్యతను పరిషత్తుకు అప్పగించిన శ్రీ అనంతకృష్ణశర్మ గారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతానేకవందనములు.

ఈ గ్రంథ ముద్రణమునకు జరిగిన ఖర్చులో సగము కేంద్ర ప్రభుత్వ వైజ్ఞానిక సాంస్కృతిక వ్యవహారాలశాఖ భరించినది. ఇందుకు ఆ శాఖకు పరిషత్తు పక్షాన అనేక ధన్యవాదములు. స్వర్గీయ రామలింగారెడ్డి గారి ఛాయా చిత్రమును పరిషదధ్యక్షులైన శ్రీ నరోత్తమరెడ్డి గారి ద్వారా సమయానికి అంద జేసిన శ్రీమతి టి. భానుమతి మల్లారెడ్డి గారికి పరిషత్తు కృతజ్ఞతలు తెలుపు కొనుచున్నది.

హైదరాబాదు.<br>క్రోధి ఉగాది.

దేవులపల్లి రామానుజరావు.

తొలికూర్పునకు

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారి

# ప్రస్తావన *

ఈ గ్రంథమును రచించిన శ్రీఅనంతకృష్ణశర్మగారినిగూర్చి ప్రశంసింపఁ దొడఁగుట యధికప్రసంగము. వీరు ఆంధ్రలోకమున సుప్రసిద్ధులు. సంస్కృత విద్యా పారీణులు. సంగీతకళాకోవిదులు. ఒక పాండిత్యమే కాక రసికత్వమును సంపూర్ణముగ వహించిన ధన్యులు. ముఖ్యముగా నాకెంతయు మిత్రులు. వీరు మొట్టమొదట నాతోఁ బరిచయము చేసినది సుమారు ౨౦ యేండ్లక్రిందట. అప్పుడు వయసున చిన్నవారయ్యు పాండిత్యమున ప్రగల్భులై యుండిరి. కొంతవఱకు పాండిత్యపరాయణులును. అయినను వారి సహజసౌమనస్యమును, ఒకించుక బహుశః నాయొక్క దోహదమును, జేరి సరససాహిత్యమునకుఁ బ్రేరేపించినవి. అప్పటినుండియు వీరు రచించిన గ్రంథములన్నియు ఆనందవాహినీతరంగములు. 'మీరాబాయి' యు 'తార'యు నిందునకు నిదర్శనములు. భావనాశక్తియందేకాదు, విమర్శనక్రియ యందును వీరు అసాధారణ ప్రజ్ఞ కలవారు. వీరు రచించిన ఎఱ్ఱన్న నాచనసోమన్నల తారతమ్య నిరూపణము అమోఘమైన వ్యాసము. వేమన్నపై వీరు వ్రాసిన గ్రంథము ఇప్పటి వచనకావ్యములలో నగ్రగణ్యము. అట్టివారు ఈ గాథాసప్తశతీసారమును ఆంధ్రీకరించుట వారియొక్క రసజ్ఞతకును మనభాషకును గురుత్వమాపాదించు కార్యము.

ఏ పరిస్థితులయందు గ్రంథములు రచింపఁబడినవో అవి కొంతకుఁ గొంత మనకుఁ దెలిసిననే గాని వానిస్వారస్యమును సంపూర్ణముగ గ్రహింపఁజాలము. నాకు ఈ గ్రంథవిషయమైన చరిత్ర జ్ఞానము సర్వశూన్యము గావున దానిం గూర్చిన ప్రశ్నలను వేసి శ్రీశర్మగారినే బదులు చెప్పుమంటిని. తమశోధనలచేఁ దెలిసిన విషయములను సమగ్రముగ వారు నాకు నివేదించిరి.

---

* ఇది దానికి సంగ్రహము. ముఖ్యముగ అందుదాహరించిన నాలేఖను వదలితిని. నాయీకూర్పుపీఠికలో అవిషయవిస్తరమున్నది గనుక, అట్లే శ్రీరెడ్డిగారుదాహరించిన పద్యములు కొన్నిమాత్రము విస్తరభయముచేతనే సంఖ్యామాత్రముచే సూచించి విడిచితిని. వారియుదారాభిప్రాయములను యథాతథముగా నిలిపితిని. (రా. అ కృ.)

ప్రాకృతభాషలో పుంఖానుపుంఖములుగ కావ్యములును శాస్త్రములును ఉండెననుట నిర్వివాదము. ఆభాష చేసిన దురదృష్టము అది బౌద్ధమతమునకు ఆలవాలముగా నుండుట. ఆ పాపపరిహారార్థము వైదికమతపునరుద్ధారకులు దానిని త్రవ్వి అందున్న పుస్తకముల మంటఁగలిపిరి. కొన్నిమాత్రము ఈ మారణ తంత్రము నుండి తప్పించుకొన్నవి, మఱి కొన్నింటి స్వరూపము చీనా తిబెత్తు (త్రైవిష్టప) భాషలలో లీనమై యున్నందున నిర్మూలము కాలేదు. భాగ్యవశమున ఈ గాథలును మనపాలికి నిలిచినవి.

ప్రాకృతములు జనసామాన్యములో వ్యవహరింపఁబడుచుండిన భాషలు. ఇప్పటి దేశభాషలం బోలినవి. వ్యావహారికభాషయందు వ్రాయఁబడిన వేమన్న పద్యములఁ బోలిన గ్రంథములు ఎట్లు సామాన్య ప్రజల జీవితముం బ్రదర్శించునో అట్లే ప్రాకృతకావ్యములును బ్రదర్శించుచుండెనేమో ! సిద్ధాంతముగఁ జెప్పలేము. కథాసరిత్సాగరమందు మన పురాణకథలు లేవు, రామాయణభారతవీరుల ప్రస్తావనయు ఇంచుమించు సున్న. ఇంద్రాదిదేవతలును అట్టే కానరారు. మొత్తముమీఁద దేశీయుల దైనందిన జీవితమే అందు ప్రతిఫలితము. ఊహించి యూహించి యెంత విపరీతాతిశయోక్తులకుఁ బోయినను ప్రపంచజీవితవాసనను వదలినది కాదు. ఇది యీవిషయమున ఒక్కశతాబ్దమునకు పూర్వము పాశ్చాత్త్యులలో ప్రబలియుండిన 'రొమాన్సు' (Romances) లను బోలినవి.

ఈ గాథాసప్తశతిలోని అనన్యసాధారణమైన విశేషమేమనఁగా అట్టి విపరీతపు టూహలును వర్ణనములుఁ గూడ నిందు లేవు. విషయములు సహజములు. జీవితమునకు యథార్థములు. ఆ జీవితముసైత మెట్టిది ? ఇందు నాగరకవాసన లేదు. మన ప్రబంధములలోని నాగరకవాసన యెట్టిదనఁగా పట్టణములలోని మురికికాలువల దుర్గంధము, 'వప్రస్థలీచుంబితాంబరము' లైన పట్టణములు; అందు దినదినమును – అనఁగా అమావాస్యనాఁడు తప్ప – చంద్రునిలోనుండు కాటుకను దీసి కండ్లకు రాచుకొను కన్యామణులు; కామావేశముతో స్త్రీల యంగపరిశీలనమే ప్రధాన కార్యమై యుండు రాజులు; మోహాతిరేకముచే ఉద్యానవనములో పడి పొర్లుచుండెడు నారీరత్నములు; వారి పచ్చితలంపులు; అంతకంటె పచ్చివి యైన మాటలు– ఇత్యాది రోఁతలీగ్రంథమున లేవు. మఱి యిందలిది పల్లెటూరి వారి జీవితము. పొలముల ప్రక్కన గుడిసెలలోనుండు బీదసాదల మనోహరమైన ప్రేమచర్యలు, గుట్టుదాఁచి నర్మగర్భముగాఁ బలుకు తీపిమాటలు, చిఱునవ్వుతోఁ జేయు హాస్య

ములు మొదలైనవి యిందుఁ గలవు. గుడిసెలు, వాననీళ్ళు కాఱుచుండు కప్పులు, పిండి దంచుట, పొలములో కృషిచేయుట ఇత్యాదులు ఈరంగములోని ముఖ్యాంశములు. మనసును నీరుగాఁ జేయు లీలలనిన ఇందుండునట్టివి. శాంతముగానుండు ప్రేమసాగరమందలి లేఁదరగలలో పున్నమచంద్రకిరణములు సోఁకఁ బ్రతిఫలించిన కాంతులకెనయైనవి దీనియందలి భావములు. ఇందలి భావములు మాటలు ఉపమలు మొదలగునవి స్వచ్ఛందముగ నుప్పతిల్లినవి. దూరపుటూహల సహాయముచే బలాత్కారముగఁ బొందింపఁబడినవి యొకటి రెంటికన్న నెక్కువగా లేవు. పద్యములన్నియు భావాంబరమునఁ బ్రకాశించు చుక్కలు. మందహాసమున కన్నులతో సైఁగచేసి మనభావములను వశపఱుచుకొని పైనికి ఆకర్షించునవి. కన్నును మనసును వశపరచుకొను ఆకృతులన్నిందలి స్త్రీలే. స్త్రీప్రకృతికి వన్నెను గౌరవమును గల్పించువారు వీరు. ఆడంబరములు లేనివారు, చీని చీనాంబరములు రత్నాలనగలు కలనైనఁ జూచి యెఱుఁగరు. సహజసౌందర్యోపేతలు. సహజవిలాసభాసితలు. స్వచ్ఛందానురాగమనురంగమున వెల్లివిరిసిన భావములనుబట్టి ఆటలాడు బాలికల వంటివారు. మఱుఁగు మానము సుకుమారత్వము ఉన్నవి గాని మనసునకు విపరీతముగ వర్తింపరు. వారి మనసులు మంచివిగాన వారిచర్యలును సహజముగను మనోహరముగను ఉండును ......... ఈ గ్రంథములోని నాయికలు భాగవత దశమస్కంధములోని గోపికలట్లు ముగ్ధలు. కృత్రిమమనునది యెఱుఁగనివారు. వీరు అనుభవించు సుఖములు ఆనందములును దినదినజీవితమను పాలనుండి తీయఁబడిన వెన్న ......... ఒక్క శృంగారమే కాదు ఈ గ్రంథమందు దొరకు రసము; భర్తృహరి వేమన మొదలగువారికి మార్గదర్శకములో యనునట్లుండు పద్యములనేకములు గలవు. (చూ. ౧-౨౭, ౧-౧౦౪, ౧-౧౭౧ మొ.).........

కాఁపువారికి వసంతమునకంటె వానకాలము ఎక్కువ హృద్యము. వర్షర్తువును గూర్చిన యిందలి కొన్నిపద్యములఁ దిలకింపుఁడు.

ఆ. చూడు వింధ్య శిఖరి సొబగు; వర్షర్తుల-
క్ష్మీపయోధరములు మేను సోఁక-
నన్నిదెసల మొలచుచున్న లేఁబచ్చిక-
నింపుపేరఁ బులకరింపు మోచె (౧-౪౩౨)

(ఇట్లే ౧-౪౧౯, ౧-౪౩౫ మొ.)

రసబంధురములైన పద్యముల నన్నిటిని పీఠికలోఁ బ్రదర్శింపఁ జూచినయెడల వేఱుగా గ్రంథమంతయు ముద్రింపవలసి చర్వితచర్వణమగును. భారతము 'ప్రతి పర్వరసాస్పద' మందురు. ఇది ప్రతిపద్యరసాస్పదము. విరహామునెందఱో వర్ణించి యున్నారు. ఈ పద్యమెంత దుఃఖజనకమో యెంత సహజమో చూడుఁడు.—

ఆ. ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటి పాడు సూచి యేడ్వలేక,
చనఁడు పొలము విడిచి పని లేక యున్నను
పామరుండు చూడు పల్లెకాఁపు. (౧-౧౩౧)

ఇఁక ప్రతిదినజీవితతంత్రమునకు ఈపద్యమెంతమంచిసూత్రమో ఆరయుఁడు.—

ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను బనికిరానిదాన నిజము.
కాని యందకాఁడ ! దానిఁ బోలఁగలేని
వారలెల్లఁ జావవలయునేమి ! (౧. ౩౮౫)

'దొరకినది గంభీరముగా ననుభవింపుము. ఊరక కొసరనేల ?'

మనవారిలో ఆశుకవిత్వమున్నదిగాని మొత్తముమీఁద ఆపద్యములలో చమత్కారము పాండిత్యము ప్రకటనకు వచ్చినంత ఘనముగా రసము రాలేదు. ఈ సప్తశతిని చదువునప్పుడు నేను చిన్ననాఁడు విన్న యీ పద్యము స్మరణకు వచ్చినది.—

"జొన్నచేనిలోన సొగసుకత్తెను జూచి
నిన్నటాళనుండి నిద్రరాదు;
దాన్ని నన్నుఁ గూర్చి దయజూపు మాధవా
పొన్నపూలు దెచ్చి పూజసేతు"

ఒక్క పద్యములోనే హృదయప్రపంచమున భూకంపము పుట్టునట్లు చేయువారిలో జపానుదేశీయులు ప్రథములు. ఇట్టి కవితారచన వారిలో పారంపర్యముగ వచ్చిన సనాతనకళ. ఒకానొక స్త్రీ తనకొడుకుచావునకు విలపించిన విధము వినుఁడు.—

తే. "తుమ్మెదలఁ బట్టుచు మఱచి తొలఁగి యెటకుఁ
బోయినాఁడొకొ నేఁడు నాముద్దు కొడుకు !"

జపానులో బాలురక్రీడలలో తుమ్మెదలను బట్టుట యొకటి. చిన్నబిడ్డలు నిద్రపోయినట్లు శాంతముగ మరణింతురు. ఈ బిడ్డయు నేతొందఱయు నియ్యక ఆటకుంబలె వెళ్ళినాఁడా ? ఆఁకలిప్రొద్దెఱుంగనివారు బిడ్డలు. కావున ఇంటికి వేళకు రాకపోయెనా ? దారి తప్పెనా ? మఱియు మృత్యువు కట్టకడపటిస్థితియని ప్రేమ యంగీకరింపదు. సావిత్రి యట్లు చేయలేదు. ఎవ్వరును చేయరు. పునస్స మాగమము సిద్ధించునను దృఢమైన యాశ యుండును. తుమ్మెదలఁ బట్టుచుఁ బోయిన కొడుకు మరల వచ్చును. తల్లిని దలఁచుకొని రాకుండునా ! ఎప్పుడు వచ్చు నో యని తల్లిహృదయము వేఁగుచున్నది. ఎప్పుడైన నొకప్పుడు వచ్చుననుట సత్యము. ప్రేమ యమృతత్వము. సముద్రమునకంటె లోఁతైనది యీ పద్యము. అనఁగా హృదయమెంతలోఁతో అంతలోఁతు. ధ్వని యను గుణమున్నదని మన సంప్రదాయము ప్రకారము చెప్పవచ్చును; హృదయమునందలి ప్రతిఆక్రోశము యొక్కయు ప్రతిధ్వని గూడ ! అరబ్బులును ఇట్టి కవిత్వమునఁ బ్రవీణులు.

ఒక్కపద్యమే వ్రాయవలయును. అది మెఱుఁగుఁదీఁగవలె మనలఁ గ్రమ్మి యుండు నంధకారమును ఒక్కక్షణము పోఁద్రోలి నూతనలోకమును హఠాత్తుగ గోచరింపఁ జేయవలయును. ఆలోకము ఒక్కనిమిషము మాత్రమెదుటనున్ననేమి ? దాని రామణీయకము జీవమునంతయు నాక్రమించి చచ్చువఱకును తదేకధ్యానములో మునుఁగునట్లొనరించును. అట్టిదియ కవిత. గుణము ప్రధానము; రాశి కాదు.

ఈ గాథాసప్తశతి బౌద్ధయుగమునాఁటి యుత్కృష్ట జీవితమును దెలుపు చున్నది. భావములు కోమలములు. వానికిందీపైనది అనంతకృష్ణశర్మగారి శైలి; మధురము, లలితము, రమణీయము. వీరిసరసత్వము అర్హతకొలఁది పొగడుట అసాధ్యము.

తినుకొలఁది ఆఁకలి ! ఇంకను ఇట్టిగ్రంథములు శర్మగారు వ్రాసి తనివి దీర్పఁ బ్రయత్నింపరేని మనకుఁకష్టము గల్పించినవారగుదురు. ఆ పాపమునకుఁ బాల్పడకుందురు గాక !

పద్మప్రభాస
చిత్తూరు.
22-9-31

కట్టమంచి రామలింగారెడ్డి

# పీ ఠి క

భరతఖండమున ప్రాకృతభాష యెంతో వివిధముగా విస్తరముగా చాలా కాలము వెలసినది. సంస్కృతము గూడ దానిభేదములలో నొకటే. కాని సర్వజనీనముగా సార్వకాలికముగా లోకప్రబోధమును గోరిన మహనీయులెందరో దానిని సంస్కరించిరి. అనఁగా దిక్కుకొకటిగా నున్న దానియనంత శబ్ద రూపరాశిలో కొన్ని యెక్కువ వ్యాప్తిలోనున్నవిమాత్రము పరిగ్రహించి శాసించి, తక్కినవానిని వదలిరన్నమాట. అది 'సంస్కృత' మాయెను. శాసకులు విడిచిన రూపములను శిష్టులు వదలినను సామాన్యలోకము విడువలేదు. సహజముగా దేశేదేశే దినేదినే ఆశబ్దప్రవాహము జాతి, మతము, దేశము, వ్యక్తి మొదలగువాని మూలమున పలుమార్పులు చెందినది. సందర్భానుగుణముగా ఎన్నో క్రొత్త శబ్దములు పలుకుబడులును అందుకలిసి పోయినవి. సంస్కృతశాస్త్రమెంత ప్రబలముగానున్నను ప్రబలవ్యవహార సిద్ధములైన ప్రాకృతశబ్దరూపములెన్నో మరల సంస్కృతభాష లోనికి చొచ్చి వ్యాప్తికెక్కి నిలఁబడినవి.

కవిత్రయముమొదలు నేఁటివరకును ప్రచారమందున్న 'సంస్కృత' మైన తెలుగుతో, ఇప్పుడు భిన్నప్రాంతములలో భిన్నజాతులలో వాడుకయందుండు తెలుగు తీరుతెన్నులు పోల్చి చూచితిమేని సంస్కృతప్రాకృతముల పరస్పర సాదృశ్య వైదృశ్యములను గుర్తింపఁగలము. తమిళు, కన్నడము, మహారాష్ట్రము, ఉర్దూ, ఇంగ్లీషు మొదలగు భాషల సంపర్కమువలన తెలుఁగు ఎన్నో భిన్నచ్ఛాయలనాశ్రయించినది- పదములలో, పలుకుబళ్ళలో, ఏసలో, కారకప్రయోగములలో. పరిమితమైన తెలుఁగునేలయందే ఇన్ని మార్పులు గలుగఁగా, ఆసేతు హిమాచలము ఎన్నో వందల వేల యేండ్లు వ్యాపించియున్న భాషలో ఎన్ని యెట్టి మార్పులు వచ్చి నెలకొని యుండఁగలుగునో కొంతకు కొంతయైనను ఊహింపవచ్చును. సంస్కృతభాషవలె పై దేశభాషలను గూడ నిఘంటు వ్యాకరణముల మూలమున సంస్కరించు మహా ప్రయత్నము ప్రాచీనులు పెద్దలు చేసిరి. దేశప్రయుక్తముగా మహారాష్ట్రి, శౌరసేని, గౌడి, లాటి, మాగధి, పైశాచి, ఆవంతి, అర్ధమాగధి, ప్రాచ్య, బాహ్లీక, దాక్షిణాత్య మొదలగు పేళ్ళతో స్థూలముగా వారు విభజించిరి. అట్లే జాతి ప్రయుక్తముగాఁ గూడ ఆభీరి, శకారి చాండాలి, శాబరి ఇత్యాదిగా కొంత వేఱుపరిచిరి. కాని యీ యన్నిటికిని 'ప్రాకృతములు' అను సామాన్యనామమే

వ్యవహారమున నిలిచెను. వీనిలోనెల్ల ఉత్తమమైన ప్రాకృతము 'మహారాష్ట్రాశ్రయ' మని ఆచార్యదండి యభిప్రాయము. అది 'సాగర: సూక్తిరత్నానాం' అన్నాఁడతఁడు. (౧) ఇన్నిటిని సంస్కరించుట అసాధ్యమై తరువాతి లాక్షణికులు - హేమచంద్రుఁడు, వేంకటనాథుఁడు, లక్ష్మీధరుఁడు, అప్పయ్యదీక్షితుఁడు మొదలగువారు - మూఁడు నాలుగుభాషలకు మాత్రము వ్యాకృతిసంస్కారమునిచ్చిరి. ఈగట్లను దాఁటి ప్రాకృతప్రవాహము చిలువలు పలువలై 'అపభ్రంశము' అనఁబడి సందుగొందులలో దూరినది. దానినిగూడ సంస్కారమునకు లొంగఁదీయు ప్రయత్నములు లేకపోలేదు. జీవితమందు నియమములేని నడత యేదియు నుండరాదని భావించి పరిశ్రమించిన ప్రాచీన భారతీయుల లోకకల్యాణకాంక్షకు ఈ భగీరథప్రయత్నము ప్రథమోదాహరణము. ఆప్రయత్నఫలముగా అపభ్రంశ భాషలలోను పుష్పదంతుఁడు మొదలగు ప్రతిభామహితులు మహాకావ్యములు రచించినారు.

ఇక 'సంస్కృత' మైన ప్రాకృతభాషలయందు ఎంతో విరివి, విలువ, వైవిధ్యము గల వాఙ్మయము జనించి యుండవలెననుట సుగ్రహమైన మాట. కాని దానిలో నేడు మనపాలికి మిగిలినది యెన్నవపాలో ఊహింపలేము. సేతుబంధము, గౌడవధ, ఈ సప్తశతికోశము మొదలుగా కొన్ని కావ్యరచనలు, 'కర్పూరమంజరి' వంటి ఒకటిరెండు ప్రాకృతరూపకములు, జైనబౌద్ధులు పవిత్రభాషగా నంగీకరించినవారు గావున వారిమతతత్త్వ గ్రంథములు కొన్ని, శాస్త్ర ప్రకారము సామాన్య పాత్రములకుపయోగించినను సంస్కృతభాషా 'ఛాయ' చే మాత్రమే తెలిసికొనబడుచున్న రూపకములలోని వివిధప్రాకృత వాక్యములు కొన్ని - ఇవే నేటికి మనలో శేషించిన ప్రాకృతరచనలు, నేనెఱిఁగినంతవఱకు.

ప్రాకృత సారస్వతము ఇంత నిర్మూలించినది బౌద్ధమతద్వేషులైన 'వైదిక మతపునరుద్ధారకులు' అన్న శ్రీ రామలింగారెడ్డిగారి యభిప్రాయము అంతగా క్షోదక్షమము గాదు. అవైదికులైన జైనులును బౌద్ధవిరోధులే. జైనులు మనదేశమందే నిలబడి తమమతతత్త్వములను ఆ వాఙ్మయమును ఎంతో రక్షించుకొని వచ్చినారు. మరి ద్వైతాద్వైత విశిష్టాద్వైతాదిమతములవారి పరస్పరద్వేషము బౌద్ధ బౌద్ధేతరుల అన్యోన్యవిరోధముకన్న ఎందును తీసిపోనిది. కాని వారివారి సారస్వతము నశింపకుండ వారువారు కాపాడుకొనియే యున్నారు. ఈవల మన దేశమున వచ్చి నెలకొన్న క్రైస్తవ మాహమ్మదాదుల వాఙ్మయములకును ఈగతి

(౧) కావ్యాదర్శము. ౧-౩౪.

పట్టలేదు. విరుద్ధమతముల గ్రంథములను ఇతరులు కాపాడకపోవుట, పాడు చేయుటయు సామాన్యస్వభావమే. కనుక వైదికమతములవారికైవాదము గూడ బౌద్ధగ్రంథ నాశనమునకు కొంత తోడ్పడి యుండవచ్చును. కాని ప్రాకృతము లందుండినదంతయు బౌద్ధవాఙ్మయమే కాదుగదా. బౌద్ధ జాతి మనదేశమందు - ఆమతము పుట్టిపెరిగిన దేశమందే - నిలువ నీడలేక కాందిశీకము కాఁగా, దాని వెంటనే పరువెత్తిన ఆ మతసారస్వతము గూడ భిన్నదేశములలో నలిగి, భిన్న భాషలలో, చీనా - తిబెత్తుభాషలవంటి వానిలో - తలదాచుకొన్నదనుట సత్యమునకు సమీపము కాఁగలదు. బుద్ధుని మనవారు విష్ణుదశావతారములలో ఇప్పటికి కడపటిదిగా పరిగణించినను, తరువాతి బౌద్ధులతోడి సహవాసమును సహింపలేక పోయిరి. కారణము సామాన్యధర్మనీతి బాహ్యములై, సంఘమందు నెమ్మదికవకాశ మియ్యని బాహ్య - గుహ్యతాంత్రికవృత్తులు వారిలో ప్రబలి యుండుటయే యనుట న్యాయము. సందర్భము వచ్చినది గనుక వారి రహస్య గురూపదేశ శ్లోక మొకటి నా దృష్టికి వచ్చినది యిందుదాహరింతును.-

"ప్రాణినశ్చ త్వయా ఘాత్యాః వక్తవ్యంచ మృషా వచః
అదత్తంచ త్వయా గ్రాహ్యం సేవనం యోషితామపి" *

మరి ప్రాకృత వాఙ్మయమేల యింత నశించినది ? కారణమొకటే; ఆ భాషల విభిన్న వ్యవహార స్వరూపము. దానిని సంస్కరించి హద్దులో పెట్టు ప్రయత్నము చాలవరకు నిష్ఫలమైనది. నేటి మన వ్యావహారికతెలుగుభాషవలె ఆకాలమున సంస్కృతభాషకెదురుదిరిగిన విప్లవకార్యమే ప్రాకృతసారస్వతము. మనలో ఇప్పుడప్పుడే వ్యావహారిక తెలుగునకు ఏదోకొంత సంస్కారనియమము చేసికోవలె నన్న దృష్టి భాషాసేవకులలో కొందఱికైనను కలిగినది. కలుగుచున్నది. కొందఱు ప్రయత్నము గూడ చేసినారు. ఫలము ముందు చూడవలసి యున్నది. ఎట్లైనను వ్యవహారమునే నమ్ముకొన్న యేభాషయందలిసారస్వతమైనను కొంతకాలముననే అంతరించుట స్వాభావికపరిణామము అని యూహింపలేకపోవుట బుద్ధిమాంద్యమునకు గుర్తు.

---

* ఇది 'గుహ్యసమాజ తంత్రము' అను గ్రంథమునందలిది. హింస, అసత్యము, పరద్రవ్యాపహరణము, పారదారికత - అను నాలుగు ప్రధానసాంఘికపాతకములను గూర్చిన ధర్మోపదేశరత్నము! ఇట్టి మతమువారితో ఎవరు నెమ్మదిగా బ్రదుకఁగలరు ?

జీవశక్తిచే చెలరేగుచున్నకాలమున ప్రాకృతభాషలలో కావ్యరచన యొక్కటే యెంతవిరివిగా అల్లుకొనియుండినదో ఈ 'గాథాసప్తశతి' కొంత సూచించును. ఇందు సంగ్రహించిన పద్యములు ఏడునూర్లే యయినను వానిని వేరు వేరుగా రచించిన కవులసంఖ్య ఇంచుమించు మూఁడునూర్లు! నా యీ సంగ్రహమందే ౨౭౪ కవుల పేళ్లు గలవు. కోటిగాథలనుండి యీ యేడునూర్లు సంగ్రహింపఁబడినవని యిందే కలదు. (౧-౩) 'భువనపాలుఁడు' అను దీనివ్యాఖ్యాత ౩౮౪ పేళ్ళను గుర్తించినాఁడట. మొత్తము పందొమ్మండ్రవరకు దీనికి టీకాకర్తలు గలరట! 'పీతాంబరుఁడు' అను టీకాకర్త టీకయందు గుర్తించిన పేళ్ళను, జర్మని దేశమున వేబరు పండితుఁడు సంగ్రహించి ప్రకటించిన ముద్రణమునందలి పేళ్ళను జేర్చి, బొంబాయి 'కావ్యమాల' యందు శ్రీ దుర్గాప్రసాద పండితుఁడు ౧౧౮౯ వ సంవత్సరమున ఈ గ్రంథమును గంగాధరభట్టు టీకతో ప్రచురించెను. పీతాంబరుని టీక ఆయనకు పూర్తిగా లభించి యుండలేదు. దాని కొంతభాగము ఈవల ప్రకటితమైనది. నేనీ తెలిగింపున గుర్తించిన పేళ్ళకు పైమూఁడు ప్రతులే ఆధారము. ఆ గాథా కవుల పేళ్ళలో రెండుమూఁడు తప్ప నేటికి మనయెఱుకకు వచ్చినవేవియు లేవు. అవన్నియు ఎవరో కల్పించి యతికించినవని భావించు బుద్ధిమంతులును గలరు. కాని అది యర్థము లేని సందేహము.

ఇందలి పద్యములన్నియు ఆర్యాచ్ఛందస్సున కూర్చినవి. 'గాథ' యని దాని ప్రాఁతపేరు. గానము చేయఁదగినది గాథ. కనుక ప్రాచీనప్రాకృతులు దీనిని పాటగా నుపయోగించుచుండి రనఁదగును శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమున రాగ వివేకాధ్యాయమందు షడ్జకైశిక రాగమునకు లక్ష్యముగా ఈ క్రిందిగాథ సస్వరముగా నియ్యఁబడినది.

"దీహరఫణిందనాలే మహిహరకేసర దిసాముహదలిల్లే,
విఅఇ కాలభ (బ్భ ?) మరో జణమఅరందం పుహరపఉమే."

ఈగాథ సాతవాహనుని యాస్థాన కవియైన పాదలిప్తాచార్యుడు సిద్ధనాగార్జునునికి * ఉపదేశించినదని 'పురాతనప్రబంధసంగ్రహః' అను జైనగ్రంథమునఁ

* పాదలిప్తుని శిష్యుఁడై నాగార్జునుఁడు జైనమతము స్వీకరించెనని ఆ గ్రంథమందలి కథ. 'పాదలిప్త' పదమే 'పాయలిత్త - పాలిత్త' అను ప్రాకృతరూపము గొన్నతరువాత 'పాలిత' అని పునస్సంస్కారము పొందినదేమో! ఈ గాథలలో కొన్నిటికి 'పాలితుఁడు' కర్తగాఁ గలఁడు. 'కవివృష' డైన పాలితుని హాలుఁడు - ఈకోశ సంగ్రహకర్త - 'ఉత్తమపూజచే లాలించె' నని అభినందుని రామచరితకావ్యమున నున్నదఁట.

గలదు. 'ఓపిబఇ కాలభమరో...పుహవి పఉమే' అని సరియైన ఉత్తరార్ధపాఠము దానిలో నున్నది. (పు. ౯౪) దీనినిట్లు తెలిఁగింపవచ్చును.

తే. "ఉరగపతి నిడునాళమై, గిరులు కేస-
రంబులై, దిఙ్ముఖములు దళంబులైన
పుడమితామరపూవునఁ గడఁగి క్రోలు
మనుజమకరందమును కాలమనెడి తేఁటి"

కాని వ్యవహారబాహుళ్యముచేత 'గాథ' లో పాటతనము పోయినది; తెలుగు తేటగీతియందు 'గీతి' పదమువలె 'గాథ' గూడ వట్టి ఛందోనామమైనది. క్రమముగా 'ఏదో పనికిరాని, నమ్మరాని మాట' అనునర్థమున ఆపదము నేటివాడుకలోను గలదు. 'గానటబీసటే చదివి గాథలు త్రవ్వ' వారు 'తెలుంగువారు' అన్నాఁడు నాఁడే శంభుదాసుఁడు! కన్నడమున 'గాదె' అనగా సామెత.

ఈ 'గాథాసప్తశతి' ని కూర్చిన రసికరాజకవి హాలుఁడు. ఆమాట యిందలి మూఁడవ పద్యమందే యున్నది. (౧-౩). 'కవివత్సలుఁ' డనియు ఇతని బిరుద నామము. ౧, ౨, ౩, ౫, ౬ శతకముల కడపట 'రసికజనహృదయదయితే కవివత్సల ప్రముఖ సుకవి నిర్మితే' అని సమాపక పద్యము గలదు. ౪ వ శతకాంతమున పేరులేని సమాప్తిగాథ యున్నది. ౭వ శతకము తుదిని 'ఇతి శ్రీహాల విరచితే' ఇత్యాదిగా నున్నది. రెండు వ్రాఁతప్రతులలో 'శాలవాహన విరచితః కోషః' అని కలదఁట. ఇవి గాక శాతవాహన, సాతవాహణ, సాలవాహణ, సాలాహణ, శాలవాహన, శాలివాహన, శాల - సాల అనియుఁ గలదేమో! - అనున వెల్ల హాలుని నామాంతరములే యని ప్రాచీన సంప్రదాయము. ఇదిగాక ఒకానొక గాథాసప్తశతి ప్రతిలో 'సాతకర్ణి' అను పేరుగూడ నున్నదఁట! క్రీ. త. ౭౮ వ సంవత్సరమున మొదలైన శాలివాహనశకమును స్థాపించిన శాలివాహనుఁడే ఈ గాథాకోశమును సంగ్రహించిన ఆంధ్రరాజని పలువురాధునికచరిత్రశోధకుల మతము. కొందరు క్రీ. త. మూఁడవశతకముతర్వాతను ఏడవశతకపు వెనుకను ఎవరో సంగ్రహించి హాలునిపేరతికించి యుందురని సందేహింతురు. అసలు ఈ శకకర్త శాలివాహనుడు ఆంధ్రసాతవాహన వంశము వాఁడు కాఁడని; ఇంకొక శకస్థాపకుఁడగు విక్రమాదిత్యునికి ఇతఁడు మనుమఁడో మునిమనుమఁడో కాఁగలఁడని; వీరిద్దఱును అగ్నివంశమునకు చేరిన 'పన్వారు' సంతతివారని; హాలసాతవాహ

నుఁడు యయాతివంశీయులై చంద్రవంశమునకు చేరిన - మగధసామ్రాజ్యము నేలిన - ౩౩ గురు ఆంధ్రచక్రవర్తుల పరంపరలో ౧౯ వ వాఁడని; క్రీ. పూ. ౪౯౪ మొదలు ౪౮౯ వ సంవత్సరముదాఁక ఐదు సంవత్సరములు మాత్రమే రాజ్యమేలినవాఁడని; ప్రాచీనుల కట్టు కథలందును ఇప్పటి చరిత్ర రచనలందును పైయిరువురును ఒక్కరేయను భ్రాంతి కలిగినదని,- శ్రీ కోట వెంకటాచలపండితులు భావించిరి.[1] వారి పరిశ్రమ అగాధము, వ్యాసంగము గంభీరము, కాని వారు ప్రమాణములన్న భవిష్యపురాణాది గ్రంథములు పూర్తిగా నమ్మవలసినవని, అప్రమాణములనిన కథాసరిత్సాగరము మొదలగునవి వట్టి కట్టుకథలని తిరస్కరింపవలసినవని, అంగీకరించుట సాధ్యముకాదు. అంగీకరించినచో ఆంధ్రచక్రవర్తియగు హాలసాతవాహనునికే ఈగాథాసంగ్రహమునంటఁ గట్టి దీని జననకాలమును క్రీ. పూ. ౫ వ శతకముగా గ్రహింపవలసి యుండును; హాలుఁడే సంగ్రహించినట్లు ఇందున్నదిగనుక; శకకర్త 'పన్వారు' శాలివాహనునికి హాలుఁడను పేరు కానరాదు గనుక, ఇఁక ఎవఁడో తర్వాతివాఁడు సంగ్రహించి పేరు పెద్దరికమునకై ఆంధ్రహాలచక్రవర్తికి దీనిరచనాకీర్తి సమర్పించియుండును అను వాదమున్నచో దానికి మౌనమే నిరాకరణము. పోనీ, ఆ హాలచక్రవర్తియే దీనిని కూర్చినవాఁడని యంగీకరింపరాదా యనవచ్చును. అట్లైనచో క్రీ. పూ. ౫ వ శతకము మొదలు క్రీ. త. ౭ వ శతకమువఱకును ఈ సప్తశతి పేరు వినరాదే! ఇప్పటికి మొట్టమొదలు దీని పేరెత్తినవాఁడు క్రీ. ౭ వ శతకమువాఁడు బాణభట్టే కానవచ్చుచున్నాఁడు.[2] కనుక ఇంచుమించు వేయేండ్ల అజ్ఞాతవాసము దీనికంటఁగట్టవలసి యుండును. ఎట్లైనను ఈకాలచర్చ భావిపరిశోధనవలన తెంచవలసినది. మరి యీ విషయమున నాకంతకు మించిన అధికారము, అభినివేశము, లేదు.

శాలివాహనునికి సంబంధించిన పురాణములు, కావ్యములు, ప్రబంధములును ఎన్నోకలవు. అవి ఒండొంటితో పోలు పొందు లేనివి. అందలి విషయములన్నియు ఇంచుమించు అతిమానుషవీధికిఁ జేరినవి. ప్రకృత 'సప్తశతి' కి సంబంధించిన

---

1 చూ. 'The Historicity of Vikramadithya and Sali Vahana', మరియు 'ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరములు' అను వారిరచనలు.

2 'అవినాశినమగ్రామ్యమకరోత్సాతవాహనః
విశుద్ధజాతిభిః కోశం రత్నైరివ సుభాషితైః' (హర్షచరిత పీఠిక)

ఒక కథమాత్రము ఇందు సంగ్రహించి తెల్పుచున్నాను. మేరుతుంగాచార్యుఁడను జైనపండితుఁడు రచించిన 'ప్రబంధ చింతామణి' లోని 'సాతవాహన ప్రబంధ' మున ఇది కలదు.-

సాతవాహనుఁడు మహాదాత. అందఱు పండితులను కవులను తన యాస్థానమున చేర్చుకొని పోషించుచుండెను. ఎవరో రచించినవి నాల్గు ప్రాకృతగాథలను విని నాలుగుకోట్ల బంగారునాణెములకు వానిని కొనెను. తరువాత అట్టి గాథలు ఏడు వందలు చేర్చి "సాతవాహనాభిధానమగు సంగ్రహగాథాకోశము నిర్మింపించి" చాల కాలము రాజ్యమేలెను. అతఁడప్పుడు క్రయమిచ్చి కొన్న ఆనాలుగు గాథలివి :

(౧) మగ్గంచియ అలహంతో హారో పీణుణ్ణయాణ థణయాణం,
ఉబ్బింబో భమఇ ఉరే జముణానఇ ఫేణ పుంజం వ్వ.

(ఛాయ. మార్గమివాలభమానో హారః పీనోన్నతయోః స్తనయోః,
ఉద్బింబో భ్రమత్యురసి యమునానదీ ఫేనపుంజ ఇవ.)

(౨) కసిణుజ్జలోయ రేహఇ వేణీదండో నియంబబింబమ్మి,
తుహ సుందరి సురయమహాణిహాణ రక్ఖాభుయంగవ్వ.

(ఛా. కృష్ణోజ్జ్వలశ్చ రాజతే వేణీదండో నితంబబింబే,
తవ సుందరి సురతమహానిధాన రక్షాభుజంగ ఇవ.)

(౩) పరిఓససుందరాఇం సురఏ జాయంతి జాఇం సుక్ఖాఇం,
విరహేఇం తాఇం పియసహి ఖట్టుగ్గలియాఇం కీరంతి.)

(ఛా. పరితోష సుందరాణి సురతే జాయంతే యాని సౌఖ్యాని,
విరహే తాని ప్రియసఖి ఖాదితోద్గలితాని కుర్వంతి.)

(౪) మా జాణ కీర జహ చంచులాలియం పడఇ పక్క-మాఇందం,
జరఢత్తణ దుల్లలియం ఉబ్భుయ తాలాహలం ఏయం.

(ఛా. మాజానీహి కీర యథా చంచులాలితం పతతి పక్వమాకందం,
జరఠత్వాదుర్లలితం ఉద్భుజ తాలఫలమేతత్.) *

---

* పై సంస్కృతచ్ఛాయలు నేను గ్రహించినవి, స్థితగతిచింతనముగా. ౧-౩ వ గాథలకు 'కావ్యమాల' వారిపాఠమున చిఱుమార్పులు గలవు.

ఈ కథకు సంగ్రహముగా ఎవరో యీ క్రింది గాథను రచించెను.-

"హారో వేణీదండో ఖట్టుగ్గలియాఇ తహఅ తాలుత్తి
ఏయాఇఁ నవరి సాలాహణేణ దహకోటి గహియాఇఁ"

(ఛా. హారో వేణీదండః ఖాదితోద్గలితాని తథాచ తాల ఇతి.
ఏతాని కేవలం శాలివాహనేన దశకోటిగృహీతాని.)

విస్తరములోని 'నాలుగు' కోట్లు సంగ్రహములో 'పది' యై పెరిగినవి! పై నాలుగు గాథలలో ౧-౩ గాథలు గంగాధరటీకతోడి 'కావ్యమాలా' సప్తశతి పాఠమున ఏడవ శతకమున ౬౯, ౭౦ వ సంఖ్యలతోనున్నవి. ఇతర మూలపాఠములలో తక్కిన రెండును గలవేమో! ఆరెంటినిగూడ నేను నా ఈ సంగ్రహములో చేర్చుకోలేదు.

సంగ్రహించిన హాలుఁడు దీనిని ఏడునూర్లకే యేల నిలిపెనను ప్రశ్న వట్టి వినోదము. ఏ సంఖ్యలో నిలిపియున్నను ఈ ప్రశ్న వేయవచ్చును. సప్తద్వీపములు, సప్తలోకములు, సప్తమాతృకలు - ఇట్లు సప్తసంఖ్యకొక ఆధ్యాత్మికవిశేషము కలదని సమాధానమిచ్చుట సామాన్యము. ఇంచుమించు అన్ని సంఖ్యలకును అట్టి విశిష్టత గమనించి చూడవచ్చును. కాని ఈ 'సప్తశతి' నియమము ఎందఱో తరువాత అనుకరించినారు. దీని గాథలవంటి ముక్తకములే శృంగారమయముగానే సంస్కృతమున రచించిన ఆచార్య గోవర్ధనుఁడు తన రచన 'ఆర్యాసప్తశతి' గానే వ్యవహరించెను. హిందీవాఙ్మయమున 'బిహారి సత్‌సయీ' మొదలగు సప్తశతులు, ఏకకర్తృకములైన దీని యనుకరణములు, కొన్ని కలవందురు. సప్తశతీనియమము లేక జయవల్లభుఁడను వాఁడు 'వజ్జాలగ్గ' అనుపేర మరికొన్నివందలగాథలను సంగ్రహించెను. కాని ఆసంగ్రహమందలి గాథలలో ఈ అభిరుచిగాని కామనీయకము గాని కానరాదు. కనుకనే 'వజ్జాలగ్గ' విరివిగా ప్రాఁకలేదు.

ఇఁక సంస్కృతమున ఆలంకారికసారస్వతములో ఈ గాథల రాజ్యమే రాజ్యము. సంస్కృతము దేవభాషయని పేర్కొని పూజించినను ప్రాకృతము గూడ 'సరస్వతీ బాలభాష' అనుకొని లాక్షణికులు సమాన ప్రతిపత్తినిచ్చి గౌరవించిరి. 'కావ్యస్యాత్మా ధ్వనిః' అను తత్త్వమును గుర్తించినతరువాత ఈ గాథలు దానికి ఉత్తమములైన లక్ష్యములుగా కావ్యమీమాంసకులు నిరర్గళముగా పరిగ్రహించిరి.

ప్రాకృతములు తరువాతిసామాన్యవిద్వాంసులకు సరిగా అర్థముకాని పరిస్థితి కలుగుట చేతనేమి, చదువరులందఱు ఇంచుమించు సంస్కృతభాషనే ఆదరించి గౌరవించవలసిన సంప్రదాయమును ఆవశ్యకతయు ఏర్పడుటవల్లనేమి – ఈ గాథలవంటి ముక్తక రచనలెన్నో సంస్కృతభాషలో వెలువడినవి. కాని వానిలో ప్రాయికముగా ఈ గాథల ప్రధానలక్షణమైన సంయమము చిక్కఁదనమును పలుచనై పోయినవి. పెద్దపెద్ద వృత్తములలో విషయ విస్తరముతో ఆ రచనలు సాగినట్లున్నది. వానికెల్ల కిరీట ప్రాయముగా అమరుకవి శతకము రసికులను లాక్షణికులను వశీకరించుకొన్నది. కొందఱు, గాథల సంగ్రహాశక్తి విలువ గమనించినవారు, సంస్కృతమున గాథల ఆర్యాచ్ఛందస్సునే గ్రహించి సంస్కృతభాషలో ఛందస్సుకు వలసిన చిఱుమార్పు లతో పరివర్తనము చేసికొన్నవారును లేకపోలేదు. రాజశేఖరుని 'కావ్యమీమాంస' లో (౧ వ శతాబ్దము) అట్టి ఆర్యాగాథ యొకటి కలదు.

"దైవాయత్తే హి ఫలే కిం క్రియతామేతదత్రతు వదామః
నాశోకస్య కిసలయైః వృక్షాంతరపల్లవాస్తుల్యాః"

(అధ్యా. ౧౪, పు. ౧౦)

సప్తశతియందు దీనిమూల మనఁదగినది యిట్లున్నది.

"దెవ్వాయత్తమ్మి ఫలే కిం కీరఇ ఎత్తిఅం పుణో భణిమో
కంకేల్లి పల్లవాణం ణపల్లవా హోంతి సారిచ్ఛా."

(౩-౭౯)

(ఛాయ, దైవాయత్తే ఫలే కింక్రియతామియత్పునర్భణామః
కంకేలి పల్లవానాం న పల్లవా భవంతి సదృశాః)

పై సంస్కృతచ్ఛాయయందలి ఛందోభంగము స్పష్టమే. అన్ని భంగాల కంటె ఛందోభంగము సహింపరాదనుట ప్రాచీనుల రుచి. 'మాష' అనుదానిని 'మష' అని యైనను చెప్పవలెను గాని పద్యపు నడక చెఱుపరాదని ఎవరిదో ప్రాంత ఆభాణకము. "అపిమాషం మషం కుర్యాత్ ఛందోభంగం త్యజేద్గిరామ్". కనుకనే పై సంస్కృతపరివర్తనకర్త మూలమున లేనివి 'హి-అత్ర-వృక్షాంతర' అను పదములెక్కువగా చేర్చుకోవలసి వచ్చినది. భాషాంతరీకర్తకు ఈ కష్టము తప్ప నిది. దీని నా తెలిఁగింపు (౧-౨౨౧) ఇందుఁగలదు.

మరికొందఱు సంస్కృతచ్ఛందస్సులలో చిన్నదై ఎక్కువ వ్యాప్తి గలిగిన 'అనుష్టుప్' ఛందమున కొన్నిగాథలు రూపాంతరీకరించియున్నారు. అప్పయ్య దీక్షితులు తన 'కువలయానంద' మందు 'చిత్రమీమాంస' యందును ఇట్టి శ్లోకములు కొన్ని యెత్తినారు. అతఁడే యీరూపాంతరీకర్త కాఁబోలు. అందొకటి మచ్చుకు,-

" యథోర్ధ్వాక్షః పిబత్యంబు పథికో విరలాంగులిః
తథా ప్రపాపాలికాపి ధారాం వితనుతే తనుమ్"

(కువల. అన్యోన్యాలంకారమునకుదాహరణము)

దీని మూలగాథ ఇది.-

"ఉద్ధచ్ఛో పిఅఇ జలం జహజహ విరలంగులీ చిరం పహిఓ,
పావాలిఆ వి తహతహ ధారం తణుఅంపి తణుఏఇ"

(౨-౬౧)

(ఛాయ. ఊర్ధ్వాక్షః పిబతి జలం యథాయథా విరలాంగులిః పథికః,
ప్రపాపాలికాపి తథాతథా ధారాం తనుకామపి తనూకరోతి.)

మూలమందలి అర్థభావములు రెండును సంస్కృతరూపాంతరమున కొంత దెబ్బదిన్నవనుట స్పష్టమే. నాదీని తెలిగింపు ఇందు ౧౨౪ పద్యము.

ఈ గాథాసారస్వతమును మరలనుద్ధరించు మహాప్రయత్నము చేసినవాఁడు ౧౧ వ క్రీ. శతకముననున్న బహుముఖ ప్రతిభాపాండిత్యనిధి భోజమహారాజు. అతని 'సరస్వతీకంఠాభరణము', అంతకంటె 'శృంగారప్రకాశము' ప్రాకృత గాథలకు నిధి. కాని వ్రాయసకాండ్ర చేతులు, పురుగులును ఆ గాథాభాషకు చేసిన యపచారముచే దాని తలతోఁకలు తెలియుట బహుశః సాధ్యముగాకున్నది. శృంగారప్రకాశమునుండి నాలుగుగాథలు మాత్రము ఈ పుస్తకము నాల్గవభాగమున నాతెలుఁగుతో చూడవచ్చును.

తెలుఁగుదేశమున ౧౫ వ శతకపుతొలిభాగమున కొండవీటిప్రభువు. సర్వజ్ఞచక్రవర్తి, వీరనారాయణుఁడు కోమటి వేమభూపాలుఁడు ఈ సప్తశతిని చేపట్టి వెలయించినవాఁడు, సప్తశతినుండి ఒకశతగాథలు మాత్రము ఏరుకొని 'సప్తశతీసారము' అనుపేర వానికి మంచి టీక రచించెను. * ఆ ప్రభువునాస్థానమందు 'విద్యాధికారి' శ్రీనాథకవిసార్వభౌముఁడు సప్తశతిని పూర్తిగా తన

* దీనిని ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రకటించి కృతకృత్య మైనది. కాని సంస్కృత ప్రాకృత భాషలు రెంటిని పరిశీలించి సవరించి దానిని మరల ముద్రింపవలసిన ఆవశ్యకత యెంతోకలదు.

'నూనూఁగు మీసాల నూత్నయౌవనమున' నే తెలిఁగించెనఁట. ఆ గ్రంథమింకను మనకు లభించు భాగ్యము రాలేదు. రానున్నదని పేరాసపడుదముగాక. శ్రీనాథుని తెలిఁగింపులుగా మనకిప్పటికి మూఁడు పద్యములు దొరకినవి. ఒకటి కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారు ౧౯౦౯ వ సంవత్సరమున తొలుదొల్త ప్రకటించిన నన్నిచోడకవి కుమారసంభవము పూర్వభాగము నాల్గవయాశ్వాసమున ప. ౫౬౭ క్రింది 'ఫుట్ నోటు' లో చూపినది.

ఉ. "వారణసేయ దావగొనవా, నవవారిజమందుఁ దేఁటి క్రొ
వ్వారుచునుంట నీవెఱుఁగవా, ప్రియవాతెరగంటిఁ గంటికే
వ్వారికిఁ గెంపురాదె, తగవా మగవారల దూర, నీమగం
డారసి నీనిజంబెఱుఁగునంతకు నంతకునోర్వ నెచ్చెలి."*

ఇది "కస్సవ ణహో ఇ రోసో" అనుదాని పరివృత్తి. గంగాధర టీకిత మూలమున ఇదిలేదు. కాని వేమభూపాలుని సంగ్రహమునఁ గలదు. ఇది తెలుఁగుదేశపు మూలసంప్రదాయములోనిదని వీబరుపండితుఁడు చూపినాఁడు. దీని తెలుగు మార్పు ఈ నా కూర్పులో (౩-౫౯) కలదు.

రెండవ మూఁడవ పద్యములీక్రిందివి. ఇవి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ప్రకటించిన 'క్రీడాభిరామము' నఁ జేరినవి.

మ. "పటు జంఝూపవనోత్తృణాలయములో భద్రంబుగం బట్టికం
కటిపై ముచ్చుముడింగి నిర్భరవియోగగ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచునున్న పాంథవనితన్ గర్జావచః ప్రౌఢిమన్
దటిదుద్ద్యోతము చూపు నట్టనడురే ధారాధరశ్రేణికిన్" (పు. ౧౯)

తే. "మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చరంబమ్ముకొన్నాఁడు పణములకును (?)
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికినొఱగోయకేలుండు సైరికుండు ? " (పు. ౮౬)

పై రెండు పద్యములకును మూలగాథలు ముద్రిత గాథాసప్తశతి యందు గలవు. (చూ. ౨-౭౦; ౩-౩౮) ఇందు నాతెలిఁగింపులు వానికున్నవి. (౧-౨౪౭; ౧-౧౯౧.)

---

(*) ఇది తరువాతి పండితులు సవరించిన పాఠము. కవిగారిచ్చినది కొంత అనన్వితము.

శ్రీనాథునితరువాత నాతరమువఱకు తెలుఁగువారిదృష్టిని ఈగ్రంథ మాకర్షించినట్లు కానరాదు నాపుట్టుకకు సుమారు ౧౯౧౭ వ సంవత్సరమున దీనిని తెలిఁగించు చాపల్యము గలిగినది. అట్లే ఈ శతాబ్దియందే పలువురు పండితులు విడి విడిగా ఆపనికి చేయివేసినట్లు కానవచ్చుచున్నది. కాని క్వాచిత్కముగా తప్ప నేనింకను ఆతెలిఁగింపులను చూడఁగలుగలేదు. ప్రాకృతభాషయందు నాకు అభిమాన మెంత యెక్కువో వ్యుత్పత్తి అంత తక్కువ. కనుక సప్తశతిని పూర్తిగా తెలిఁగించు ధైర్యము నాకుఁ గలుగలేదు. 'కావ్యమాల' వారి ముద్రణమును టీకయు మాత్రమే ఆధారముగా చేతనైనవి, రుచించినవి, గాథలు ౩౯౫ మాత్రము తెలిఁగించి ౧౯౩౧ సంవత్సరమున ప్రకటించితిని. అనంతపురమందలి 'శ్రీసాధన' ముద్రాశాలవారు దా నుపకరించిరి. అట్లే నాదృష్టికి వచ్చినవి, అర్థమైనవి, నచ్చినవి కొన్నిగాథలు కావ్యలక్షణగ్రంథములనుండి గ్రహించి తెలిఁగించుచు వచ్చితిని. వానిలో పెక్కులు ప్రకటించి 'భారతి' నాకుపకరించినది.

ఈ సమయమున జర్మనీ దేశమున వీబరు పండితుఁడు ప్రకటించిన ప్రతిని చూచుభాగ్యము నాకుఁ గలిగినది. ఆ మహనీయుని పరిశ్రమ ఎంత శ్లాఘించినను తక్కువే. ఆ ముద్రణము ౧౮౮౧ లో జరిగినది. ఎన్నో వ్రాఁతప్రతులను ఆ కాలమున సంపాదించి, దేశప్రయుక్తముగా వానిని వేఱుపఱిచి, అందు దొరికిన పాఠభేదములు మొదలగు మార్పులు ఒక్కటిగాని వదలక పట్టిలు చేసి, జర్మనుభాషలో ప్రతి గాథకును టీకనిచ్చి, సందిగ్ధస్థలములలో ప్రశ్నచిహ్నమును వేసి, మూలమును రోమనులిపికి మార్చి, జర్మను భాషయందే విపులమైన ఉపోద్ఘాతము రచించి- అసాధారణ కార్యము ఆ పండితుఁడు చేసి మనకిచ్చినాఁడు. తన కూర్పును అతఁడు నాలుగు భాగములుగా ఏర్పరిచినాఁడు: (౧) గంగాధరునిటీక ప్రకారము గాఁబోలు ౭౦౦ గాథలు గల సామాన్యమూలము, (౨ ఇతర వ్యాఖ్యాతల మూలమందు ప్రత్యేకముగాఁ గల గాథలు ౧౧౬, (౩) తెలుఁగుదేశమందలి మూలపాఠము నందలివి ౧౫౧, (౪) పైవానివంటివి అలంకార గ్రంథములనుండి మరి ౩౫, ఇట్లు మొత్తము గాథాసహస్రము సరిగా, వెండు సంఖ్యగా, అతఁడు కూర్చినాఁడు. నాకు జర్మను భాషయందేమాత్రపు పరిచయిమును లేదు. అది కల మిత్రులును లభింప లేదు. అందందు పరిచితమైన ఇంగ్లీషుపదములు, టీకాంతరములనుండి రోమను లిపిలో అతఁడుదాహరించిన వాక్యములు, అచ్చుతప్పుగంధము లేని మూలము- సంస్కృతచ్ఛాయ అతఁడియ్యలేదు - ఇవే నేను పట్టుకొని ప్రాఁకినవి. ఇంతలో

రెండుమార్లు ఎరవుతెచ్చుకొన్న ఆ పుస్తకముప్రతి తనచోటికి మరలి పోవలసి వచ్చినది. ఉపోద్ఘాతమైనను ఇంగ్లీషు భాషలో పరివర్తింపఁ జేయించుకొను అవకాశము, సమయము, చిక్కలేదు. దాని ప్రతులు దుర్లభములై పోయి యెంతో కాలమైనది. కనుక వెలకును దొరకవు. ఇట్టి స్థితిలో నిర్వేదపడుట తప్ప వేఱేమి చేయఁగలను! అతని మార్గమునే అనుసరించి యీ నాతెలుఁగు కూర్పును నాలుగు భాగములుగా ఏర్పఱిచితిని. ముఖ్యముగా తెలుఁగు మూలమందలివని అతఁడు ప్రకటించిన గాథలు ౧౫౧లో ఒకశతగాథలు నేనిందు సంగ్రహించి తెలుఁగు వారికందియ్యఁ గలిగితినని వీబరు పండితునికి నేనప్పుపడి సంతోషించుచున్నాను. వేమభూపాలుని శతకమున క్రొత్తగాఁదోఁచు గాథలన్నియు ఇంచుమించు ఇందుఁగలవు. ఇతరలాక్షణికుల గ్రంథములనుండి వీబరు ఎత్తిన గాథలలో కొన్ని యేరుకొని, నాదృష్టికందిన కావ్యలక్షణగ్రంథములలోనివి మరికొన్ని ఆభాగమున తెలిఁగించి చేర్చితిని. సామాన్యమూలమందు మరి ౧౧౭ గాథలేర్చి మార్చి చేర్చితిని. మొత్తము ఈ నా సంగ్రహమున గాథలు ౭౩౪ గా ఏర్పడి సప్తశతనియమమును దాఁటినవి. కొన్నిటికి లఘుటీక చేర్చితిని. ఎక్కువగా వివరించుట గాథాకవిత గాంభీర్యమును చెఱచునని, రసికులట్లే తలఁతురని, నానమ్మిక.

మరి 'సప్తశతి' గాథలనన్నిటిని పూర్తిగా తెలిఁగింపక కొన్నింటిని వదలుట యేల అను ప్రశ్న. దీనికి మొదటికూర్పున 'ప్రస్తావన' వ్రాసి నన్ననుగ్రహించిన శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారే జాబులో నాకీప్రశ్న వేసిరి. దానికి నేనిచ్చు సమాధానము తృప్తికరముగానుండునో ఉండదో తెలియదు. కాని దానినియ్యవలసి యున్నాను. కొన్నిగాథలలో చమత్కారము శ్లేషప్రధానముగా నున్నది. తెలిఁగించుట సాధ్యముగా తోపఁలేదు, నాకు మరికొన్నిటి భావము స్పష్టపడలేదు. గంగాధరుని టీక అట్టిచోట్ల నాకుపకరింపలేదు. కొన్ని సందర్భములందతఁడు చెప్పిన భావము నాకు తృప్తిగానుండలేదు. ఇంకకొన్ని గాథలందలి ప్రమేయము సౌమనస్య మర్యాదను మీరినట్లు నాకనిపించినది. కొందఱికి అది రుచింపవచ్చును. కాని నా మట్టుకు దానిమాత్ర కొంతయెక్కువగా భాసించినది. మరికొన్నిట తెలిఁగించు ప్రయత్నమునకు తగిన కవితావిశేషము గోచరింపలేదు. పైతరగతుల గాథలు ఒకటి రెండు నాకూర్పునఁగూడ మచ్చుకున్నవి.

ఈ తెలిఁగింపున 'గ్రామణి' అనుపదమునకు 'రెడ్డి' అనుపదమును వాడితిని. శ్రీ రామలింగారెడ్డిగారు ఆ పదము తమకు రుచింపలేదని నాతో చెప్పిరి. "అంతకంటె

మంచిపదము నాకు తోఁపదు. మా సీమలో గ్రామాధికారికి రెడ్డియనియే వ్యవహారము" అని నేనంటిని. "నిజమే కాని యేమో నాకాశబ్దము తృప్తికరముగా లేదు" అన్నారాయన. ఆ యతృప్తి నాకును గలదు. కాని విధిలేక దానినట్లే నిలిపినాను. ఇది ఇప్పటి రెడ్డి జాతివారికి ప్రత్యేకముగా అన్వయించునది కాదు. సహృదయులు దానిని గమనించి పోనిత్తురని నమ్మినాను.

ఇఁక నేనేరుకొన్న గాథలు మొత్తముమీఁద నాయభిరుచిని మాత్రమే సూచించును. కోటినుండి యేడునూర్లు మాత్రము సంగ్రహించిన హాలునికి, అందుఁగూడ ఒకనూరుగాథలు ఏర్చికూర్చిన వేమభూపాలునికిని గల వ్యక్తి స్వాతంత్ర్యమునే నాకును ఇచ్చి చదువరులనుగ్రహింతురని నమ్మినాను.

మూలమును రచించిన కవులు, కవయిత్రులు, అందరిరచన, సంప్రదాయమును ఒకటే; శబ్దార్థముల సంయమము; భావముల ఆర్జవము; అడ్డులేని సహజధారయు. తెలిఁగించునపుడు పై అసాధారణ గుణములకు లోపము రానీయక, తెలుఁగు పలుకుబడి చెడనీయక, రచింపవలెననియే నా పేరాస; నా పరాయణము. అందుకై ఏకవృత్తనియమమును వదలి తెలుగు జాతికి సహజమైన ప్రియమైన ఆటవెలఁది తేటగీతి కందములందే నాకృషి యథానుకూలముగ సాఁగించితిని. అనేకపద్యములు, ప్రాఁతవి క్రొత్తవి గూడ, మరల మరల సవరించితిని. నారచనయందలి ప్రకార-వికారములను నిర్ణయించువారు సహృదయులు. దీని పునర్ముద్రణమింత విలంబముగా జరిగినందుకదొక ముఖ్యకారణము. తొలి ముద్రణమునే యెంతో యుదారముగా విమర్శించి అభినందించిన సహృదయపండితులకు నాయనంతధన్యవాదములు.

ఈ ముద్రణ ప్రకటన భారము వహించి నన్ను ధన్యుని జేసిన పుణ్యము హైదరాబాదు ఆంధ్రసారస్వత పరిషత్తు వారిది. దానిని నిర్వహించినది నామిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు. వారి సహృదయతకు నా "అంజలిః పరమా ముద్రా".

దీనినింత శుద్ధముగా సుందరముగా త్వరగా ముద్రించిన శివాజీ ముద్రాశాలాధికారులకు నా నమోవాకములు.

| | |
|---|---|
| తిరుపతి<br>శోభనకృత్తు ఫాల్గున<br>శుక్లతృతీయ, భానువారము<br>16-2-64. | రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |

శ్రీ

శాలివాహన

# గాథా సప్తశతీ సారము

## 1 వ భాగము

తే. అలుకమెయి జేవురించిన యాదిశక్తి-
మోముఁజందురు నీడ లోమొలచియుండఁ
బూజతామర దాల్చినపోల్కిఁ బొలుచు
హరుని సంధ్యాజలాంజలికెరఁగుఁడీరు. ౧

(హాలుఁడు. ౧ శతకము, ౧ పద్యము)

ఆ. అమృతరసము చెవులకరయంగఁ బ్రాకృత-
కవిత; దానిఁ జదువఁగా వినంగ
లేనివారు సిగ్గులేక పూవిల్తుని-
తత్త్వముల నెఱుంగఁ దలఁతురెట్లు ? ౨

(౧ - ౨)

ఆ. గాథలొక్కకోటి గలవు లోకంబున;
వానిలోన నందమైనవాని
నేర్చి కూర్చిపెట్టె నేడు నూఱులు కవి-
వత్సలుండు శాలివాహనుండు. ౩

(హాలుఁడు. ౧-౩)

---

(ప. ౧) నన్ను మఱచి సంధ్యను ధ్యానించుచున్నాఁడని పార్వతికి కోపము. అర్ధనారీశ్వరుఁడు గనుక శివుని జలాంజలిలో ఆమెయెఱ్ఱఁబడిన మొగము ప్రతిబింబించినది. కనుక తామరపూవుతో పోలిక.

ఆ. కమలపత్రమందుఁ గదలక మెదలక
కూర్చుచున్నదదిగొ కొంగ చూడు !
అచ్ఛమైన విరివిపచ్చఱాతట్టపైఁ
జేర్చియున్న సంకుఁజిప్పవోలె. ౪

(పోదిసుఁడు. ౧-౪)

ఆ. 'కురవకంబుకొఱకు నరయుచున్నావేమి
నీకు దోహదంబు నెమకికొనక ?'
అనుచు మోముఁదమ్మి యటు ద్రిప్పి నీజాయ
యదిగొ నవ్వుచున్నదండకాఁడ ! ౫

(మయరందసేనుఁడు. ౧-౬)

క. మనయూరికొక్కసొమ్మై
కనుపండువు సేయుచున్న కమలవనము, కో-
సిన నువ్వుఁజేనివడువునఁ
గనిపించెడు నిపుడు మంచుకారున నత్తా ! ౬

(కుమారిలుఁడు. ౧-౮)

ఆ. పండి తెల్లఁబాఱు వరితోఁటలను జూచి
యేల మొగము వంచి యేడ్చెదమ్మ ?
చూడు జనుపచేను సొగసెక్కెనరిదళం-
బులఁదుకొన్న యాటవెలఁది వోలె. ౭

(మహిందుఁడు. ౧-౯)

---

(౫) కురవకము = ఎఱ్ఱ గోరంటచెట్టు. అది పూత నింపలేదని దానికి దోహదము - ఎరువు - విచారించుచున్నాఁడు మగఁడు. ఆపని యతఁడు తనకే చేసికొన్నచో బాగుండునని భార్య భావము. ఆ మాట చెప్పలేక నవ్వుకొనుట.

(౭) రహస్య సంకేత స్థానముగానుండిన వరితోఁటను ఇంకఁ గొన్నాళ్ళలోనే కోసి వేయుదురే యని నాయికకు దుఃఖము. జనుపచేను పెరిగి వచ్చుచున్నది భయపడవదని సఖి యూరడింపు.

ఆ. మోముఁదమ్మి నడ్డముగఁ ద్రిప్పికొని చెలి !
యూరకిట్టులేడ్చుచుండవలదు;
అలఁతి దోసతీవియలమాడ్కినివి యిల్లై
వక్రగతులు సుమ్ము వలపులెపుడు. ౮

(అలయఁడు - అనీకుఁడు ? ౧-౧౦)

ఆ. అడుగుఁదమ్ములందుఁ బడియున్న పతివీఁపు
చిన్నికొమరుఁడెక్కి చెలఁగియాడ,
అలుకయెంత గట్టిదయ్యును నిల్లాలి -
మోమునందు నవ్వు మొలచెనపుడు. ౯

(దుగ్గసామి- సిరిరాయఁడు ? ౧-౧౧)

తే. నిజము; చూడఁగనేర్చు నా నెలఁతకనులు;
తనకు సరివారియెడఁగదా తగును వలపు !
ఇంకనది చావనిమ్ము; నిన్నేమి యనను;
దానిచావైన మెచ్చుకోఁదగును జూవె ! ౧౦

(దుగ్గసామి. ౧-౧౨)

ఆ. వంటయింటి పనులనంటిన మసిచేయి
సోఁకియుండఁ జంద్రసుందరముగ
నింపు గొలుపుచున్న యిల్లాలి మోమును
నగుచునున్నవాఁడు మగఁడు చూచి. ౧౧

(హాలుఁడు. ౧-౧౩)

---

(౧౦) చూఁడదగిన వ్యక్తిని చూచి వలచుట కన్నుల నేర్పు. కాని ఆ వ్యక్తి లభించు నమ్మకముండదు. తగని వానిని వలచి సాధించుటకంటె తగిన వానిని వలచి నిరాశతో మరణించుట మేలు. నీయందు దానివలపు అంత తీవ్రముగానున్నదని దూతిమాటకు తాత్పర్యము.

తే. వంటవార్పుల జాణవు, వాలుగంటి !
యలుకగొనఁబోకు; రక్తపాటలసుగంధ-
మైన నీయూర్పుఁజవులకు నాసగొనుచుఁ
బొగలెగయుఁగాని మండదీ ప్రొయ్యినగ్గి ! ౧౨

(భీమసామి. ౧-౧౪)

ఆ. చెలులు చెంతఁజేరి తొలుచూలిబైకల
'నేమి కోర్కి నీకు నెఱుఁగఁజెప్పు;'
మనుచుఁ గ్రుచ్చి యడుగ నందంద దయితుఁడౌ
మగనికడకె పాఱె ముగుద చూడ్కి. ౧౩

(గయసింహుఁడు. ౧-౧౫)

క. అమృతమయరూప ! రజనీ-
రమణీ ముఖతిలక ! యంబరశిఖామణి ! చం-
ద్రమ ! ప్రియునిమీఁదఁ బఱపిన
హిమకరములె యిపుడు నాపయిం బఱపఁగదే ! ౧౪

(హాలుఁడు ౧-౧౬)

తే. 'అతఁడు పరదేశముననుండి యరుగుదెంచు !
నేను గోపింతు; నన్నూఱడించు నతఁడు;'
అనుచు దయితులయెడలఁ బేరాసలెల్ల
నెవరికో యొక్కరికి ఫలియించుఁ జెలియ ! ౧౫

(సిరిధమ్మియుఁడు. ౧-౧౭)

---

(౧౨) ప్రొయ్యి మండదని కోపించు నామెను జూచి రసికనాయకుని మేలపుమాట యిది.

(౧౩) బైకలు = వేవిళ్లు. బయకె అని కన్నడరూపము; కోరికయని అర్థము. 'బయ్యంక' అను దీని రూపాంతరమును మాత్రము శబ్దరత్నాకరము గ్రహించినది.

(౧౪) 'నా ప్రియునికి నీకిరణములు చలువగానున్నవి. కనుకనే అతఁడు రాక తామసించినాఁడు. నా పాలికవి వేఁడిగానున్నవి. నామీఁదఁగూడ అట్లే చలువగా కిరణములు పఱపితివేని ఈవిరహవేదన లేక నెమ్మదిగా నుందును' అని ఆమె భావము.

తే. దొంగనిద్దురవాఁడ ! ముద్దుగొనినట్టి
చెక్కిళుల రేఁగుపులకల చెలువు గంటి;
ఏల కనుమూసికొనెదు ! చోటిమ్ము కొంత;
మసలి యుండను లెమ్మిట్లు మరలనెపుడు. ౧౬

(చందసామి. ౧ - ౨౦)

ఆ. ముగియకున్న నేమి సొగసులు ? పొమ్మల్లె
వలచి వేచియున్న వానికడకు;
వలపువేఁడి చల్లఁబడెనేని మఱి వాని-
భావమందుఁ దగులలేవు, బిడ్డ ! ౧౭

(కాలిరాయఁడు - కలిరాజు ? ౧ - ౨౧)

ఆ. చేరి సంతసమునఁ జెక్కిళ్ళు పొంగంగ
నాజ్ఞలిచ్చు రాత్రులందు నాకు;
పగలు వంచియున్న మొగమునెత్తదు; చెలి
యదె యిదంచు నమ్ముటరిది చూడ ! ౧౮

(మయరందుఁడు. ౧ - ౨౩)

ఆ. ఎదకుఁ గూర్చువారి నెడఁబాసి, యొల్లని
వారిఁ జూచుచుండవలయుననెడు
కడిఁదిపనులు రెండుఁ గావించు నీచేతఁ
గులము; దీని మ్రొక్కవలయు బిడ్డ ! ౧౯

(వసుయారి - బ్రహ్మచారి ? ౧ - ౨౪)

ఆ. నెమ్మి రాత్రి సగమునిదురమబ్బునఁ గేలఁ
దడవఁ బ్రక్క వట్టిపడుక తగులు-
గాసి నెఱఁగవీవు; కాకున్నఁ జెప్పుమా
యెట్టు నేర్తువలిగి యిట్టులుండ ? ౨౦

(అద్ధరాయఁడు. ౧ - ౨౮)

తే. పొలయలుకఁ జిక్కి, బిగుమానమునకు నూర్పు-
దొంతరలనాఁగి యిరువురు దొంగనిదుర
పోవుచున్నారు మార్మొగములుగఁ, జెవులు
దెఱచికొని; చూడవలె నిందు దిట్టలెవరొ ! ౨౧

(కుమారుఁడు. ౧ - ౨౯)

తే. వెఱచి నడచెదు భార్యకు, వేఁపచేఁదు
గుడుచు పురువట్లు, పెదరెడ్డికొడుకవయ్యు;
కటికవాఁడవు; నిను జూడఁగనులె కడిఁది;
కాని నీకోసమూరెల్ల గాసిపడెడు ! ౨౨

(హరియాలుఁడు - శాలికుఁడు ? ౧-౩౦)

తే. కత్తియమ్ముల పోటుల గంట్లు గట్టి
యెగుడు దిగుడైన మగనిపేరెదను రేల
రెడ్డికోడలు చక్క నిద్రింపలేదు;
గాని, యూరెల్ల హాయిగాఁ గన్ను మూయు. ౨౩

(అంగరాయఁడు. ౧-౩౧)

---

(౨౦) 'పీవిట్లు అప్పుడప్పుడు కోపించుకొని పోవుచుండుటచే నేనా గాసి నెఱఁగుదును. నేను కోపించుకొన్నను ఎపుడుగాని నీవలె విడిచిపోను. కనుకనే నీకింత పొగరును నాకింత దీనత్వమును గలిగినవి' అని భావము.

(౨౩) ఆ పల్లెను దోఁచుకొన వచ్చిన శత్రువులతో పోరాడి గెలిచి కాపాడువాఁడు రెడ్డికొడుకు. దానివే కత్తియమ్ముల పోటులు.

ఆ. ఇంత గొప్పగుణము నెవ్వరుఁ జూపలే-
రవని నీవుదక్క నందకాఁడ!
నేఁటి వారికెల్ల మాటలోనొక్కటి
మదిని వేఱయొకటి యొదవుచుండు. ౨౪

(భోజయుఁడు. ౧-౩౨)

ఆ. పెడమొగంబు వెట్టి పడుకపై నేనుండ
వేఁడి యూర్పులిట్లు వెనుకనూర్చి.
మొదలు వగలఁబెట్టి యెదగాల్చినది గాక
యేల వీఁపుఁ గాల్చెదిపుడు పోర? ౨౫

(అణంగుఁడు. ౧-౩౩)

ఆ. మలిన చిత్తుఁడైన మరఁదికి నిల్లాలు
చిన్ననవ్వు దోఁపఁ జెప్పుచుండు,
రాము వెంటఁ దిరుగు సౌమిత్రి చరితంబు
గోడమీఁద వ్రాసికొన్నదాని. ౨౬

(హాలుఁడు. ౧-౩౫)

ఆ. రమ్యమైన రూపు; రమణుఁడు లేఁడూర;
పేదటికము; పెద్దవీథినిల్లు;
పరువమైన వయసు; పొరుగింట రంకెత!
యైనఁ జెడదు చూడు చానదత! ౨౭

(మహిలుఁడు - మల్లోకుఁడు? ౧-౩౬)

---

(౨౪) నాయకుఁడు పొరపడి ఇంకొక్కతెపేరితో తన్నుఁ బిలువఁగా ఒకధీర గంభీరముగా నిట్లు చీవాట్లు పెట్టినది. దానిపేరే యెప్పుడును నీమనసులోనున్నది గాన నోటను అదే వచ్చినదని భావము.

(౨౬) వదినె విషయమున మరఁది, సీతయెడల లక్ష్మణుఁడు వర్తించునట్లు, వర్తింప వలెనని తెల్పుటకు, ఆ కాలమందలి వదినెమరఁదుల వ్యవహారము వివిధముగా ఈ గాథలలో ప్రతిఫలించినది, ముందును చూడవచ్చును.

తే. కొండసెలయేటి సుడికిఁ జిక్కుకొని కలఁగి
తిరుగుచును, గేసరంబులు విఱుగఁ, జూడు,
అరమునిఁగి, తేలి, మునుఁగుచు మరలఁ దేఁటి
వెంటఁబడియుండఁ, గడిమిపూ వెల్లిఁగడచు. ౨౮

(అవటంకుఁడు. ౧-౩౭)

ఆ. ఇంటిపెద్దతనము నెచ్చుగా మన్నించు
పేదమగని పరువు పేరు నిలుప,
వైభవంబుతోడ వచ్చెడు తనచుట్ట-
ములకుఁ గూడ గృహిణి యలుకచూపు. ౨౯

(చుల్లోగుఁడు. ౧-౩౮)

తే. మగఁడు పొరుగూరికేఁగఁగ వగచు పేద-
రాలి నిరుగింటి మగువ నోదార్చుచుండి,
ప్రియతముఁడు కైవసముగ నుండియును బందు-
గయ్యెఁ దనుఁ గయిసేసికోదతివ, చూడు! ౩౦

(రవిరాయఁడు. కవిరాజు ? ౧-౩౯)

తే. నీవు వసియించుచోటని నెమ్మనంబు,
తనకు నివి నిన్నుఁ జూపినవనుచుఁ గనులు,
నిన్ను నెడఁబాసి కద యివి సన్నగిల్లె
ననుచు నంగమ్ములును బ్రియమయ్యెఁ జెలికి. ౩౧

(ముద్దఁడు. ౧-౪౦)

ఆ. చెలిమి మంచితనము వలపును గలచోటఁ
దగులమెవరికైనఁ దగును గాని,
మనసు లేనిచోట మనసునిచ్చుట నగుఁ-
బాటు చూవె చూచువారికెల్ల. ౩౨

(హాలుఁడు - నాథా ? ౧-౪౧)

క. సిరి గలుగు, నిజము; మరణముఁ
బొరయును, బనిపూని చేయు పూరుషునకు; నా
మరణంబూరకయున్నను
దొరకును గాని సిరి యట్లు దొరకొనదెపుడున్. ౩౩

(వల్లహుఁడు. ౧-౪౨)

క. పొరుగూరికేఁగు దయితుల
విరహము సైఁపనగు నాసవెట్టుకొనుచు; న-
మ్మరో! యున్నయూరనే యీ-
కరణి వలస 'చావు మేలుగా' యనిపించున్. ౩౪

(అమియుఁడు. ౧-౪౩)

ఆ. రాతిమనసుతోడ నాతఁడు రేపూరు
వదలి పోవుననెడు వార్త వుట్టె;
వానికెపుడుఁ దెల్లవారకయే యుండ
రాత్రితల్లి; పెరిగిరావె నేఁడు! ౩౫

(నిప్పటుఁడు - లంపుఁడు ౧-౪౬)

తే. వీడుకొనువేళ జీవంబు వెడలకుండు
మర్మమేమని యడుగుచు మలయసాఁగె
విరహమోర్చెడు సతుల మందిరములెల్ల
వలస పోవఁగవలసిన వానిగృహిణి. ౩౬

(సిహుఁడు. ౧-౪౭)

---

(౩౪) 'వలస' ఉన్నయూరిని ఒకటేమారు పూర్తిగా వదలి పోవుట. కాని యిక్కడ సామాన్యముగా ప్రవాసము - దేశాంతరములలో ప్రయాణించుట - అనునర్థమందు వాడఁబడినది.

(౩౬) పోయివచ్చెదనని భర్త వీడుకొనునప్పుడు తన జీవము నిలువదని భయము నాయికకు. ఇరుగు పొరుగు సతులు కొందఱు అట్టి సందర్భమున ప్రాణము చిక్కఁబట్టుకొనఁగలిగినవారుండిరి. ఆ రహస్యము నెఱుఁగుటకీప్రయాస.

క. మావానికితరవనితల
సావాసము గలుగునట్లు సవరింపవె, యో
దేవ ! యెపుడు నొకయంగన-
నే వలచిన మంచిచెడ్డలెఱుఁగరు పురుషుల్. ౩౭

(అనిరుద్ధుఁడు. ౧-౪౮)

తే. నట్టనడిపగలింటి యెండలకు వెఱచి
నీడయును జూడు మేనిక్రిందికి నొదింగి
యించుకంతయు వెలువడదిపుడు; నేద-
దేర్చుకొనరాదె యిందింత తెరువుకాఁడ ! ౩౮

(సురభివంసుఁడు - సురభివత్సలుఁడు ? ౧-౪౯)

తే. దూరముననుండి యెన్నఁడు దొరకనట్టి
యతనిఁ దోడ్తెచ్చితివి నేమమడుగు కొఱకు;
ఎంత మేలొనరించితి ! వింకఁ బ్రాణ-
మేని గొనిపొమ్ము జ్వరమ ! నిందింప నిన్ను. ౩౯

(సగ్గవమ్ముఁడు. ౧-౫౦)

---

(౩౭) శృంగారనాయికగా తక్కినవారికంటె తనయందుఁగల విశేషమును ఈ కృత్రిమ ప్రార్థనమూలమున ఈమె భావించి గర్వించుచున్నది.

(౩౮) తెరువరిమీఁద నాయికకుఁ గల్గిన యనురాగమిట్లు సూచితము.

(౩౯) విరహవేదనచే జ్వరము; కుశలప్రశ్నకై ప్రియుఁడు వచ్చినాఁడు. ఆజ్వరము ప్రాణాపాయకరమైనను అతఁడు వచ్చి తన్నుఁ బల్కరించుటకు కారణమైనది. కాని తన యందతనికి వలపులేదుగాన ఎట్లును తాను జీవించుట దుర్భరమని నాయిక సూచన.

తే. తగ్గియున్నదొ తగ్గదో ! దారిఁబోవు-
వారికందఱకేల నా జ్వరముచింత ?
బుగులుకొను వాసనలతోడి సొగసుకాఁడ !
నన్నుఁ దాఁకకుమా తెవుల్గొన్నదాని ! ౪౦

(కాలుఁడు. ౧-౫౧)

తే. కన్నులారఁగఁ దప్పు గన్గొన్న పిదపఁ
దెగిన దానిని మఱల సంధింతుమేని,
కాఁచి యార్చిన యుదకంబుకరణి, మిగులఁ
జప్పనై పోవుఁ బ్రేమంపుఁ జవులు చెలియ ! ౪౧

(వమ్మహుఁడు - బ్రహ్మచారి ? ౧-౫౩)

తే. ఉఱుమునకు నెక్కువై వెన్క మొరయు మగని-
వింటి పెనుమ్రోఁత నొకమారు వినినయంత
చెఱఁదగిలి పోవు జవరాలు వెఱపుఁబాసి
తోడిబందీల కన్నీళ్లగూడఁ దుడిచె. ౪౨

(కణ్ణుఁడు. ౧-౫౪)

---

(౪౦) ఇంకెక్కడనో భోగమనుభవించి నాయకుఁడు ఈమె ఆరోగ్య ప్రశ్నకు వచ్చినాఁడు. అతని తాఁకునుగూడ ఓర్చుకోలేనంత కోపమీమెకు. 'నా కుశలమడుగుటకును నీకధికారము లేదు' అనుచున్నది.

(౪౧) విఱిగిన మనసులను అతుకవలెనని చెలికత్తె చేసిన యుపదేశములకు నాయిక ప్రత్యుత్తరము.

(౪౨) యువతుల నపహరించి కొనిపోవుట ఆ కాలమున విరివిగా నుండినట్లు దోఁచును. ప్రాకృతభాషలో అట్లపహరింపఁబడిన స్త్రీకి 'కరిమరి' అని ప్రత్యేకముగా పేరును గలదు. అట్లు కొందఱు స్త్రీలను దొంగలపహరించుకొని పోవుచుండఁగా ఒకదాని భర్త ఎక్కువెట్టిన విల్లు మీటుచు వారిని వెన్నంటినాఁడు. ఆ సద్దు ఆమె యెఱుఁగును. తన భర్త శౌర్యమును ఎఱుఁగును. కనుక నిర్భయముగా తోడివారిని గూడ ఊరడించినది.

తే. మగని పెనువింటిసద్దని మదిని నమ్మి
పులకలూరక మెయినిండఁ బోసికొనెదు;
కాని, యో బందిపిల్ల ! యకాలమందు
పిడుగు రాల్చెడి మొగిలు చప్పుడిది; పదవె ! ౪౩

(మయరందుఁడు. ౧-౫౫)

ఆ. చెడ్డమనసు గలిగి యడ్డాడు మరఁది బా-
ధలను దెగువకాఁడు దయితుతోడఁ
జెప్పదింటి బ్రదుకు చెడునంచు, నానాఁటఁ
గోడలమలహృదయ గ్రుంగుచుండు. ౪౪

(మందహివుఁడు - ముగ్ధదీపుఁడు ? ౧-౫౮)

క. తలఁపున దయితుని గని త-
న్నలయించుటలెంచి వివశయగుచు బయలుతోఁ
గలహించు ముగుదఁ గని నె-
చ్చెలులేడ్చిరి గాని పరిహసింపరు కంటే ! ౪౫

(మందహివుఁడు - ముగ్ధదీపుఁడు ? ౧-౬౦)

తే. కనుఁడు ! చూరున దిగజారు తనదు పోగు
చక్క మీఁగాళ్ళ బిగఁదన్ని సాలెపురుగు.
కానరాని దారమ్మునఁ గట్టియున్న
యొక పొగడపూవువలె, వ్రేలుచున్నదదిగో ! ౪౬

(పాలితుఁడు - కాలితుఁడు ? ౧-౬౩)

---

(౪౩) బందిని గొనిపోవు చుండిన దొంగమాట యిది.

ఆ. గోపురంబు మీఁదఁ గొంత గన్పడు మేకు-
చెంతఁ బావురములు చేరి మూల్గఁ,
జూడు, దేవళంబు శూలమెక్కించఁ బడఁగ
బాధ నైఁపకేడ్చుపగిదిఁ దోఁచు. ౪౭

(పవరసేణుఁడు. ౧-౬౪)

ఆ. వలవఁదేని నిన్ను వాఁడు, నానాఁడిట్లు
క్రొత్తజున్నుపాలు గుడిచి చొక్కు-
నెనుపదూడ వోలె, నేల నిద్రించెదు
పగటి పూట నొడలు ప్రాలుమాలి ? ౪౮

(ముహరాయఁడు. ౧-౬౫)

ఆ. కన్ను మూయకుండఁ గడపెదు దీర్ఘహే-
మంతరాత్రులెల్ల మగువ! యిట్లు;
పలుదినములు గాఁగఁ బతి యూర లేఁడు; నీ
పగటిపూట నిద్ర బాగు గాదు. ౪౯

(కంతేసరుఁడు - ధీరుఁడు ? ౧-౬౬)

---

(౪౭) గోపురము మీఁది కలశమెవరో అపహరించిరి గాఁబోలు. దానికాధారమైన యినుపకడ్డీ మాత్రము మిగిలినది. శూలమెక్కించినవాని నెత్తిమీఁదను ఇట్లే దాని మొన కొంత మిగిలియుండును. ఈ యసహ్యమైన యుపమకు అదే సామాన్యధర్మము.

(౪౮) నాయకునికి తనపై వలపులేదని సత్యమును కప్పిపుచ్చు నాయికను జూచి మర్మజ్ఞురాలు చెలి చెప్పునది. 'జారుఁడు అభిలాషతో చెప్పుమాట' యని వ్యాఖ్యాత గంగాధరుఁడు?

(౪౯) ఈమె పతి యూరలేనప్పుడు శీలము చెడినది. ఆ సత్యమును గప్పిపుచ్చుచు చెలి, రాత్రి నిద్రలేమికి పతివిరహమే కారణమని యితరులకు సూచించుచున్నది.

ఆ. 'నడవలేని ముగుద యడుసును దాఁట నా-
యడుగులందె యడుగులిడినదింతె,
యనెదవందకాఁడ ! యట్లైన నీదు మే-
నెల్లనిట్లు పులకరింప నేల ? ౫౦

(చదురాయఁడు - ధీరుఁడు ? ౧-౬౭)

ఆ. పాఁపకడెము మిగులఁ బైపైకి బిగఁద్రోచి
పరమశివుఁడు కేలు పట్టినపుడె
చెలులు పెండ్లివేళఁ దెలియఁగల్గిరి గౌరి-
భాగ్యగరిమ యెంతపాటిదనుచు. ౫౧

(అణురాయుఁడు. ౧-౬౯)

తే. వింధ్యగిరిమీఁద వేసవివేళఁ దగులు
కారుచిచ్చుల క్రొంబొగల్ కాని, వాన-
కారు క్రొత్త మొగిళ్ళవి కావు; ధైర్య-
మూని యుండుము, మగఁడూరలేనిదాన! ౫౨

(వద్ధావహీ - అనురాగుఁడు ? ౧-౭౦)

---

(౫౦) బురదనేలలో ముందతఁడు నడచినాఁడు. వెనుక వానియడుగుగుర్తులలో అడుగుపెట్టుచు ఆమె నడచినది. దానికి మూఁడవవ్యక్తి యనురాగము కారణమని యాక్షేపమును సూచింపఁగా, అతఁడు 'బురదలో కాలు పూడిపోవునను భయమే కారణ' మని యపలాపించినాఁడు. ఆ మాటకిది సత్యమును వెలువఱచు ప్రత్యుత్తరము.

(౫౧) పాఁపకడెము = కంకణముగానున్న వాసుకి. క్రొత్తపెండ్లికూఁతురు భయపడునని శివునిభావము. ఇప్పుడే ఇంతయనురాగము చూపుచున్నాఁడు భర్తయని చెలికత్తెల సంతోషము. భాగ్యము = సౌభాగ్యము, భర్తృవాల్లభ్యము.

(౫౨) విరహాతురులకు వర్షాకాలము ఉద్వేగమును గలిగించును. ఇంకను వానకాలము రాలేదని చెలికత్తె యూరార్పు.

ఆ. వెలితిపుట్టకెంత నిలుపుకోఁగలవొ నా-
కంత యిమ్ము ప్రేమ; యదియె చాలు;
సొగసుకాఁడ! వలపు సురిఁగినప్పటి వంత-
లోర్చి యెల్లవారు నుండలేరు. ౫౩

(ముద్దసీలుఁడు. ౧-౭౧)

తే. వలపు పలువురపైఁ గల్గువాని చెలిమి
కష్టపడి యెదుపూటలు గాంచినట్టి
వనిత యాఱవపూటకు వాయి విడువ-
నేల ? యింపులు నింపులు నెట్టులబ్బు ? ౫౪

(అలయుఁడు. ౧-౭౨)

ఆ. రెప్ప వాల్పకుండఁ బ్రియుఁడు నాయంగమ్ము-
లందు దేనిదేని నరయుచుండు
దాని దానినెల్లఁ దవిలి మూయుదుఁ గాని,
యతఁడు చూడవలయుననియె వలతు! ౫౫

(వసంతయుఁడు. వసలకుఁడు ? ౧-౭౩)

ఆ. మగని తప్పుపనుల మనసెంత నొగిలినఁ
గాని వానిమీఁద దానియలుక
సడలి జాఱిపోవఁ దొడఁగెను, బిడికిటఁ
బట్టుకొన్న యిసుకపగిదిఁ జూడు! ౫౬

(మొత్తాహలుఁడు - ముక్తాఫలుఁడు - పవులిన్యుఁడు ? ౧-౭౪)

క. ఇలకుఁ బయినుండి రాచి-
ల్కలచాలదె వాలఁజొచ్చె, గగనేందిరకుఁ
గళమునఁ గల కెంపుల ప-
చ్చల కంటసరంబు తప్పి జాఱెడు ననఁగన్. ౫౭

(౧-౭౫)

ఆ. లేమికంత వగవలేదంత పరదేసి-
బ్రదుకునకును గొదువపడను; గాని,
కోరినట్టి కోర్కి గూడక చెలికాండ్రు
వచ్చినట్లె పోవ నొచ్చె మనసు. ౪౮

(భీమవిక్రముఁడు ? ౧-౭౬)

ఆ. పల్లెలందు గడ్డిపఱపులు, ప్రానిబో-
దియలచిచ్చులడవిదెసలఁ బ్రోచె;
పట్టణములఁ జూడు పాంథునిపైఁ జలి
కసిని దీర్చుకొనెడు కరణిఁ దోఁచు. ౪౯

(వినయాయితుఁడు ? ౧-౭౭)

ఆ. మోవి నొక్కినపుడు ముదిత శిరంబు నా-
డింప, మెఱుఁగుటలకలెల్లఁ జెదరి,
తావికొఱకుఁ దేంట్లు తారాడి ముసరిన
తమ్మిఁబోలు మోము దలఁతు నిపుడు. ౫౦

(ముక్తాధరుఁడు ? ౧-౭౮. వీబరుప్రతి; పీతాంబరుని టీక.)

ఆ. గోరువెచ్చఁ దావినీరాడి పండుగ-
సంబరంబుతోడ సవతులుండ,
సుదతి తానమాడఁ జునుఁగుచుఁ దనదు సౌ-
భాగ్యబలము చాటుపగిదిఁ దోఁచె. ౫౧

(కటిలుఁడు - కటిల్లుఁడు ? ౧-౭౯)

---

(౫౧) తనయందచందములకు స్నానము మొదలగు బయటి ప్రసాధనముల యక్కర లేదను అహంభావము సూచితము.

ఆ. తానమాడి సమ్మదమున దువ్వెనపండ్లఁ
జిక్కుకొన్న పసపు చిన్నముల్లు
గ్రుచ్చి తీసెదెవని కోరిక పండఁగఁ
జేయఁబూనినావె చిన్నదాన; ౬౨

(మయరందుఁడు. ౧-౮౦)

తే. కాఁపుకొమరుఁడు చెలువ! నీకై తపించి
యెంత నవయునొ నేఁజెప్పనేల ? చూడు;
మచ్చరము గల్గియును పెద్దమనసుదిదిగొ!
తార్పుకై వానియిల్లాలు తానె వచ్చె ! ౬౩

(ఈసాణుఁడు. ౧-౮౪)

తే. ఈవు దాక్షిణ్యమునకయి యిటకు వచ్చి-
నప్పుడును గల్గునింత సౌఖ్యంబు మాకు;
ఇంక మనసార నెవ్వరినేఁగిఁ చూతు-
వట్టివారల సుఖమెంతొ యందకాఁడ ! ౬౪

(ఆయివరాహుఁడు. ౧-౮౫)

తే. కొట్టి నొచ్చిన యొకచేయి వట్టి వాఁడు
వేగ నూర్పులగాలిచే విసరఁబోవ-
నేమి సేయుదు ? నవ్వుచు నేను వానిఁ
గౌఁగిలించితిఁ బెఱచేతఁ గంఠసీమ. ౬౫

(పహాయీ - ప్రహతా ? ౧-౮౬)

తే. అలిగి పెడమోముపెట్టి నీ వరుగుచున్నఁ
గాని, మానిని ! వెనువెంటఁ గదలి వచ్చు-
మగని ప్రక్కనె యున్నది మనసటంచుఁ
బులకరించిన నీ వీఁపె తెలుపు మాకు ! ౬౬

(రేవా. ౧-౮౭)

తే. ఊరడింపుల దిగఁబాటి యున్నఁగాని
యలుక యింకను మిగులుట తెలుపఁగల్గెఁ
గలికి, దయితునిచెంతనేకాంతమందుఁ
గూడ మరియాదనడతలతోడ మెలఁగి. ౮౭

(గామవుజ్జఁడు - గ్రామకూటుఁడు ? ౧-౭౭)

ఆ. చేసియున్నయవియొ చేయుచున్నవొ యింకఁ
జేయునవియొ ? నీదుచెట్టలందు
సరిగఁ జెప్పుమేవి మఱచి పొమ్మనెదవు !
సొగసుకాఁడ ! సిగ్గుదెగినవాఁడ ! ౮౮

(రేవా. ౧-౯౦)

ఆ. దొరతనంబు తమది నెఱపక, దాసులుఁ
బోలె నలుకగొన్నవేళఁ దేర్చు-
వారె ప్రియులు సుమ్ము వనితలకొరులెల్లఁ
బనికిరాని వట్టిభర్తలంతె ! ౮౯

(మాధవి - గజరేవఁడు ? ౧-౯౧)

ఆ. తనియకుండనెపుడుఁ గనుఁగొనవలసిన
యతనినొక్క నిముసమపుడు చూడఁ
గొంచెమేని దప్పి గుందదు, కలలోన
నలసి నీరు ద్రాఁగినట్టు లత్త ! ౯౦

(వజ్జఁడు. ౧-౯౩)

ఆ. ఉన్నయన్నినాళ్ళునొకసొమ్ముగానుండి
సజ్జనుండు విడిచి చనినయూరె,
పెద్దమఱ్ఱిమాను పెల్లగించినవేళఁ
బల్లెప్రక్కబయలు పగిదిఁజేయు. ౯౧

(హరకుంతుఁడు - హారకుంతుఁడు ? ౧-౯౪)

ఆ. పులకలెగసి కంచెవలెఁ జుట్టు నిండఁ జె-
క్కుళులనపుడు నీవు నిలిపినట్టి
పంటినొక్కులెల్లఁ బాపమాబిడ్డ యి-
ల్లడనుబోలె, నిపుడుఁ గడఁగి ప్రోచు. ౭౨

(సామియుఁడు - స్థిరసాహసుఁడు ? ౧-౯౬)

ఆ. మావిచివురు సూచె; మద్యంబు మూర్కొనె;
మలయమారుతంపుఁ జలువకోర్చె;
ఇంతయయ్యుఁ బనులె యెక్కువై ననువీడి
యేఁగె నత్త ! యెవరికెవరు వలయు ? ౭౩

(కొంతక్షురుఁడు - స్థిరసాహసుఁడు ? ౧-౯౭)

ఆ. తనివిదీఱకుండఁ గనుఁగొనఁ దగియుండి,
మనసు మనసుఁ గలిపి, మంచితనము-
నొసఁగి, సుఖము దుఃఖమొకటిగ మనువారి-
పొందు గనుట పెద్దపుణ్యమిలను. ౭౪

(సిరిసత్తియుఁడు - మకరందుఁడు ? ౧-౯౯)

ఆ. ఎవరికెవరు గూర్తురిలను వారికి వారు
నొంచినను సుఖంబు నించఁగలరు;
దయితుగోటకాటు దగిలి నొచ్చియును బా-
లిండ్లమీఁదఁ బులకలెగయుఁ గాదె ! ౭౫

(సిరిసత్తియుఁడు. ౧-౧౦౦)

ఆ. ఎంత నిల్పుకొన్నయేనియు దిగజాఱుఁ
జెలులు చెప్పిపెట్టు పలుకులెల్ల.
పూవువిలుతునంపపోటులు వడి పలు-
చిల్లులైన దానిచిత్తమందు. ౭౬

(మాణుఁడు. ౨-౧)

తే. కొమ్మకొనపయి గూఁటిలోఁ గూర్కుచున్న
తనదుపిల్లలఁ గాపాడుపనికె లోఁగి,
మునిఁగి పోవుదునను భీతిగొనక, చూడు,
వెడలెడిని గాకి ప్రమానిపై వెల్లివెంట ! ౭౭

(మాణుఁడు. ౨-౨)

ఆ. చూడలేక యేడ్చుచును గట్టకడపటి-
యిప్పపువులఁ జెడిపె యేఱుచున్న-
దదిగొ చూడు; చచ్చినట్టి చుట్టమ్మునె-
మ్మికల వల్లకాటఁ బుడుకునట్లు ! ౭౮

(సిరివలుఁడు. ౨-౪)

ఆ. చిన్నవాఁగువడికిఁ జిక్కి కొట్టుకపోవు
పొడుగుకట్టెవోలె, నడుమ నడుమఁ
దగులుకొనెదు మనస ! తప్పక యెవ్వఁడో
కడకు నిన్నుఁబట్టి కాల్చివైచు ! ౭౯

(మహాయేవుఁడు. ౨-౫)

---

(౭౬) ప్రియుఁడు దగ్గరకు వచ్చినవుడు బిగుమానముతో ధైర్యముతో వర్తింపుమని చెలులు బోధించినవి.

(౭౮) ఇప్పపూవులేరితెచ్చునెపమున ఆచోటు సంకేత స్థానముగా ఏర్పఱుచుకొని యుండెడిది. ఆపూవులకారు ముగిసినది. అందుకేడ్పు.

(౭౯) చిత్తచాపల్యమునాపుకొనలేని కాముకి చేసికొన్న ఆత్మహితోపదేశము.

తే. మగఁడు గోదావరీతీరమార్గమందు
మలయఁగాఁ జూచి కాఁపుకోడలు మిటారి,
కాలు వెట్టిన జాఱు దుర్గమపుఁజోట
నేటిలోనికిఁ బో దిగియెడిని గంటె ! ౮౦

(అవియకణుఁడు - అలికుఁడు ? ౨-౭)

ఆ. మఱపు రాదు నాకు, మాటాడకుండఁ బా-
దాలచెంత వాఁడు వాలియుండఁ,
గాలిబొటనవ్రేల గట్టిగా వానిపె-
న్నెఱులఁ జుట్టి యీడ్చు పరమసుఖము. ౮౧

(భమరుఁడు. ౨-౮)

ఆ. శీతకాలమందుఁ జిన్నపల్లియఁ, జూడు,
దేవళంపుబయటఁ దెరువుకాఁడు,
కాలియాఱునెండుగడ్డిమోపును గఱ్ఱఁ
గొట్టఁజొచ్చె, నెలుగుగొడ్డుఁబోలె. ౮౨

(కాలసీహుఁడు. ౨-౯)

క. కలఁగవు కమలంబులు; హం-
సలు గదలవు; చూడవత్త ! చక్కఁగనెవరో
వెలికిలగా నాకాశము
నిలిపినవారూరిచెఱువునీళులలోనన్ ! ౮౩

(మియంకుఁడు. ౨-౧౦)

---

(౮౦) అతఁడు చూచెనేని తనకు చేయూఁతనిచ్చి భద్రముగా మీఁదికెక్కించునని యాశ యామెకు.

(౮౧) వానికట్టి వేదన గలిగించుటయే తనకు సుఖము. ఆ వేదన కోర్చుకొని యైనను తన్నుతఁడాశ్రయింపక తీరదను సౌభాగ్యగర్వము.

(౮౨) నల్లనిబొచ్చు మీఁదను లోపల ఎఱ్ఱనిచర్మమును గలదిగాన యెలుగు గొడ్డుతో, మండి యాఱఁజొచ్చిన గడ్డిమోపునకు పోలిక. అడుగున ఆఱక మిగిలిన యగ్గి రగులుటకై యట్లు కఱ్ఱతో కొట్టుట.

ఆ. మగనిపయనమన్న మాటెవ్వఁడాడెనో!
వానిమనసు పాడుగాను! దాని
విన్న మొదలు విసముగొన్నట్లు కోడలి-
యవయవంబులెల్ల నవయసాఁగె! ౮౪

(మియంకుఁడు. ౨-౧౧)

ఆ. 'ఇఁకను జిన్నిబాలుఁడేగదే మాకృష్ణుఁ'-
డని యశోద పల్క నతనిమోము-
కడకుఁ జక్క గొల్లపడుచులు వాల్చూపు
సాఁగఁ బఱపి నగిరి సద్దులేక. ౮౫

(విధి (నిధి-పీబరు) విగ్గహుఁడు. ౨-౧౨)

ఆ. మొదలు తుదయు నొక్కమొగిగ నానాఁట నె-
వ్వారిప్రేమ వడ్డివారుచుండి,
యప్పువోలె బిడ్డలందును జొఱఁబాఱు
నట్టివారు సుజనులరుదు సుమ్ము. ౮౬

(ఇందుఁడు - ముద్రుఁడు ? ౨-౧౩)

ఆ. తోడిగొల్లపడఁతులాడు నాట్యము మెచ్చు-
నెపముతోడఁ జెంత నిలిచి, జాణ
యొక్కవ్రేఁత, వారి చెక్కుటద్దములందు
మొలచు కృష్ణునీడ ముద్దుగొనియె. ౮౭

(గువరుఁడు - పురుఁడు ? ౨-౧౪)

తే. దరుల నిండఁగ నొండొంటఁ దవిలి దిశల
నలమికొని యున్న మేఘమండలము మరల
విచ్చుకొనుచుండఁ గంటిరే! వింధ్యశిఖరి
తోఁచుచున్నది కుబుసంబుఁ దొలఁచునట్లు. ౮౮

(కమలుఁడు. ౨-౧౫)

ఆ. చెంచుమగలు ముదముచేఁ జూచుచున్నారు
విండ్లనూని శిఖరవీథి నిలిచి,
మత్తగజములట్లు క్రొత్తమేఘములు పైఁ
బ్రాఁకుచున్న వింధ్యపర్వతమును. ౮౯

(హాలియుఁడు - హాలికుఁడు ? ౨-౧౬)

ఆ. కాఱుచిచ్చుబూదిఁ గార్కొన్న వింధ్యంబు
పొలిచె ధవళమేఘపూర్ణమగుచు,
కడలిఁ ద్రచ్చువేళఁ గ్రమ్మిన పాలతుం-
పురులఁ దోఁగు విష్ణుమూర్తిఁ బోలె. ౯౦

(హాలుఁడు - శాలివాహనుఁడు. వీబరు. ౨-౧౭)

ఆ. చుట్టములు నశింప శోకించుచుండియుఁ
బరమ వీరుఁడనుచుఁ దరుణచోర-
వరుని వలచి చూచెఁ జెఱఁబడ్డ వాల్గంటి !
గుణము నెవరు మెచ్చుకొననివారు ! ౯౧

(హాలుఁడు - శాలివాహనుఁడు. వీబ ౨-౧౮)

ఆ. చెంచుమగువయింటి చెంగటఁ జెక్కిన
మగని పెద్దవింటఁ దెగిన చిఱుగు-
పొట్టు మింటికెగరి పోయెడు సుడిగాలి;
దాని సొబగునకుఁ బతాక యనఁగ. ౯౨

(హాలుఁడు-శాలివాహనుఁడు. వీబ. ౨-౨౦

---

(౯౧) దొంగ బందిని గొనిపోవుచుండఁగా ఆమె బంధువులు వచ్చి యడ్డుపడిరి. ఆ పోరాటంలో దొంగ వారినందఱను చంపెను.

(౯౨) వలపు మక్కువ యెక్కువై దౌర్బల్యముచేత చెంచుమగఁడు అంతవఱకుఁ దానుపయోగించుచుండిన పెద్దవిల్లును మోయలేక చెక్కి సన్నఁబఱిచెను. వాని పెండ్లాము ఊడ్చి బైట చల్లిన యా పొట్టు సుడిగాలికెగిరి దాని సౌభాగ్యమును చాటుచున్నది.

తే. క్రొవ్వి యేన్గులు రాయు చెక్కుల మదంబు
గ్రమ్మి మాసిన కానుగుఁగొమ్మలపుడు
చూచి, పుట్టింటినుండి వచ్చునదిత్రోవఁ
జెంచిత యెఱింగె 'మగఁడు గతించె' ననుచు. ౯౩

(గంధరాయఁడు. ౨ - ౨౧)

తే. పెద్దయిల్లాలి చనవుఁ దప్పింపలేక
నవవధూప్రేమఁ దగిలి సన్నగిలి, చెక్కి-
చిక్కఁబఱుపని పెనువిల్లె చెంచు, చూడు,
మోసికొని పోవు నడవికి మోయలేక. ౯౪

(కణ్ణవుత్తుఁడు. ౨ - ౨౨)

క. తొలుకాన్పువేళఁ గల నొ-
ప్పులు పడఁగాలేక ముగుద 'పోండు! మగని మా-
టలు చాలు నాకునిఁక' నని
పలుకుచు నవ్వించె నచటి పడఁతులనెల్లన్. ౯౫

(అణురాయుఁడు - అవిరాగుఁడు.వీ. ౨ - ౨౩)

ఆ. అత్త! మనుజజాతులందు వంచన లేని
వలపులుండవెందుఁ దలఁచి చూడ;
ఉండెనేని యెవరికొదవెడు నెడఁబాటు?
ఒదవెనేని యెవరు బ్రదుకఁగలరు? ౯౬

(రాముఁడు. ౨ - ౨౪

---

(౯౩) మగఁడు బ్రదికియుండినచో అచోటికి అంత నిర్భయముగా ఏనుఁ. రాఁజాలవని అది యెఱుఁగును.

తే. దానిపై నీకు వలపు; నీపైన నాకు ;
నిన్ను నది యొల్లదొల్లవు నన్ను నీవు !
చిన్నవాఁడవు నీకేమి చెప్పఁ ! బ్రేమ
పలువికారములనియెడు పలుకు నిజము. ౯౭

(ఉజ్జయుఁడు – ఉజయుఁడు ? ౨ – ౨౬)

క. చెలికత్తెలు కడుజాణలు;
వలుపులు తలమున్కలగును వానికి; నే సి-
గ్గులదాన; నింక నాపద-
ముల లత్తుకపూఁతలేల పూనెదు పోవే ! ౯౮

(శాలివాహనుఁడు. పీ. ౨ – ౨౭)

క. సురభిసమీరాహతబం-
భరనాదము నిండునడవిఁ బాంథుల మనసుల్
కరఁగఁగఁ బాడుచునున్నది
చిరవిరహపుఁ బాట గొల్లచిన్నది కంటే ! ౯౯

(సాలియుఁడు. ౨ – ౨౮)

క. వలదన్నను మగని పదం-
బులుగొని యిల్లాలు సంజప్రొద్దున నింకన్
వెలుఁగుండఁగానె కడిగెడుఁ
దలఁపెఱిఁగి యతండు నవ్వఁ దానును నగుచున్. ౧౦౦

(హాలుఁడు. ౨–౩౦)

---

(౯౮) పారాణి పూనెదనని నిర్బంధించు సైరంధ్రితో నాయిక చెప్పుమాట.

(౧౦౦) కాళ్ళు గడుగుట మడి గట్టుకొని సంధ్యాదికృత్యము లాచరించి భోజనమునకు సిద్ధపడుటకు. దానికి తరువాత అతఁడు బయటికిఁ బోవుట అరుదు. బైటికి సంజకు ముందే వెళ్లిన వాఁడు రాత్రి మరెక్కడనైనను గడపి వచ్చుట పరిపాటి. అది కాఁగూడదని యామె తలఁపు. దాని నతఁడును గ్రహించి నవ్వినాఁడు. అతఁడు గ్రహించినాఁడని ఆమెయు నవ్వినది.

ఆ. పిలువనిందు దానిపేరు పెట్టియె నన్ను;
చెప్పి ఫలము లేదు చెలియలార !
అతని మీరలేమియాడకుఁడెందైన
నొక్కమనసు తోడనున్నఁ జాలు ! ౧౦౧

(కుసుమరాయఁడు - సోమరాజు. పీ. ౨-౩౧)

తే. కనుల రూపంబు, తాఁకుడు తనువునందు,
చెవుల వలపుల మాటలు, చిత్తమందు
చిత్తమును నాఁటినట్లు నిల్చినవి; దైవ-
మిందు మమ్మెడఁ బాపినదేమి చెపుమ ! ౧౦౨

(బంహగతి. ౨-౩౨)

ఆ. కనులు మూసికొనుచుఁ గాంతుఁడు తనచెంతఁ
జేరినట్లు దలఁచి సెజ్జమీఁదఁ,
గాంత, సడలినట్టి గాజులకేలు సా-
రించి తన్నె కౌఁగిలించికొనియె. ౧౦౩

(బ్రిహ్మగతి. పీ. ౨-౩౩)

ఆ. లోభివానిచేతిలోని సంపద యెంత
వెలయుచున్న సుంత ఫలము లేదు,
తెరువు నడుచువేళఁ గఱకు వేసవియెండ
మాఁడువానికిఁ దన నీడవోలె. ౧౦౪

(కుందపుత్త్రుఁడు. ౨-౩౬)

---

(౧౦౧) తన ప్రియురాలైన మరెవ్వతె పేరుతోనో ఆమెనతఁడు పొరపడి పిలిచినాఁడు. దానికి చెలికత్తె లాక్షేపింపఁగా, అతని చపలస్వభావమునకు వేసరి ఆమె చెప్పుమాట.

(౧౦౨) వియోగకాలమున తన్ను తప్పుదారికీడ్వఁ బ్రయత్నించు దూతితో తనకతనితో ఎడఁబాటే లేదని శీలవతి చెప్పుమాట.

ఆ. అదిరెడెడమకన్ను ! యందుకు ఫలముగా
నిపుడు ప్రియుఁడు వచ్చునేని యిటకు,
కోర్కిదీఱునట్లు కుడికన్ను మూసి నీ-
తోన చాలసేపు వానిఁ జూతు ! ౧౦౫

(సత్తిహత్థి-శక్తిహస్తుఁడు. వీ. ౨-౩౮)

ఆ. వేఱువేఱు పువుల సారంబు చవిచూడ
వలచి గండుదేఁటి మలయుటెల్ల
దానితప్పటంచుఁ దలఁపకు, తేనెలు
లేని కుసుమములది గాని, చెలియ ! ౧౦౬

(అణురాయుఁడు. ౨-౩౯)

తే. వాలుఁజూపుల నల్లకల్వలను రచ్చ
కెలఁకుల విదిర్చి, మంగళకలశయుగముఁ
బోలు చనుదోయి వాకిటఁ బొందుపఱిచి,
చెలువ నీరాకకెదురుచూచెడిని నేఁడు. ౧౦౭

(హాలుఁడు-వాహనుఁడు.వీ. ౨-౪౦)

ఆ. ఏడ్వఁగల్గుదాఁక నేడ్చెను ; మేను కృ-
శింపఁగల్గుదాఁకఁ జెడి కృశించె;
ఉసురు గల్గుదాఁకనూర్చె నిట్టూర్పులా-
బిడ్డ, నీదువలపు పిచ్చి పట్టి. ౧౦౮

(వేరసత్తి. ౨-౪౧)

---

(౧౦౫) ఎడమకన్నదరుట స్త్రీలకు శుభమునకు సూచకము. కుడికంటి యదరు వారికి అశుభ సూచకము. ఇప్పుడు తానుగోరు ముఖ్యశుభము ప్రియుని రాక. ఎడమకన్ను అదరినది గనుక వచ్చినవానిని తనివిదీర చూచునధికారము అదే సంపాదించుకొన్నదనుట.

(౧౦౬) మగవారును ఇట్లే తమ్ము వలపించుకోఁగల స్త్రీలకై తిరుగాడుదురని, అట్టి నాయిక లభించినచో వెలిచవులకు పోరని, భావము.

క. సమసుఖదుఃఖులగుచుఁ గా-
లము కొలఁదిని నెయ్యమగ్గలంబయి మను నా-
లుమగలలో నెవ్వరు మును
సమసిన నది బ్రదుకు; బ్రదుకు చావితరులకున్. ౧౦౯

(వడ్డరంకుఁడు ? ౨-౪౨)

తే. ఎలచివురుతోడఁ బ్రస్థానకలశమందు
మొదటి మామిడి పూగుత్తి ముడిచినాను;
అడలి యేడ్వకు కూఁతుర ! అదియె నీదు
ప్రియుని పరదేశయాత్ర వారింపఁగలదు. ౧౧౦

(వడ్డరంకుఁడు. ౨-౪౩)

ఆ. సందుఁ జూచి చెలియలందఱుఁ జేరి నా
మనసునందు బలిమిఁ జొనిపినట్టి
యలుక, ప్రియుని జూచినప్పుడె నిలువక
మాయమయ్యె - దొంగమగని కరణి. ౧౧౧

(వలాయిచ్చుఁడు-వలయీపితుఁడు. వీ. ౨-౪౪)

తే. 'కుసుమపువు రాలినది చూచుకోవె నీదు
చంటిమీఁద !' నటంచును గొంటెచెలుల-
మాటవిని గోటికాటును మీఁటఁబోయి,
నవ్వుపాలయ్యెఁ గ్రొత్తపెండ్లాము ముగుద. ౧౧౨

(వలాయిచ్చుఁడు. ౨-౪౫)

---

(౧౧౦) ప్రయాణకాలమున శుభశకునముగాఁ జూచుటకు ఇంటిముంగిటఁ బెట్టునది పూర్ణకలశము. దానిమీఁది మామిడిచివురును పూవును జూచినతోడనే వసంతకాలము వచ్చినదని తెలియును. తెలిసిన తర్వాత వలసపోవు ధైర్యము అల్లునికుండదని తల్లిభావము.

ఆ. మనసునందు వలపు మాయుటఁ జేసి కాఁ-
బట్టకుండ, నొక్కపట్టునందు
నిలువకయె చలించు నీయరచూపులు
పెల్లగించుఁ గదర యుల్లమెల్ల ! ౧౧౩

(విజయగయి. ౨-౪౬)

ఆ. నిదురవడికిఁ జిక్కి కుదుట నిల్వక కన్నుఁ-
గోనలందు నీడ్చికొనుచుఁ బాప-
లలయు వాలుగంటి యరగంటి చూడ్కుల
యుదుటు మదనుఁడైన నోర్వఁగలఁడె ? ౧౧౪

(హాలుఁడు. ౨-౪౭)

ఆ. విడువరాని వలపుముడినెట్టులెట్టులో
ప్రాణమొకటి యుండఁ బట్టియుంటి;
పాడుమనస ! యింకపయినైనఁ జాలింపు;-
మెవనియందుఁ దవిలి నవయవలదు ! ౧౧౫

(అవజ్ఞాంగుఁడు. ౨-౪౯)

ఆ. అర్కమండలమున నకలంకమౌ చంద్ర-
మండలంబు సొచ్చియుండు పగిది-
నెవని కౌస్తుభమునఁ దవిలియుండును లచ్చి-
మొగము, వానికీరు మ్రొక్కులిడుఁడు. ౧౧౬

(ణికలంకుఁడు-కలంకుఁడు. వీ. ౨-౫౧)

---

(౧౧౫) ఇఁకమీఁద ప్రాణము నిలువదని భావము.

ఆ. ఓర్వరాని పతివియోగంపు ఱంపము
చీల్చుచున్న దాని చిత్తమునకుఁ
గంటె! యురముమీఁదఁ గాటుకకన్నీరు
జాఱఁజొచ్చెఁ గొలఁతదారమట్లు. ౧౧౭

(సాహిల్లుఁడు. ౨-౫౩)

ఆ. తగినచోటుగాదు దాఁచుటకిది; యేల
సాహసంబుఁ జేయఁజనెదు కొడుక ?
ఇందు దాఁచినట్టి హృదయంబులేమి చే-
సినను మరల నిన్నుఁ జేరరావు! ౧౧౮

(సాహిల్లుఁడు. ౨-౫౪)

ఆ. వలపుఁజొక్కు దప్పికలనెల్లజనులకా-
ర్పంగఁజాలి, పలుదెఱంగులైన
సాళగింపువగల సమకూడు వెలయాంధ్ర
నెయ్యములకు జయము నెగడుఁగాత! ౧౧౯

(హాలుఁడు. ౨-౫౬)

తే. వలపు విఱుగుడులెఱుఁగవు; వచ్చి 'సన్న-
గిల్లి తదియేల ?' యని యడిగెదవు నగుచు;
చపలచిత్తము గల ప్రియజనము చేత
నీవుఁ జిక్కినయపుడు వచింతుఁ బోర! ౧౨౦

(౨-౫౭)

---

(౧౧౮) 'దానివలలోఁ దగిలితివేని మరల తప్పించుకోవలే' వని నాయకునికి ఒక వృద్ధురాలి హితోపదేశము.

(౧౧౯) సాళగింపువగలు = ఎరవు తెచ్చుకొన్న అందచందములు.

(౧౨౦) 'నీవు వలచిన మరియెవతెకో నీయెడ స్థిరమైన వలపున్నది. నిన్ను వలచిన నాయందు నీకదిలేదు. కనుక నాకష్టము నీవెట్లెఱుఁగుదువు? నీ ప్రియురాలును నీవలె చపల చిత్తురాలైనప్పుడు నీవును నావలె కృశింతువు' అని భావము.

ఆ. చెలుల మాటలెల్లఁ జెవిని బెట్టక నీదు
వెంటఁ దవిలియుంటి వేనికొఱకు,
ఆ సుఖంబులివి సుమా యిప్డు! వీనిచేఁ
బ్రాణమునకె సందియంబు గలిగె! ౧-౨౧

(దేవుఁడు. ౨-౫౮)

ఆ. ఓర్వలేమి యొక్కటున్నది గాని యా-
వనిత మగఁడు, తల్లి! వట్టిగోల;
ఇప్పపువులు దానినేరనీయఁడు రేలఁ,
దానె త్రుంచి తెచ్చుఁగాని పోయి! ౧-౨౨

(అరికేసరి. ౨-౫౯)

ఆ. పట్టుకొన్న చెఱఁగు బలిమినీడ్చుక పోవు
గడుసుదాన! మెల్ల నడచిపొమ్ము;
చనుల ప్రేఁగు మోవఁజాలని లేఁగౌను
విఱుగుననియు నింతవెఱవవకట! ౧-౨౩

(గుణద్ధుఁడు. ౨-౬౦)

తే. వ్రేళ్ళ సడలించి మీఁగన్ను వెట్టి నీరు
తిన్నఁగాఁ ద్రాఁగు తెరువరి తెఱఁగు సూచి,
యవుర! చలిపందిటిని గాచునతివగూడ
సన్ననౌ ధార మరియును సన్నగించు. ౧-౨౪

(భాడ్డయుఁడు. ౨-౬౧)

---

(౧-౨౧) నిన్నేనమ్మిన నన్ను నీవిట్లు విరహము పాలుచేసితివి. ఇఁక నాబ్రదుకు సంగిగ్ధమని తా.

(౧-౨౨) ఇప్పమ్రాను సంకేతస్థలము. పూల నెపమున రాత్రులందక్కడకు పోవు భార్యను భర్త నమ్మఁడు. కనుక తానే తెచ్చెదనని పోవును. కాని ఇంటిలో భార్యను ఒంటరిగా వదలి పోయినను ఆమెకదియే సంకేత స్థానమగునని ఊహించుకోలేఁడు. అదే గోలతనము.

(౧-౨౪) ప్రథమ దర్శనమందే యిరువురికిని గల్గిన పరస్పరానురాగమిట్లు సూచింపఁబడినది.

ఆ. తిరిపగాఁడు నాభిఁ దేరి చూచుచునుండ
నదియు వానిమోము నరయుచుండె;
దానిచేతి గరిటె వానిచేతుల చిప్పఁ
గాకులొడిసి యేటి గతుకఁజొచ్చె! ౧౨౫

(నసిరాయఁడు. ౨-౬౨)

తే. ఎవని వదలిన జీవంబు నవసి చనునొ
యతని నపరాధియయ్యు నోదార్పవలయు;
ఊరు గాలుచుఁ బొలివోవుచున్నఁగాని
యగ్గినొల్లని వారెవ్వరతివ చెపుమ! ౧౨౬

(రోహా. ౨-౬౩)

తే. సోగకన్నుల నెవ్వరిఁ జూతుమెవరి
తోడఁ జెప్పికొందుము సుఖదుఃఖములను?
ఎవరితో నవ్వులాడుదుమెందుఁ గనినఁ
బామరులు నిండియున్న యీ పాడుకొంప! ౧౨౭

(మేహణాయుఁడు. ౨-౬౪)

ఆ. ప్రత్తిచేను దున్ను పనికి మంచిదినాన
మడకపూజ సేయఁ దొడఁగునపుడు
కోర్కులాత్మ గుబులుకొన గడగడమని
వడకఁ జొచ్చెఁ గాపుచెడిపెకేలు. ౧౨౮

(కహిలుఁడు. ౨-౬౫)

---

(౧౨౮) చక్కఁగా ఎదిగిన ప్రత్తిచేను ఆమెకు మంచి సంకేత స్థానము కాఁగలదు. ఆ కాఁబోవు సుఖసంగతులను తలఁచుకొనినంతనే కలిగిన సాత్త్వికభావ మీవడఁకు.

ఆ. నలువలఁకులఁ జీఁకటులు గ్రమ్మ పెనుమఱ్ఱి-
మ్రానియాకులెవ్వరైనఁ గోసి
కొందురనుచుఁ జెడిపెలందంద దానిపై
నిండఁ జల్లినారు పిండిగలిపి. ౧౨౯

(అహరాయఁడు. ౨-౬౬)

ఆ. సొగియఁజేయు దయితమొగముఁ జూచుట యుండ
నిమ్మగాని, దానికేమి విలువ!
పొలఁతి యున్న పల్లెపొలిమేరఁ గన్నను
జాలుఁ, గన్నుదోయి చల్లఁబడును. ౧౩౦

(౨-౬౮)

ఆ. ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటిపాడు సూచి యేడ్వలేక,
చనఁడు పొలము విడిచి పనిలేకయున్నను
పామరుండు చూడు పల్లెకాపు! ౧౩౧

(పుండరీయుఁడు. ౨-౬౯)

తే. పూరికొట్టము పెద్దగాడ్పునకుఁ జెదర
లోన దిగు వానసోనల నానకుండ,
గడువు దినమని గోడపై నిడిన వ్రాఁతఁ
జేతులడ్డముపెట్టి ప్రోచెడిని గృహిణి. ౧౩౨

(జయసేనుఁడు. ౨-౭౦)

---

(౧౨౯) కాకులు మొదలగు పక్షులు రెట్టవేసినవనుకొని కోయక వదలుదురని భావము.

(౧౩౨) మగఁడు ఊరువిడిచి పోవునపుడు ఇన్నవనాఁడు తప్పకవత్తునని చెప్పిన దానిని మఱచిపోకుండ గోడమీఁద ఆమె వ్రాసిపెట్టుకొన్నది.

తే. కోఁతి యదె చూడు! గోదావరీతటమున
నల్లయావాలయాకులు నమలి, యెగసి
యదరిపడియెడు; కొక్కుకొక్కనుచు డోకు-
వెట్టెడును; కొట్టుకొనియెడుఁ బొట్టమీఁద. ౧౩౩

(ఐరవాహణుఁడు. ౨-౨౧)

ఆ. కాపు, దున్నపోతు గడచన్న, దానిపై
గంటసరముఁ దడవుగాఁగ మోసి-
కొనుచు మందలన్నియును జుట్టి కడపట
నమ్మవారి దేవళమ్ముఁ జేర్చె. ౧౩౪

(సచ్చసామి. ౨-౨౨)

తే. మత్తగజకుంభములఁ బుట్టు ముత్తియముల
తొడవులను దాల్చు సవతులనడుమఁ, గురుల
నెమలి యీఁకలు గొన్ని సొన్పికొని, బోయ-
పడుచు పెండ్లాము పొగరుతో నడచుఁ గంటె! ౧౩౫

(పోటిసుఁడు. ౨-౨౩)

క. వంకరచూపులఁ జూచుచు
వంకరపల్కులను బల్కి వంకరనడలున్
వంకరనవ్వులుఁ గలుగు శ-
శాంకముఖులవలపు పుణ్యసాధ్యము కొడుకా! ౧౩౬

(వప్పసామి. ౨-౨౪)

---

(౧౩౪) దానివంటి పెద్ద యెనుఁబోతే యింకొకటి కొనవలెనని ప్రయత్నము; దాని పెద్దగంటల పలుపు కొలతకు, అది దొరకలేదు. గనుక ఇంకెందును ప్రయోజనము గానక దానిని అమ్మవారికి సమర్పించుట.

(౧౩౫) తన్ను పెండ్లాడుటకు మునుపు ఏనుఁగులను వేఁటాడఁగలిగిన బోయనాయఁడు ఇప్పుడు తనమీఁది వలపు మిక్కుటమై నెమళ్ళవేఁటకు దిగినాఁడు. ఆ సౌభాగ్యము సవతులకు లేదని బోయపడుచు పొగరు.

ఆ. ఇచ్చకొలఁదిఁ దిరుగు మింకబైరాగి ! గో-
దావరీతటమున దట్టమైన
పొదలఁ జేరి యెక్క పొగరైన సింగమా-
కుక్కపోతునిపుడు కొఱికి చంపె. ౧౩౬

(౨-౬౪)

తే. గాలిఁ గదలిన చెవిమీఁది కలువనుండి
కంట రాలిన పుప్పొడి కడకునూఁదఁ
బోయి తనియక ముద్దాడు పుణ్యశాలి
కృతివి; నీవెవ్వఁడవుర దేవతలలోన ? ౧౩౭

(పాలితుఁడు. ౨-౬౫)

ఆ. కడిమిపువులు నన్నుఁ గలఁగించినట్లు గ-
లంపలేవు చెలియ ! లాఁతిపువులు;
ఉండవిల్లువట్టి యున్నవాఁడేమొ యీ-
వానకాలమందుఁ బూని మరుఁడు ! ౧౩౮

(అసులద్ధీ ? ౨-౬౬)

---

(౧౩౬) ఊరిలోనికుక్కకు భయపడి బిచ్చమునెత్తుటకు వెనుదీయుచున్నవాఁడీ బైరాగి. మరి అప్పుడప్పుడు గోదావరిగట్టునపొదలలో తిరుగుచుండువాఁడు. అది సంకేత స్థానమీకలికికి. అక్కడకతఁడు పోకుండ భయపెట్టుటకై సింహమక్కడ చేరినదని కల్పించి చెప్పినది. కుక్కకే భయపడినవాఁడు సింహమున్నచోటికి పోఁజాలఁడని చెప్పఁబనిలేదు.

(౧౩౭) మనుష్యులకిట్టి భాగ్యమరుదని తాత్పర్యము.

(౧౩౮) ఉండవిల్లు = గుళికలను ప్రయోగించు విల్లు.గుళికదెబ్బ మూగదెబ్బ; బయటికి తెలియనీక నొప్పిగలిగించునది. వసంతాదులకంటె వర్షాకాలము విరహులనెక్కువగా వేధించుననుట సూచితము.

ఆ. నేను దూతిఁ గాను; నీవును బ్రియుఁడవు
గావు; మనకునిందుఁ గార్యమేమి ?
కాని- యది నశించుఁ; గలుగు నీకపకీర్తి;
దానఁ జేయవలసె ధర్మబోధ. ౧౪౦

(అసులద్ధీ ? ౨-౭౮)

ఆ. ఎంతసాము చేసె నీతిలకంబౌర !
నెలఁత మొగమునుండి నీదు మొగము,
నీదు మొగమునుండి నాదుపాదములుఁ జే-
నేఁత మార్చుకొన్న రీతిఁ జేరె ! ౧౪౧

(హాలుఁడు. ౨-౭౯)

తే. చెవిని సొమ్ముగ నేరేటి చివురుఁ జెరివి
కాపుఁగొమరుఁడు వీథిలోఁ గడచిచనఁగ,
కంటె ! నలుపెక్కినది యరగన్ను వెట్టి
కాంచు చామనచాయ వాల్గంటి మొగము. ౧౪౨

(౨-౮౦)

ఆ. నీవు దక్కనొరులు నేరరు చేఁదు మా-
టలను మెదువుగాఁగఁ బలుక, దూతి !
తోలు తెల్లఁబడక దురద గోఁకినయట్లు
వాని నీవు దేర్పవలయుఁ జుమ్మ ! ౧౪౩

(ఆహవసత్తి. ౨-౮౧)

---

(౧౪౧) సాత్త్వికపుఁజెమటచే తడిసిన ఆమెమొగమునందలి తిలకము ప్రణయవేళలో అతని మొగముమీఁద అచ్చుపడినది. అక్కడనుండి ఆత్రముతో అట్లేవచ్చి అతఁడు కోపించుకొన్న యామెకాళ్లకు మ్రొక్కఁగా ఆ తడితిలకముద్ర ఇక్కడ పడినది. అది యెఱిఁగిన యామెదీ ఛలోక్తి.

(౧౪౨) ఇరువురికిని నేరేడుమ్రాను సంకేతస్థలము. అతఁడు అక్కడికి పోయినాఁడు. కాని పనుల తొందఱచేఁ గబోలు ఆమె పోఁజాలక పోయినది. దానిని సూచించుచు అతఁడింటిముంగిటఁ గడచి పోయినాఁడు. అది తెలిసికొని ఆమె విషాదపడినది.

తే. నీదు మదిలోన వేవురు నెలఁతలుండ
నిలువఁ జోటందు చాలక వెలఁది యిపుడు,
అనుదినమునొండుపని లేక యందకాఁడ!
సన్ననగుమేని నింకను సన్నఁబఱుచు. ౧౪౪

(హాలుఁడు. ౨-౮౨)

క. నిముసంబేనియు నాహృద-
యమును వదలిచనదు చామ యనయము సంతా-
పము నెఱపుచుఁ బైపైఁ, బా
పము దాఁపఁగఁ గలుగునఖకు పగిదిఁ గటకటా! ౧౪౫

(హాలుఁడు. ౨-౮౩)

ఆ. ఊరకేల నన్ను నోదార్చెదవు! కౌఁగి-
లించి కొనుము; కినుకలేదు నాకు;
నీకు నలుకదెచ్చునేని యా పొలయల్క
నాకుఁ బూననేల లేకివాఁడ! ౧౪౬

(మియంగుఁడు. ౨-౮౪)

---

(౧౪౪) నీవామెనాదరింపవు; నీకై యామె కృశించుచుండుట తప్ప నీయనురాగమును సంపాదించుకొనునుపాయము మరేమియు నెఱుఁగదు - అనుటకీ హేతుచమత్కారము.

(౧౪౬) 'తమ ప్రియుఁడు ఇంకొకదానితో చెలిమి చేసినప్పుడు ఈర్ష్యచే స్త్రీలకుఁ గల్గు కోపము మానము' అని రసికపరిభాష. అదే పొలయలుక. దానిని గల్గించి చూచి యానందించుట శృంగారరసికులగు నాయకులప్రకృతి. అందుకు ప్రతిగా అది వారికి వెతగల్గించునేని దానిలో అందమే యుండదు. తాను పై వేసికొన్న పొలయలుకను తెలిసికొన లేఁడతఁడని 'లేకివాఁడ' అని ఆమె నిర్వేదముతో సంబోధించినది. నిత్యకాముక వృత్తికి ఇది అడ్డురాఁబని లేదు అన్నది.

క. అలిగిన సజ్జనులగువా-
రల మనసులుఁబోలె నీశరత్కాలమునన్
వెలుపల వేఁడిగలిగి లో-
పలఁ జలువల నొప్పుఁ గంటివా పెనుఁగొలఁకుల్ ! ౧౪౭

(విగ్రహరాయఁడు. ౨-౮౬)

తే. 'అతఁడు వచ్చిన నేమి సేయంగవలెనొ !
యేమి మాటాడవలయునొ ! యెట్టులగునొ !
అనుచుఁ దొలుదొల్త సాహసమునకుఁ గడఁగు-
నతివహృదయము గడగడమని వడంకె. ౧౪౮

(౨-౮౭)

ఆ. పాదపతనవేళఁ బాంజీల కొండ్లలో
జిక్కుకొన్న ప్రియుని చికురములను
వెలఁది మెల్లమెల్ల విడిపించుటయె 'యల్క
కరఁగి పోయె' ననుచు నెఱుకపఱిచె. ౧౪౯

(అణంగుఁడు. ౨-౮౮)

క. తడఁబడు పల్కులుఁ, గంపిం-
చెడు మోవియు, నెఱ్ఱఁబాఱు చెక్కిళ్ళునునై
పడఁతి 'ననుఁ దాఁకవలద' ని
యుడుగనిరోసమునఁ దొలఁగుచుండుట దలఁతున్. ౧౫౦

(౨-౯౨)

---

(౧౪౯) పాంజీలు = కాలియందెలు. పాంజేబులనియు రూపము కలదు.

ఆ. వానిమీదఁ బడియె వనిత గోదావరి-
జాఱురేవు దిగెడు సాకు వెట్టి;
కనికరమునఁ దప్పు కానరాదని వాఁడుఁ
గౌఁగిలించె దాని గట్టిగాఁగ. ౧౫౧

(౨-౯౩)

తే. నీవు చేయూరనిచ్చిన పూవుదండ,
తావి చెడినది, ప్రాఁచిదాతరుణి యిఁకను
ప్రియము మెయిఁ దాల్చెడిని, వెల్వరించినట్టి
నగరిదేవరఁబోలి, యో సొగసుకాఁడ ! ౧౫౨

(౨-౯౪)

ఆ. ఎరవు తెచ్చుకొన్న తెఱఁగున వసముగా-
కుండఁ జెడిన యిట్టి యొడలు గలిగి,
అమ్మ ! తప్పులెన్ని యతఁడు చేసిన నెట్టు-
లలుగనేర్తు నవ్వులాటకైన ? ౧౫౩

(పావచ్చీలుఁడు. ౨-౯౫)

ఆ. ఊరినిండ వయసువారు ; ప్రాయము ; ముదు-
సలి మగండు; నవ వసంతవేళ;
ప్రాఁతకల్లు గలదు చేతిలో 'చెడిపెగా-
వలదు' — కాని చావవలయు నేమి ; ౧౫౪

(హాలుఁడు. ౨-౯౬)

---

(౧౫౨) ఊరిదేవర విగ్రహమును బలిపూజాదులు ముగిసిన తరువాత పుష్పాలంకార సహితముగా ఊరి పొలిమేర వద్దకుతీసికొనిపోయి విడుచుట నేఁడును గలదు.

క. నీ మాటలన్నియును నే
వేమఱు చెప్పినను జక్క వినలేదనుచుణ్
గామిని నాచేఁ జెప్పిన
దే మఱి చెప్పించుచుండు నెన్నియొ తడవల్. ౧౫౫

(సురహివేసుఁడు. ౨-౯౭)

ఆ. కలికి, మంచితనముఁ జెలిమియుఁ జొప్పడ
నెల్లరెఱుఁగ నిన్ను నెట్టు సూచె,
నట్టె యొరులఁగూడనది సూచుచుండును,
గుట్టు దాఁచిపెట్టు కొఱకు - వినుము! ౧౫౬

(మణిరాయఁడు. ౨-౯౯)

ఆ. 'పట్టుఁడిదిగో! మొదటఁ బుట్టిన పలుదోయిఁ
గొఱికి, కొడుకు కాటువఱిచినాఁడు
రేఁగుపండు; గంటిరే!' యని పెండ్లాము
నగుచుఁ దెచ్చిపెట్టె మగనిచేత. ౧౫౭

(హరితవుఁడు. ౨-౧౦౦)

తే. ఒకరు నెప్పెడు మాటలట్లుండనిమ్ము;
నీదు హృదయంబె యిచ్చోట నీకు సాక్షి;
అలిగి చీవాట్లుపెట్టుటకైనఁ దగిన-
యంత నెయ్యంబు లేదు నాయందు నీకు. ౧౫౮

(వాహవుఁడు? ౩-౧)

---

(౧౫౮) 'నీయందు నాకెంతో అనురాగము. లేదనుట వట్టి జనాపవాదము' అని సాధించు నాయకునితో నాయిక నిష్ఠురముగా నను మాట.

ఆ. ఇచ్చకొలఁదిఁ బరువులెత్తెదు; దుర్లభుఁ-
డైన వానికొఱకు నాసపడెదు;
ఆకసంపు దారులందుఁ దారాడుచుఁ
బాడుమనస ! విఱిఁగి పడెదవెపుడొ ! ౧౫౯

(పవరసేనుఁడు. ౩-౨)

క. గుణములె యగ్గువ యైనవొ !
గుణముల వాఁడెఱుఁగలేఁడొకో ! మఱి నాకుఁ గా
గుణములె లేవొకొ ! పెక్కులు
గుణములొకో వానిచెలులకుం ? దెలియఁ జెలీ ! ౧౬౦

(చందహత్థి. ౩-౩)

ఆ. అద్దమందు నీడ యంటునట్లెవ్వని-
యాత్మనొరుల వగపులంటుకొనవొ,
యట్టివానితోడ నెట్టు సెప్పుదునత్త !
మనసు ప్రక్కలైన మానెఁగాని ! ౧౬౧

(రాయవగ్గుఁడు. ౩-౪)

ఆ. పథికగృహిణి వంగివైచునప్పుడు జాఱి
పడిన చేతికడెమునడుమనున్న-
యన్నపిండ 'మురులు పన్నిన' దనుకొని
కాకి, యదిగొచూడు, తాఁకవెఱచు ! ౧౬౨

(భోజయుఁడు. ౩-౫)

---

(౧౬౨) ఇది గృహదేవతలకు నిత్యమునువేయు బలి. ఆమె విరహముచే కృశించి నది గనుక అన్నపుముద్దను వేయునప్పుడు సడలినగాజుజాఱి ముద్ద దానినడుమ పడినది. ఒంటిగాజు గూడ విరహసూచకమైన సుమంగలీ చిహ్నము.

క. గడువు సమీపించినఁ బని-
చెడునో యని, చూడు, వెఱచి చెలికత్తియ లి-
ప్పుడు గోడమీఁది గీఁతలు
తుడిచెదరొక రెండుమూఁడు దొంగఱికమునన్ ! ౧౬౩

(పుణ్ణభోజయుఁడు. ౩-౬)

ఆ. నీదుమోముతోడ నిండుపున్నమనాఁటి
చందురుండు పోలఁజాలఁడనుచు,
వేఱుగతి సృజింపఁగోరినట్లు, విధాత
వానిఁ ద్రుంచుచున్నవాఁడు చెలియ ! ౧౬౪

(రాహహత్థి. ౩-౭)

తే. తళుకు వెడవెడచూపులఁ బొలుచుచుండు
సుదతినెమ్మోము మఱునాఁడు చూచినపుడు
గలుగునంతటి సౌఖ్యంబు గాదు మదికిఁ
దలఁపఁ దొలునాఁటి వలపుల చెలిమిగూడ. ౧౬౫

(భాణుసత్తి. ౩-౯)

క. ఎదురుపడి ముందునకుఁ జని
పదపడి వెనుదిరిగి ప్రియుఁడు పఱపెడు మోహో-
న్మదదృష్టులె మాపాలికి
మదనశరములమ్మ ! యెవరిమదికేపైనన్. ౧౬౬

(వాహవరాయఁడు. ౩-౧౦)

---

(౧౬౩) భర్త్తయూరు విడిచి యిన్నినాళ్ళైనవని గుర్తువేసికొన్నవి గోడమీఁదిగీతఁలు. ప్రవాసము పోయినవాఁడు చెప్పిననాఁటికి తప్పక రాఁగలఁడని నమ్మికలేదు. రాకున్నచో ప్రమాదము. కనుక ఈ దొంగపని.

(౧౬౪) కృష్ణపక్షమందు క్షీణించు చంద్రునిగూర్చి యీ యుత్ప్రేక్ష.

(౧౬౬) 'మన్మథ బాణములనఁగా ఎట్టివి ?' అని యెవతెయో ముగుద ప్రశ్నింపఁగా ఒక ప్రౌఢ యిచ్చిన ప్రత్యుత్తరమిది.

ఆ. జనులు తమకుఁగల్గు సంపద యొరులకు
నిత్తురన్న వింతయేమి దాన?
లేమ! నీవు నీకులేని దౌర్భాగ్యంబు
సవతి మగువలకు నొసంగినావు! ౧౬౭

(వాహవరాయఁడు. ౩-౧౨)

ఆ. చందురుండు మోముసాటియౌ; నందలి-
మోవితీయమమృతమునకు సాటి;
కురులువట్టి తమిని గొసరి కైకొనియెడు
సకియముద్దుకేమి సాటి చెపుమ! ౧౬౮

(వాహవరాయఁడు. ౩-౧౩)

ఆ. కోరుకొన్న పనులు కూడివచ్చెడువేళ
గుణము దోషమెంచుకొనుచునందు
ఉఱక తడవుచూచుచుండెడు మనుజుండు
కడకుఁ జెఱుచుకొనును గార్యమెల్ల. ౧౬౯

(మాణయిందుఁడు. ౩-౧౪)

క. తీపు సుమీ నీకంటెను
నాప్రాణమె నాకు; నినువినా నిలువంగా-
నోపదది; కాన బాలక!
కోపము వలదంచు వేఁడికొనియెద నిన్నున్. ౧౭౦

(హేలుఁడు. ౩-౧౫)

---

(౧౬౭) దౌర్భాగ్యము భర్తకు ప్రీతిపాత్రము కాకుండుట, సౌభాగ్యమునకు విపరీతము. సౌభాగ్యమీమెది. దానిఫలము సవతులకు దౌర్భాగ్యము.

ఆ. ఎట్టిచోటఁగాని యెట్టివేళను గాని
కీడు గలిగినపుడు, గోడమీఁది-
బొమ్మవోలెఁ, బెడమొగమ్ము పెట్టనివాని-
చెలిమిఁజేయవలయుఁ జేసికొన్న. ౧౨౧

(పాలితుఁడు. ౩-౧౨)

ఆ. నాఁతి మొదటితూరి నదిచెంతఁ బొదరింట
నడతచెడుటఁ జూచి కడుఁగలంగి
పోలెఁ, బులుగులెగిరి పోయె, హాహా! యని
యఱచునట్లు ఱెక్కలార్చికొనుచు. ౧౨౨

(అద్ధరాయఁడు. ౩-౧౮)

ఆ. చిన్నవాఁడ! నిజముచెప్పెద వినుము; వ-
సంతమాసమున కసాధ్యమేది?
కాని, కురవకముల గంధంబు మూర్కొన్నఁ
గూడ దానినడత కీడువడదు. ౧౨౩

(దేవరాయఁడు. ౩-౧౯)

ఆ. సకియ యింటితడికసందులలోనెల్ల
వరుస బెళుకుఁగనులఁ బఱపి కనుచు,
నీవు త్రోవఁబట్టి పోవఁ బంజరమందుఁ
బక్షివోలెఁ గానఁబడియెనపుడు. ౧౨౪

(అరికేసరి. ౩-౨౦)

---

(౧౨౩) కురవకములు ఎఱ్ఱగోరంటపూలు. 'నీయందింత దృఢానురాగము గలదైనను ఆమెను మితిమీఱి గానిపెట్టవలదు. ఎట్టివారినడతనైనను చెఱుచునది సుమా యీ వసంత కాలము' - అనిభావము.

ఆ. ఇంటితడికమీఁదనెదమోపి, వివశమౌ
మేను బొటనవ్రేళ్ళమీఁద నిలిపి,
వనిత యెంతచూచినను నీవు గానరా-
వేని యేమిచేయునింకఁ జెపుమ ! ౧౭౫

(బంహాయారి. ౩ - ౨౧)

ఆ. దయితుఁ దలఁచి వెల్లియయి పొంగివచ్చెడు
బాష్పజలము జాఱిపడునొ యనుచు
వెఱచి గొంతుమలఁచి తెరువరి యిల్లాలు
దివ్వె దెచ్చియిచ్చుతెఱఁగు గంటె ! ౧౭౬

(బంహాయారి. ౩ - ౨౨)

ఆ. కడచి పోవు నిన్నుఁ గాంచుటకొఱకు నా-
యతివ మేనుద్రిప్పినట్టి తెఱఁగు
చిన్నవాఁడ ! యేమిచెప్పుదుఁ ! గన్నిళ్ళ-
సోన దానివీఁపుపైన జాఱె. ౧౭౭

(హాలుఁడు. ౩ - ౨౩)

క. తులువలు ఎలవదు; సాదులు
వలవదు, మాకెపుడు నడిమివారలె మేలా-
తులువలను జూచినను, సా-
దులఁ జూడకయున్న నొక్కదుఃఖమె కలుగున్. ౧౭౮

(హాలుఁడు. ౩ - ౨౪)

---

(౧౭౬) పొరుగింటివారు తమయింటిదీపము ముట్టించుకొనుటకై యడుగఁగా ఈమె తెచ్చియిచ్చునపుడు ఈ యవస్థ. రాత్రివేళగనుక దయితునితలఁచుట తప్పనిసరిగాఁ గలుగును.

తే. కలికి! సాజంబుగా నిండుగనుల వానిఁ
జూచెదవుగాని యరగంటఁ జూడవలదు;
అతనిఁ జక్కఁగఁ జూచినయట్టులగును;
నీవునొక ముగ్ధవనుచు మన్నింతురొరులు. ౧౭౯

(మయరందుఁడు. ౩ - ౨౫)

తే. అలుకచేఁ బగలంతయుఁ బలుకకింటి-
పనులు ముగియించి, నాతప్పువలని శోక-
మెంత యున్నను, నాకాళ్ళచెంత రేయి
చెలియ శయనించు తెఱఁగును దలఁతునిపుడు. ౧౮౦

(విచ్ఛముఁడు. ౩ - ౨౬)

ఆ. యాగభూమినెల్లొ, త్రాఁగుఁబోతులవాడ-
లందుఁగూడ నట్లె యగ్నిమందు;
విషమదశలఁ జిక్కి వెతఁజెందుచుండెడు
జనులనెపుడు విడువఁజనదు సూవె. ౧౮౧

(హాలుఁడు. ౩ - ౨౭)

ఆ. సొగసుకాఁడ! నీదుమగువ సుశీలయై
మేము చెడిపెలగుటకేమి హేతు-
వనెదవో! వచింతునా మఱి! నీవంటి
పరువమైన మగఁడు దొరకఁడొరుఁడు. ౧౮౨

(అణులచ్ఛి. ౩ - ౨౮)

ఆ. ఆతఁడూరు గాలునపుడు నాచేఁజేత
మగువ ! నీటికడవ మార్చుకొనఁగ,
ఇంటిలోని యాస్తియెల్లఁ గాలినఁ గాని
మదికి సంతసంబె యొదవెఁ గదవె ! ౧౮౩

(భేచ్ఛలుఁడు. ౩ - ౨౯)

తే. ఆకులును గొమ్మలును లేక యడవినడుమఁ
బొట్టిమ్రోడుగనెందైనఁ బుట్టవచ్చుఁ;
గాని నరలోకమునఁ జేతఁగాసులేక
రసికుఁడై దాతయై పుట్టరాదుసూవె ! ౧౮౪

(అసమసాహుఁడు. ౩-౩౦)

క. అరుదైన వానిసొబగును
దెఱవలకుం దగని నాదుతెగువయు గోదా-
వరివఱదలెఱుఁగుఁ; జీఁకటి
సఱచిన పెనువానకారు సవరేలెఱుఁగున్. ౧౮౫

(మయరద్ధయుఁడు. ౩-౩౧)

---

(౧౮౩) అగ్గినార్పుటకై నీటికడవలు ఆడవారు నించి యిచ్చుచుండగా మగవారు తీసికొనిపోయి చల్లుచుండిన కోలాహలమునందు ఈ సందర్భము.

(౧౮౫) వానిఁజేరుటకై, వానకాలపు అర్ధరాత్రవేళలలో గోదావరిని దాఁటి ఆవలిగట్టున కామె పోయివచ్చెడిది. తన తెగువకు, వానిరమణీయతకును ఇంతకన్న వేఱు సాక్ష్యము కావలెనా ?

క. చనిరా చెలికత్తెయ, లా-
యనువగు పొదరిండ్లు ప్రోడులై మిగిలెను; మా-
కును వయసు గడచె; వేఱులు
తునిగి తెగియెఁ బ్రేమ; దానితో నేమింకన్! ౧౮౬

(నిరుపముఁడు. ౩-౩౨)

ఆ. ఆనెలంత మేలియవయవంబుల మొద-
లెవరి దృష్టి యెందుఁ దవిలె నద్ది
వారికందె నాఁటువడెఁ గాని, మేనెల్లఁ
గలయఁ గాంచినట్టి ఘనులు లేరు. ౧౮౭

(అద్ధరాయఁడు. ౩-౩౪)

క. ఎడఁబాటున విషమై యే-
ర్పడుఁ; జెంగటనున్న నమృతరసమై సుఖముల్
కడుఁగూర్చు; బ్రహ్మ రెండున్
దొడఁగి కలిపి మెదిపి చేసెనో యీ చెలియన్ ! ౧౮౮

(హాలుఁడు. ౩-౩౫)

ఆ. ఒకరినొకరు చూడకుండిన నొండొంటఁ
గలిసి నిలుచు గట్టి వలపులైనఁ,
గొడుక ! కాలమేఁగుకొలఁదిని, బుడిసిటి
నీరువోలె, మెల్ల జాఱుఁ జుమ్మ. ౧౮౯

(వహూరసుఁడు. ౩-౩౬)

---

(౧౮౬) నీ ప్రాఁత ప్రణయకథను జెప్పుమని తరుణులెవరో యడుగఁగా ఒకవృద్ధ జార చెప్పిన యుత్తరము.

ఆ. 'అమ్మ! తేలుగుట్టె' నని చేతులను వీచు
చిన్నదానిఁ బట్టి చెలులు జాణ-
లదిగొ! మగనికనులయెదుటనే కొంచుఁబో-
యెదరు జారవైద్యునిల్లు సేర. ౧౯౦

(మల్లసేణుఁడు. ౩-౩౭)

ఆ. పొగయకుండు కుమ్ముఁ బోలెడు చామచ-
న్గవను బడసి శీతకాలమందు
పల్లెసేద్యగాఁడు పచ్చడంబును విల్చి
క్రొత్తయెద్దుఁ దెచ్చుకొనియెఁ జూడు ! ౧౯౧

(హాలుఁడు. ౩-౩౮)

తే. పుణ్యతాపీనదీ తీరభూమిఁ జావ
సిద్ధపడినాను; నిజమె వచింతు వినుము;
ఇప్పటికిఁగూడ నా పొదరింటి యంద
నాఁటెడిని నాఁటియట్టుల నాదుచూపు. ౧౯౨

(వియద్ధుఁడు. ౩-౩౯)

ఆ. దొరకకుండ నేఁడు దొరకిన చెంగావి-
చీరగట్టి కాఁపువారికోడ-
లదిగొ! చిన్నదయ్యునడఁగక తిరిగెడు
విరివియైన పల్లెవీధులందు. ౧౯౩

(మవుహాఁడు ? ౩-౪౧)

---

(౧౯౧) అధి స్వాధీనముగానున్నప్పుడు ఇది యింటనుండుట దండుగ యని వాని ధైర్యము.

(౧౯౨) ఆ పొదరిల్లు ఎంతోకాలము అభిసారస్థానముగా సుఖములిచ్చినది. "ఆసన్న మృత్యువైనను పుణ్యక్షేత్రమందును ఆ సుఖానుభవము మఱవలేను; అపలాపము చేయలేను" - అనిభావము.

క. దొరకు స్వతంత్రము, ప్రియసుం-
దరికిం బొలయల్క, శక్తునకు శాంతగుణం,-
బెఱిఁగిన వానికిఁ బలుకుట,
యెఱుఁగని మొఱకునకు మౌనమే - శోభించున్. ౧౯౪

(సుందరుఁడు. ౩-౪౩)

తే. వడఁకి చెమరించు వ్రేళ్ళకు వసముగాక
నిలిచి నడవక జాఱునీకలముతోడ
స్వస్తిశబ్దమె ముగియింపఁజాలనైతి;
కమ్మనింకేమి వ్రాయంగఁ గలను జెలియ ! ౧౯౫

(అంధుఁడు. ౩-౪౪)

ఆ. నరులకైనదియును నశియించు దైవంబు
పెడమొగంబువెట్టి నడిచెనేని;
ఏమిపనికిఁ దొడఁగిరేనియు మూలమే
కూడి కుదురదిసుకగోడవోలె. ౧౯౬

(అంధుఁడు. ౩-౪౫)

ఆ. అత్త! నేను దానమాడుచునుండ నా
నీటుకాఁడు వచ్చి యేటిదిగువ,
పసపుచేఁదునీరు పట్టి త్రాగుచును నా-
హృదయమెల్లఁగ్రోలురీతిఁ దోఁచె. ౧౯౭

(వోలయేవుఁడు ? ౩-౪౬)

ఆ. చనిన యౌవనంబు వెనుకకు రాదు; జీ-
వంబుచూడ శాశ్వతంబె కాదు;
ఒక్కనాఁడు వోలె నొక్కనాఁడుండదు;
జనులకింత కటికతనమదేల ? ౧౯౮

(హాలుఁడు. ౩-౪౭)

ఆ. పుడమిఁ గూళజనము గడియించునాస్తికిఁ
బాత్రులెవ్వరట్టివారె కాక ?
వేఁపమ్రానఁ బండ్లు వెలసినఁ గాకులే
వచ్చివానిఁ దినఁగవలయుఁగాదె ? ౧౯౯

(పాలితుఁడు. ౩-౪౮)

ఆ. 'నాకు నిపుడు చిమ్మచీఁకటియంద య-
య్యందకానిఁ జూడనరుగవలయు'-
ననుచుఁ గనులు మూసికొని యింటనే నడ-
యాడుపనికిఁ జొచ్చెనామృగాక్షి. ౨౦౦

(సుచరియుఁడు. ౩-౪౯)

ఆ. ఇలను సుజనులొరులకలుగనె యలుగరు;
అలిగిరేని చెడుగు దలఁపరాత్మఁ;
దలఁచిరేని వెలికిఁ బలుకఁబోరందుపైఁ
బలికిరేని సిగ్గుపడుదురెపుడు. ౨౦౧

(అజుణుఁడు. ౩-౫౦)

---

(౧౯౮) ఆయల్పకాలమున సుఖానుభవమునకై ప్రయత్నించువారిని లోకులోర్చి, 'అయ్యోపాప' మనక మీఁదు మిక్కిలి శిక్షింపఁజూతురు. అదే కటికతనము.

(౨౦౧) అంతేకాని యెప్పుడును చెడుగు చేయరనుట.

ఆ. వలసినపుడు చేతఁ గలదియే కలిమి; యా-
పదల వదలి పోనివాఁడె సఖుఁడు;
గుణములలవరించుకొన్నదే రూపు; ధ-
ర్మానురక్తి నిండినదియె తెలివి. ౨౦౨

(హాలుఁడు. ౩-౫౧)

క. కనుపాపలనరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలితెలుఁగున్
గని, యజమానుఁడు వలద-
న్నను దెరువరి యింటియంగణమునన పిడిసెన్ ! ౨౦౩

(సుందయుఁడు. ౩-౫౪)

ఆ. కొండవంటి నరునిఁగూడ గ్రక్కున చుల్కఁ-
బఱుపఁగలవు సుమ్ము పనులు రెండు:
చేయనట్టి పనిని జెప్పుకొంటయును, జే-
సినది చెప్పుకొనుటయును జగాన. ౨౦౪

(గోవిందసామి. ౩-౫౫)

ఆ. తడికసందులందు వెడలునాకులతోడఁ
దరుణతతికి నాముదంపుఁ జెట్టు,
'ఇచటఁ గాఁపుకోడలింతింతలేసి పా-
లిండ్లదున్న' దని వచించుఁ బోలె. ౨౦౫

(ఉద్ధవుఁడు. ౩-౫౬)

---

(౨౦౫) తడిక యింటిచుట్టును వెదురుదబ్బలవంటివానితో వేసినది. ఆ దబ్బల సందులలో లోపలనున్న ఆముదపుఁజెట్టువి ఆకులు, ఐదువ్రేళ్ళను విచ్చి సారించిచూపెడు అరచేయివలె, వెలికి వెడలియుండును.

ఆ. కలభకుంభయుగము కరణి నీపాడుపా-
లిండ్లు సందుగప్పి యెదిగి బిగియు-
చుండ నుస్సురనుచు నూర్చుటయైనను
గడిఁది - యింకనేల నడచుమాట ! ౨౦౬

(కయిరాయఁడు. ౩-౫౮)

ఆ. నాట్యమాడి యలసినది, నెలబాలెంత,
యొక్కనాఁటివేఁకిఁ జొక్కినట్టి
సుదతి, యాఱునెలలచూలాలు నగు ప్రియ-
కాంత వలచుచుందుగాక కొడుక ! ౨౦౭

(కయిరాయఁడు. ౩-౫౯)

ఆ. గరితగబ్బిచనుల యొఱఁజిక్కి చొక్కుచో,
వలస పోవవలయువాని మదికి
సుఖము నియ్యఁజాలుఁ జూవె యంగారక-
వాసరాపశకున భద్రతిథులు. ౨౦౮

(దువ్వియద్దుఁడు. ౩-౬౧)

---

(౨౦౬) ఈమె యేల నడవలేక వెనుకఁ జిక్కుచున్నదని యాక్షేపించినందుకు ఒకానొక దుండగీని కువాడపు ప్రత్యుత్తరమిది.

(౨౦౭) నాయకుఁడు కుంటెనకత్తెకు కృతజ్ఞతతో మ్రొక్కఁగా ఆమెయిచ్చిన ఆశీర్వాదమిది. వారివలపులు చాల కమనీయములని కామశాస్త్రోపనిషత్తుల సిద్ధాంతము.

(౨౦౮) భద్రతిథి యనఁగా భద్రాకరణముతోఁ గూడినదినము. అట్టితిథులు, శుక్లపక్షమున చవితి, అష్టమి, ఏకాదశి, పున్నమ; కృష్ణపక్షమున తదియ, సప్తమి, దశమి, చతుర్దశి - ఇవి. ఈ దినములు శాంతిక పౌష్టిక కర్మలకు తగవు. ఈ సాకుతో ప్రయాణము నిలుపవచ్చునని యతని సంతోషము.

క. నీకొఱకుఁ గొడుక ! యెప్పుడు-
నాకోమలి పాపమింటి యంగణమున పెన్-
వాకిటనె వాఁడెడిని విను-
మా! కట్టిన తోరణంపుమాలికవోలెన్. ౨౦౯

(దువ్వియద్ధుఁడు. ౩-౬౨)

ఆ. ఎండుమఱ్ఱిమ్రానియందకుఁ జేరి చ-
ప్పట్లు సఱచి నగిరి పాంథజనులు,
తమ్ముఁజూచి బెదరి దానియాకుల పండ్ల-
పగిదినున్న చిలుకలెగిరిపోవ ! ౨౧౦

(అఱులచ్చి. ౩-౬౩)

ఆ. అట్లు వాఁడు దానియడుగులపైఁ బడి
యుండ, నదియు వెలుఁగుచున్నదివ్వె-
నింకఁ గొంత వత్తినెగఁద్రోయఁ, జెడనవ్వు
వచ్చెనత్త ! నాకు వారిఁజూచి. ౨౧౧

(హాలుఁడు. ౩-౬౪)

ఆ. ఎపుడుఁ దన్నుఁదాన యేలుకోఁగల్గియు
నాభిజాత్యశక్తికణఁగి యుండి,
మొగము వన్నెచెడక, పగవారియెడఁగూడఁ
జెలిమి సజ్జనుండు సేయుఁ జూవె ! ౨౧౨

(హాలుఁడు. ౩-౬౫)

---

(౨౧౧) పగలు పౌరుషములు పల్కినవాఁడు రాత్రిచూపు దీనత, దానికై యామె గర్వించి యితరులు తన సౌభాగ్యముచూచి యసూయపడవలెననుటకై దీపమింకను పెద్ద చేయుట - రెండును నవ్వునకు కారణములు.

(౨౧౨) ప్రేమ నశించుచున్నను చూపుకొనకుండుట ఆభిజాత్యలక్షణమనుట.

ఆ. తెలివి యాదరంబు దినదినంబునకు వ-
ర్ధిల్లుచుండి పెద్దరికము వెలయు
సత్కుల ప్రసూతజనుల ప్రేమంబులు
కరఁగునదియు నెఱుఁగుటరిది కొడుక ! ౨౧౩

(పరక్రముఁడు. ౩-౬౬)

క. విలువయగు తెలివి గుణములు
గల పురుషులతోడి పగయుఁ గమనీయము; నిం-
దలపాలగు నల్పుల కూ-
ర్మలు గలిగినఁగాని సిగ్గుపొడమెడు మాకున్. ౨౧౪

(సవరసత్తి ? ౩-౬౭)

ఆ. తరుణి! నీమొగంబు దాఁకెడు సూర్యుని
జెఱఁగు గప్పి యడ్డుసేయవలదు;
తామరయును నీదు మోమును దాఁకి యం-
దేది సుఖమొ వానినెఱుఁగనిమ్మ ! ౨౧౫

(ణీలుఁడు. ౩-౬౯)

ఆ. ఏమి చెప్పనేర్తు నింతిచెల్వను ! చూపు
దానిమేననెందుఁ దగులుకొన్న
వెడలిరాదు మరల, నడవఁజాలని పేద-
గోవు బురదఁ జిక్కుకొన్న యట్లు. ౨౧౬

(పవ్వయకుమారుఁడు. ౩-౭౧)

ఆ నీటిమీఁదివ్రాఁత, విజము, దుర్జనమైత్రి
చేయుచుండఁగనె నశించుచుండు;
అదియె సజ్జనాళియందుఁ జల్పితిమేని
రాత గీచినట్టి గీతగాదె ! ౨౧౭

(సరలుఁడు. ౩-౭౨)

ఆ. మరల నింతలోన తరలిపోవఁగ నీకు
నెటులు మనసు పుట్టెఁ గటికవాఁడ !
తెరలు తెరలుగాఁగఁ దిరిగినవివె చూడు
కురులు; నేఁటికైనఁ గుదురుకొనవు ! ౨౧౮

(సరలుఁడు. ౩-౭౩)

ఆ. మేము వేఁడుకొన్న మీఁద నల్కయొకింత
చల్లఁబడియెఁగాని, చాలసేపు
నీదు తప్పులను గణించుచు నిరుగేల
వ్రేళ్ళు సాలకుండ వెలఁది యేడ్చె. ౨౧౯

(విణ్ణుఁడు. ౩-౭౭)

ఆ. చెమటనీరిపేరఁ జిన్నారినెమ్మేన
నణఁగకుండఁ, ద్రివళులనెడు మెట్ల
వెంటఁ జూచినారె! వెలఁదికి లావణ్య-
రసము పొంగి పొరలు రమణ దోఁచె. ౨౨౦

(హాలుఁడు. ౩-౭౮)

ఆ. పందుమాట యుండనిండది దైవంబు-
చేఁత, దానికేమి చేయఁగలము !
ఇంత చెప్పనేర్తుమెందునశోకంపుఁ
జివురువంటి చివురు భువిని లేదు ! ౨౨౧

(భీవయేవుఁడు. ౩-౭౯)

---

(౨౧౮) కడచినసారి విరహము సంభవించినపుడు సంస్కారములేక కురులు వంకర తిరిగినవి.

క. అనవరత బాష్పధారలు
కనుగడవలఁ దొరఁగుచుండఁగా నదె యమ్మా-
నిని చెక్కులఁ దోఁచిన చం-
ద్రునిమచ్చను గడుగురీతిఁ దోఁచెడుఁ గనఁరే ! ౨౨౨

(విసమరాయఁడు. ౩-౮౦)

ఆ. పెక్కుపూల సరుల నొక్కచేనియు విర-
జాజి యున్న దానిసౌరభంబు
పొనుఁగువడదు; పాడుపూవది ! దానినె-
త్తావి గుబులుకొనువిధంబె వేఱు ! ౨౨౩

(వియహుఁడు. ౩-౮౧)

క. ఫలసంపత్తిని వంగుచు
ఫలఁసంపద చెడినవేళ బయిఁ బ్రాఁకుచు రా-
జిలు, బెనుమ్రాఁకుల కొనగొ
మ్మలపోలిక, సాధుజనుల మనసులు ధరణిన్. ౨౨౪

(కువలయుఁడు. ౩-౮౨)

ఆ. మానవంతుఁడైనవాని మనంబంత్య-
దశలఁ గూడనున్నతంబె యగును ,
మునిఁగి పోవువేళలను సూర్యకిరణముల్
మీఁదివంకఁ గాదె మెఱయుచుండు ! ౨౨౫

(మావురాయఁడు. ౩-౮౪)

ఆ పాఁలుమాలకుండ బక్షిజాతులు గూడఁ
గడుపు నించుకొనఁగఁ గలుగునమ్మ !
పదను సెడినవారిఁ బయికెత్తు సజ్జనుల్
కొందఱె జగాన — నుందురేని ! ౨౨౬

(అలక్కుఁడు. ౩-౮౫)

ఆ. చదురునడఁత లేక సత్యంబునెఱిఁగిన-
వారి లోఁగొనంగ వసము గాదు ;
కడుగునీరు ముందుగడఁ బెట్టి పాలంచుఁ
బ్రాఁతపిల్లి బేలుపఱుపఁ గలమె ! ౨౨౭

(భోజయుఁడు. ౩-౮౭)

ఆ. తెలిసి చవి తమంతఁ దివి త్రాఁగవలసిన-
వడవిగడ్డి మఱియు నడవినీరు
లేటిజాతికట్టులేనియు నాపోతు-
పెంట్లు చచ్చుదాఁకఁ బ్రేముడించు ! ౨౨౮

(అవణాయరుఁడు. ౩-౮౮)

ఆ. మాడ్చుచుండు గ్రీష్మమధ్యాహ్నమునఁ గూడఁ
బ్రేమబద్ధులైన కాముకులకు
బిగువు కౌఁగిలింతలగునట్లు గందంపుఁ
గలపములును జలువ గావు సూవె ! ౨౨౯

(హరివృద్ధుఁడు. ౩-౮౯)

ఆ. ఇంటి సత్తువెఱిఁగియుంటఁ బేదలకోడ-
లణఁచుకొనునుగావి యాత్మలోన,
బయటఁ జెప్పుకొనదు బైకలఁ, దనదు బం-
దువులు చేసినట్టి దొసఁగుఁ బోలె. ౨౩౦

(వికీౄరుఁడు. ౩-౯౦)

తే. జాఱుచుండెడి కొప్పును జీరముడియు
రెండుచేతులతో సవరించుకొనుచు,
మంగలివి జూచి వెఱచి పాఱంగఁ గొడుకు-
నంటి పరువెత్తుచున్నదిల్లాలు చూడు ! ౨౩౧

(మావూరాయఁడు. ౩-౯౧)

క. ముదిమికిఁ జిక్కి విరూపం-
బౌదవఁగ లేవడిని నవయుచున్నబెల్లన్
మదిలోఁ గులపాలికలకు
నెదుగును బ్రేమంబు పయిపయిన్ మగనియెడన్. ౨౩౨

(పొట్టిసుఁడు. ౩-౯౩)

ఆ. వెలుకఁబాఱు మొగముగల యూరిచెడిపెల
యెదలుగూడ రాల, నదిగో! గాలి-
పెట్టుదగిలి పల్లెపెనుమఱ్ఱిమ్రానియా-
కొండు రాలెనత్త! పండఁబాఱి. ౨౩౩

(ఖండుఁడు. ౩-౯౫)

క. బట్టబయలె పరికించెడు;
గట్టిగ నూర్చెడును; మిన్నకయ నవ్వెడు; నె-
ట్టెట్టో వదరెడు; నేమో
పట్టివదిర దీనిమదికి భావింపంగన్! ౨౩౪

(వియద్ధయిందుఁడు. ౩-౯౬)

తే. చెవులకమ్మల నీలాల జిగులు దగిలి
దయితనునుజెక్కిళులఁ దోఁచు ధవళచంద్ర-
కరములఁ బ్రియుండు, కాటుకబెరసినట్టి
బాష్పములటంచు వ్రేళ్ళతోఁ బాయఁదుడిచె. ౨౩౫

(కలసగంధుఁడు, ౪-౨)

---

(౨౩౩) ఆకురాలుకాలము వచ్చెనని, ఇఁకఁగొన్నాళ్లచ్చట సంకేతస్థానము సమకూరదని చెడిపెల యెదపడుట.

(౨౩౪) ఎవనినో గట్టిగా వలచినదని భావము.

ఆ. చక్కఁదనము గల్గుచానలు జగములో
నెందఱున్న నేమి ? యింత నిజము !
ఒడలిచెలువునందు నెడమసగంబుతోఁ
గుడిసగంబె సాటిగూడుఁ జెలికి. ౨౩౬

(సిరిరాయఁడు ? ౪-౩)

తే. నిలుపఁగారాని వలపుబంధెమునఁ దగిలి
యతఁడు వాయించినట్లెల్లనాడుచుందు;
ప్రాను సాజంపుప్రోడై నఁగాని, చెలియ !
చొక్కిపెనఁగదె యద్దానిచుట్టుఁ దీఁగ ? ౨౩౭

(ససిప్రహా. ౪-౪)

క. దొరకుట కష్టము దయితుఁడు;
దొరకియు వసమగుట మరియు దుర్లభ; మింకన్
దొరకినను దొరకనట్లే
తరుణీ ! మనయిచ్చకొలఁదిఁ దా రాఁడేనిన్. ౨౩౮

(౪-౫)

క. అనునయసుఖము వలచి, చే-
యనితప్పును జేసినట్టులాడి, యకట ! మా-
నిని సరళహృదయుఁడయినను
దనదయితునిఁ దానె తప్పుదారికినీడ్చెన్ ! ౨౩౯

(సీహుఁడు. ౪-౬)

---

(౨౩౯) అనునయసుఖము = పొలయల్కచేసికొన్నప్పుడు ప్రియుఁడువచ్చి సమదాయించుట వలనఁ గలుగు సుఖము. దానికి వేకారి ఆమె తప్పులేనివానిపై బలవంతముగా తప్పుమోపినది. చూచినంతసేపు చూచి యతఁడు తెగించి తుదకు తప్పే చేసినాఁడు.

ఆ. 'కడచెనిన్ని నాళ్ళుఁ గాలుసేతుల వ్రేళ్ళ
నొక్కటొక్కటిగాఁగ లెక్కపెట్టి;
ఇంకమీఁద దినములేమిట లెక్కింతు !'
ననుచునేడ్చుచున్నదకట ముగుద ! ౨౪౦

(పాలితుఁడు. ౪-౭)

ఆ. చిలుకముక్కువన్నెచే నొప్పు మోదుగు-
పూలపఱపు వొలిచె నేలనిండ;
బుద్ధదేవుచరణములు మ్రొక్కఁ బుడమిపైఁ
బడిన భిక్షుగణముపగిదిఁ గంటె ! ౨౪౧

(సూరణుఁడు. ౪-౮)

ఆ. పడఁతి ! నీదుమేన బటువులౌనంగంబు-
లెల్లనిట్లు సన్నగిల్లె; సన్న-
వైనవెల్లఁ బోచలై తోఁచె; నింకను
బాడుకోపమిట్లు పట్టనేల ? ౨౪౨

(కులవృత్తుఁడు? ౪-౯)

ఆ. తమకు వాడుకైనదాని మెత్తురుగాని,
గుణము సూచి మెచ్చుకొనరు జనులు;
ముత్తియములు విడిచి మోజుతో గురిగింజ-
లేరుకొనరె చెంచువారలడవి ? ౨౪౩

(సమరిణసుఁడు. ౪-౧౦)

---

(౨౪౦) ఈమె ప్రవాసము పోయిన మగని గడువుదినమునాత్రముతో లెక్కించుచున్న ముగ్ధ.

క. వడఁకుచును గందవొడి తన
పిడికిటఁ గొని చల్లుకొఱకుఁ బ్రియుఁజేరఁగఁబో-
యెడు ముగుదకుఁ జెమ్మటన-
ప్పుడ కలపంబయ్యె హస్తమున నదియెల్లన్, ౨౪౪

(కాంతఫరుఁడు : ౪-౧౨)

తే. మగువ! పెరటింటి యూడుగుమ్రానియాకు
వీఁపునకు నంటుకొనియె; దుల్పికొనవమ్మ!
జాణలగు తోడికోడండ్రు సైచియుండ-
రుఱక, నీవేమి పాపమునెఱుఁగకున్న. ౨౪౫

(పండి. ౪-౧౩)

తే. రెండుచేతులఁ గన్నులు రెండు వానిఁ
గాంచినప్పుడు మూసికోఁగలనుగాని,
చెలియ! మేనెల్లఁ గడిమి పూచినవిధాన
నుప్పతిల్లెడు పులకలఁ గప్పుటెట్లు? ౨౪౬

(నస్సీహుఁడు. ౪-౧౪)

తే. పూరికప్వోడుగాలిత్రోపునకుఁ జెదర
నేల గతిలేక యేడ్చుచుఁ గూలఁబడిన-
వలసపోయిన యాతనిచెలిని జూడు!
మెఱసె మేఘంబునకుఁ జూపుకరణి, మెఱపు. ౨౪౭

(రాయహత్థి. ౪-౧౫)

---

(౨౪౫) పెరటియూడుగుమ్రాను సంకేతస్థానము. అక్కడ మరఁదితోడి చెలిమి నాయికకుఁ గలిగినది. ఆమెచెలి యొక్కతె ఆ రహస్యము గుర్తించినను ఏమియు నెఱుఁగనియట్లు తోడికోడండ్రమీఁద తప్పువేయుచు సూచించుచున్నది.

(౨౪౭) మెఱపు స్త్రీ. కనుక విరహముననున్న నాయికకష్టమెఱిఁగి కనికరించినది. మేఘము మెఱపునకు భర్త. అతనితో ఆమెపై దయచూపుమని సూచించినట్లు భావన. వర్షాకాలము విరహమునుద్రేకించునని.

ఆ. ఏది దొరికెనది భుజింపుము; లవణంబు
పల్లెటూరనెట్లు వచ్చు మాకు ?
చెలువుకాఁడ ! వినుము స్నేహంబు లేదేని
లవణమెంతయున్న లాభమేమి ? ౨౪౮

(తిలోయణుఁడు. ౪-౧౬)

తే. సుఖమునడుగుచు నాయింతి ముఖసరోజ-
సురభినిశ్వాసములఁ జల్లఁబలికి యాయఁ
ద్రాఁగెనొకమాట యాకాఁపురోగి చూడు
చేఁదుమందును, జుక్కయుఁజిందకుండ ! ౨౪౯

(తిలోయణుఁడు. ౪-౧౭)

ఆ. ఎంత యలుకగొన్ననేమి ? సత్పురుషుల
నోటనెట్లు చెడ్డమాట వెడలు ?
రాహువదనగహ్వరమునఁ జిక్కియుఁ జంద్రు-
కరములమృతరసమె కురియుఁగాదె ! ౨౫౦

(అవంతివమ్మ. ౪-౧౯)

క. ఇతరులు తను మన్నించినఁ
బ్రతిసేయఁగలేక నొప్పిపడినట్టులు, దు-
ర్మతినవమానము సేసిన
వెతనొందఁడు సజ్జనుండు పేదఱికమునన్. ౨౫౧

(అవంతివమ్మ. ౪-౨౦)

---

(౨౪౮) లవణము = సముద్రపు ఉప్పు, లావణ్యము. స్నేహము = నేయి. ప్రేమ. వడ్డనవేళలో ఉప్పుచాలదని అడిగినాఁడు అతిథి. అతనిని వలచినది వడ్డించెడు గృహిణి. పల్లెటూళ్ళలో వలసినంత యుప్పు దొరకదు; నేయి సమృద్ధి. అట్లే పట్టణాలలో ఉప్పు సమృద్ధిగాని నేతికి దారిద్ర్యమే. ఇట్లే పల్లెస్త్రీలకు స్నేహమధికము; లావణ్యము చాలదు. నాగరికలకు ఇది యుండునుగాని అది చాలకుండును. కనుక యదృచ్ఛాలాభసంతోషము ఆమె యతనికుపదేశించినది-గూఢముగా.

ఆ. కలహములనుగూడ వెలిరావు, మదిలోన
సమసిపోవు, సాధుజనులు విన్న
మఱుఁగుమాట, లొక్కమాఱుగ నాయువు
గడచినప్పుడగ్గిఁ గాలుఁగాని. ౨౫౨

(హాలుఁడు ౪-౨౧)

తే. పువులెదిగి బండిగురివిందపొదలు వెరిఁగి
యంగణములందు వాకిండ్లకడ్డమయ్యె;
దారిఁజూచుచునుండునోదార్పుగూడ
నూరఁబతిలేని యతివలకొదవనట్లు. ౨౫౩

(వత్సుఁడు. ౪-౨౨)

ఆ, అతివ ప్రియుని జూచునప్పుడు చొక్కన
మునిఁగి కన్నుదోయి మూయదేని,
దానిచెవులమీఁదఁ దవిలి వ్రేలెడు నల్ల-
కలువపూవులెవఁడు గాంచఁగోరు ? ౨౫౪

(వసంతసేనుఁడు. ౪-౨౩)

ఆ. అడుసునందుఁ జిక్కువడిన నాఁగలి యీడ్చి
మగడు సొలసి నిద్రఁ దగిలి యుండఁ,
జిత్తమందు వలపురిత్తవోవఁగ వాన-
కాలమును శపించుఁ గాఁపుమగువ ! ౨౫౫

(చుల్లోహుఁడు. ౪-౨౪)

ఆ. పూలమయములైనఁ జాలగట్టివి, మేను
దాఁకకున్న వేఁడి తాళరాని,-
వొడలు చీల్చుచున్నఁ గడుఁదీపుగలవౌర !
మరునియమ్ములొక్క-తెఱఁగు గావు. ౨౫౬

(హాలుఁడు. ౪-౨౬)

క. వలపుల రేఁచును; విరహం-
బులఁ జావఁగనీయ; వీసుఁ బుట్టించును; త-
ప్పులనెల్ల నోర్వఁజేయును !
చెలియా! పలుతెగలు గదవె చెలువునిగుణముల్ ! ౨౫౭

(మాహవసేణుఁడు. ౪-౨౭)

ఆ. కటికవాఁడ! నిన్నుగనఁగోరి చెంగావి-
వలిపచీరగట్టి, వాయనములు
పళ్ళెరములనించి, పాపమిల్లిల్లును
దిరుగ వెడలిపోయెఁ దరుణి యిపుడు. ౨౫౮

(ధణంజయుఁడు. ౪-౨౮)

తే. పొగదగిలి మాసి, పిడుకనిప్పుకల కంపు
వట్టి, పోఁగులు సడలిన ప్రాఁతగుడ్డ
గప్పుకొనియుండ నీచలికాలమందు
పేదవాఁడని తెలియంగరాదె వాని ! ౨౫౯

(అణ్ణాయుఁడు. ౪-౨౯)

ఆ. పల్లెవాఁడు గోటగిల్లి క్రొమ్మావిపూ-
గుత్తి నెత్తి ముడిచికొనుచుఁ బోవ,
బందిగొన్నచెలువపగిదిని, దానివె-
న్కొనుచుఁ బాఱఁజొచ్చెఁ గోడెతేంట్లు ౨౬౦

(మహారాయఁడు. ౪-౩౧)

తే. నేర్పుకాఁడవు సూర్యునినెపము వెట్టి
యెవ్వరికి మ్రొక్కెదవు వచియింపు కొడుక ?
చిఱుతనగవులు గ్రేగంటికఱకుఁజూపు-
లెక్కడను రావు వేల్పుల మ్రొక్కునపుడు ! ౨౬౧

(విగ్రహరాయఁడు. ౪-౩౨)

క. బుగులుకొను శోకభరమున
బిగిసిన కంఠమున సగము వెడలుచుఁ బలుకుల్
తెగిపడఁగఁ బాటనెపమున
మగువా! యేడ్చెదవు తెల్పుమా యెవ్వనికై ? ౨౬౨

(అహాయుఁడు. ౪-౩౪)

ఆ. ఊరలేఁడు మగఁడు; కారుచీఁకటి గ్రమ్మె-
నట్టి పాడురేయి; వట్టియిల్లు;
దొంగలెవ్వరైన దోతురు సుమ్మి! ని-
ద్రింపవలదు ప్రక్కయింటివాఁడ ! ౨౬౩

(అహాయుఁడు. ౪-౩౫)

ఆ. క్రొత్తమొగిలు సూచి కోడలి ప్రాణముల్
కదలుచుండ, దానిఁ గాచుచున్న-
దితరచింత విడిచి, సుతుపాలిసంజీవ-
నౌషధమ్ముఁబోలె, నత్తగారు ౨౬౪

(విహాలుఁడు. ౪-౩౬)

---

(౨౬౧) నోఏస్త్రీ వలచి దూరమునుండి చూచినప్పుడే యిట్టి విలాసములు పుట్టునని భావము.

ఆ. ఎపుడు నీయెడందవిల్లాలి నెలకొల్పి
నాదుమదిని నిల్చినావు నిజము-
గాకయున్న నందకాఁడ! యాయింతి మా
కోర్కులెల్లఁ దెలిసికొనుట యెట్లు ? ౨౬౫

(మహాయేవుఁడు. ౪-౩౭)

ఆ. నీవు చూపు దాఁటి పోవుడు, బాష్పంబు
వెల్లివొడిచి పొరలు వెడఁదకనుల
నీళ్ళు వదలెనతివ నిన్ను వెండియుఁ జూచు-
నన్ని సౌఖ్యములకు నందకాఁడ ! ౨౬౬

(మణోరహుఁడు. ౪-౩౮)

ఆ. తలఁచునపుడు మదికిఁ దగిలెడు నీదుమొ
గంబు గనుచు జీవితంబునందు
నాస నిల్పుకొంటినయ్య! యిట్లేడ్చుచుఁ
గాలమింక నెంత గడపుదాన ! ౨౬౭

(విస (ఘు) సేణుఁడు. ౪-౩౯)

ఆ. చనవుగల్గు తొంటిజనులందఱును జచ్చి-
పోయి యుండు జన్మభూమిఁ బోలెఁ,
జెలువు జవ్వనమును జెల్లిన నినుఁజూచి
వగవకెవరికుండవచ్చు ? బిడ్డ ! ౨౬౮

(పవరరాయఁడు. ౪-౪౦)

---

(౨౬౫) ఈమాట చెప్పునది పరకీయ; లేదా సామాన్య: తనయందే ప్రీతియున్నట్లు భార్యయందు లేనట్లును అతఁడు నటించువాఁడు. ఒకనాఁటి యుదయము భోగచిహ్నములతో ఈమెను జూడవచ్చినాఁడు. ఆచిహ్నములన్నియు తానతనికిఁ గలుగఁజేయవలెనని యాశించిన దీమె. కాని ఆపని అతనిభార్యయే చేసినది. దానికై యిట్లు వక్రముగా అతని కపటవృత్తి నాక్షేపించినది.

ఆ. జనులనడుమ వాఁడు సంతసంబున విచ్చ-
కొనిన కనులఁ దనదుకోర్కెఁ దెలిపె;
అపుడు నిలువుఁజెమటలైన యంగంబుల
నింతిగూడ దానికియ్యకొనియె. ౨౬౯

(జీయయేవుఁడు. ౪-౪౧)

ఆ. ఉల్లమందువలపులొండొరులకుఁ జెప్పి
యంపికొనుచు, వేడ్కయలవి మీఱి
సాఁగుచుండఁ, గోర్కె సమకూరకుండు నా-
ల్మగల యునికి దుర్గమంబు సూవె! ౨౭౦

(౪-౪౨)

ఆ. వానిమీఁద నీకు వలపు లేదేనియుఁ
జెపుమ! వానిపేరు సెప్పినంత
ముద్దుగుమ్మ! నీదు మోమింత గానేల!
ప్రొద్దు పొడుపుఁ దమ్మిపూవుఁ బోలెఁ ౨౭౧

(సుసీలుఁడు. ౪-౪౩)

తే. అలుకమానికిఁ బెనుగాలి, యంగమెల్ల
సుఖము నించెడు నెఱదాత, సురతనాట-
కంబునకుఁ బూర్వరంగము - కౌఁగిలింత
చల్లఁగాన త్త! జగతి వర్ధిల్లవలయు! ౨౭౨

(౪-౪౪)

ఆ. నీకుఁ దోఁచినదియె నిజమనుకొని, సత్య-
మరయలేని వానియందుఁ దగిలి,
యేల చుల్కఁబఱిచెదీరితి మమ్ముఁ? జా-
లింపుమింకఁ గనికరించి, మనస! ౨౭౩

(కేలాసుఁడు. ౪-౪౫)

ఆ. చిన్నవాఁడ ! నీవు కన్నులయెదుటనే
యుండ నాఁడునాఁటికెండుచుండు-
నిట్టి యొడలు గలిగి, యెవరికి నడిగిన
నేమి చెప్పవలెనొ యెఱుఁగలేము ! ౨౭౪

(మాణిక్యరాయఁడు. ౪-౪౭)

ఆ. చివికి యంగములు కృశింపఁజేసితివి; నే-
ర్పితివి తెగనియేడ్పురీతులెల్ల;
తప్పుదారి నడపఁ దార్కొంటివయ్యలు !
మఱచిపోకు దీని మఱచిపోకు ! ౨౭౫

(మిహరుఁడు. ౪-౪౮)

ఆ చేరి మేమె నిన్నుఁ జెడిపెల ముందఱఁ
దొలుతఁ బొగడి పొగడి తుదకు మాకె
చేతికబ్బకుండఁ జేసికొంటిమి సుమా !
యెవరి నాడుకొనఁగనేల యిందు ? ౨౭౬

(సంకరసత్తి. ౪-౫౦)

ఆ. వంకరలెఱుంగనిది, కడ్డివంటి గోల;
యిప్పుడాబిడ్డయెడ నిట్లు తప్పునేసి,
ఆవులింతలు నేడ్పులు నలసగతులు
నొక్కపూటనె నేర్పితివోయి నీవు ! ౨౭౭

(కయలీహరుఁడు. ౪-౫౨)

ఆ. మదిని నెఱతనంబు మాసి, దాక్షిణ్యంపుఁ
బలుకులాడునపుడు గలిగినంత
నొప్పిగాదు నీవు తప్పు నేసిన యప్పు-
డైన నాకు; నమ్మమందకాఁడ ! ౨౭౮

(జయరాయఁడు. ౪-౫౩)

ఆ. పువులు గోసి తేరఁ బోకు; దోసిటిసీట
దేవతలకుఁ దనివి తీరఁగలదు;
మూలముట్టుగాఁగ శీలంబు గౌతమి-
గట్లు పెల్లగింపఁ గలవురయ్య! ౨౬౯

(ఇందణుఁడు. ౪-౫౫)

క. పలుకుపలునకు నూర్పుల
సొలపునడుమఁ దల గదల్చుచును మనసిచటన్
నెలకొల్పక యూఁగొట్టుచుఁ
జెలియా! మమ్మేల యిట్లు చేడ్పఱిచెదవే! ౨౭౦

(అసోయుఁడు. ౪-౫౬)

ఆ. 'దానిఁ గూడి యిచటఁ దనియుదు' నంచు నా-
సించి పల్లెవాఁడు చెమ్మగిలిన
కేలఁగొన్న కందిగింజలు చేనిలో
రాలుఁ దడిసి విత్తనాలవేళ. ౨౭౧

(గుణమందియుడు. ౪-౫౭)

తే. అదిగొ! దయిఁతుడు గోసినయట్టి ప్రత్తి-
గవ్వతొడిమెలపయిఁగూడ గగురుపొడిచి
చెమ్మరించిన వ్రేళ్ళతోఁ జేయి కాఁపు-
కోడలికి నూరకయ ప్రాఁకులాడుఁ జూడు! ౨౭౨

(హాలుఁడు. ౪-౫౯)

---

(౨౬౯) గోదావరిగట్ల పొదలలో చేఁజిక్కినవారిని బట్టి చెఱుచు సాహసికలు తిరుగులాడుచుందురని భావము.

(౨౭౦) చెలికత్తెలేమో చెప్పుచున్నారు. ఆమెది విరహమందలి పరధ్యానము.

(౨౭౨) అతఁడు తాఁకినదానిని తాను దాఁకుటయందు ఆకాఁపుబిడ్డకీసాత్వికభావోదయము. అందుకై అతఁడు కోసిన ప్రత్తితొడిమెలనే తాను మరల వెదకుచున్నట్లు నటించుట.

ఆ. చొక్కి కనులు మూయు సుదతిఁ జచ్చెనటంచు
విడిచి పాఱు కాఁపువెడఁగుఁ జూచి,
ప్రత్తికొమ్మ సగముపగిలిన కాయల-
మొగము వంచి చేల నగియెఁబోలె. ౨౮౩

(జణ్ణందసారుఁడు. ౪-౬౦)

ఆ. పుణ్యవతులు వడఁకి పులకించి నిట్టూర్పు-
లూర్చి కునిసియాడుచుండఁ గలరు;
కనులఁ బ్రియుని గాంచఁగానె మాబోంట్లకు
నొడలఁ దెలివిగూడ నుండదమ్మ ! ౨౮౪

(రోలయేవుఁడు. ౪-౬౧)

ఆ. కానివారిసిరిని గాంచుట, వైద్యులు
లేని తెవులు, విభవహీనులగుచు
బంధుమధ్యమందు బ్రతుకును, బోలు నీ
విరహదుఃఖమోర్వఁదరమె దీని ! ౨౮౫

(వామయేవుఁడు. ౪-౬౩)

ఆ. గగనతలముఁ బోలెఁ గడుఁ బెంపుఁ బఱపును
నిర్మలతయుఁ గల్గు నీయురంబు-
నెదిరి ముట్టడింప నెవరోపుదురు పయో-
ధరముదక్క జగతి నరపతీంద్ర ! ౨౮౬

(విలాసుఁడు. ౪-౬౪)

---

(౨౮౬) పయోధరము=మేఘము; స్తనము. ఎవఁడో యీ శృంగారివీరుఁడు రాజు !

ఆ. అడవి పొదలనడుమ నొడఁబడి వానికై
వేచు కలికి, కాలిఁ వ్రేళ్ళతుదలు
దాఁకి కలుగునెండుటాకుల మర్మర
నాదమాలకించు నాదరించి ౨౮౭

(మఝ్ఝుఁగు. ౪-౬౫)

ఆ. ఇందుకాంతివలని యిక్కట్టులెప్పుడుఁ
గానకున్న వింతకమలమనుచుఁ
గమ్మయూర్పుతావికై చుట్టు మూగెడు
సుదతినెమ్మొగమునఁ గొదమతేంట్లు ౨౮౮

(వసంతుఁడు. ౪-౬౬)

తే. ఇంటిపెద్దలయెదురఁ దానెంత మనసు-
నడఁచుకొని యుండినను, నీవు వెడలినపుడు
కనులు మూయుటచే రెప్పకొనల నున్న
దాని కన్నీరు తటుకున ధరణిఁబడియె. ౨౮౯

(వాహవుఁడు. ౪-౬౭)

ఆ. 'ఒప్పునిదియు ఫాల్గునోత్సవంబున' నంచుఁ
జల్లెఁ గలపమెవఁడొ సరసుఁడింతి !
కరఁగిపోయెఁ జన్నుగడవలఁ బొరలు చె
మ్మటలనదియు; నేల మరలఁ గడుగ ? ౨౯౦

(సూరుఁడు. ౪-౬౯)

తే. మందబుద్ధివి; పెద్దలముందు నాఁడు
రెప్పవేయక నీవంక రెడ్డికూఁతు-
రించుకించుక మొగము మలంచి చూచు
చికిలి క్రీఁగంటి చూపులఁ జెప్పలేదె ? ౨౯౧

(వహురాహుఁడు. ౪-౨౦)

తే. కన్నుగోరలలో నిండి కలఁగు బాష్ప-
వారిబరువున మసకలు వాఱ చూడ్కిఁ
బలుమఱును నది చూచుచూపులనె నీకుఁ
జెప్పక మిగిల్చినది యేమి చిన్నవాఁడ! ౨౯౨

(హాలుఁడు. ౪-౨౧)

ఆ. నాఁడు వయసుమగలు నాకుఁ దలాడగాఁ
బెట్టుచున్న గుజ్జవేల్పుదొరకె
యెరగుచున్న దాననిప్పుడు; చూచి సం-
తసముపడుము పాడుముసలితనమ ! ౨౯౩

(౪-౨౨)

ఆ. కాఁపుకొడుకు మదిని గమలెడు, నిల్లాలు
దెగినయింటిలోన తిరుగుచుండి,
తాము సొగపు గన్న తావులు నిధియెత్తి
నట్టి గనులుఁబోలె నగపడంగ. ౨౯౪

(బాహహత్థి. ౪-౨౩)

---

(౨౯౧) 'ఆమె తనవలపును నాతోస్పష్టముగాఁ జెప్పలేదే' అని నాయకుఁడడుగఁగా దూతి చెప్పినమాట. తరువాతి పద్యమునను ఇదే వేఱువిధముగాఁ జెప్పఁబడినది.

(౨౯౩) ధర్మార్థమోక్షములను తృణీకరించిన కామోద్రేక వర్ణనమిది.

ఆ. ఎవనితోడ నించుకెడఁబాటు గల్గిన
దేహమెల్లఁ జిక్కి తెల్లఁబాఱు,
నిదుర నిలిచిపోవు, నిడుదయూర్పులు సాఁగు-
నతనితోడనేఁటియలుక చెలియ ! ౨౯౫

(హాలుఁడు. ౪-౨౪)

తే. సొగసుకాఁడ ! మనంబున సురిగి సొరగి
నీకొఱకునింకనే మరణింపనోరి !
నిన్నె తలఁచుచుఁ జచ్చి వెండియును బుట్టి
మరల నీకె వసంబయి మఱుఁగలేను ! ౨౯౬

(౪-౨౫)

ఆ. ఇచ్చకొలఁదిఁ దప్పులెన్నియైనను జేయు
మన్నియోర్వనేర్తుమందకాఁడ !
నీదు సద్గుణములు నిండిన మాచిత్త-
మందు దోసములకు సందులేదు. ౨౯౭

(మావురాయఁడు. ౪-౨౬)

ఆ. నీవు చేసినట్లు, నీవు మాటాడిన-
యట్లు, నీవు సూచినట్లు తాను
నేర్వఁ గడఁగుచుండు నెలఁతకు నిడుదలు
గాక దినములిపుడు గడచుఁ జూవె ! ౨౯౮

(కల్లణసీహుఁడు. ౪-౨౮)

---

(౨౯౬) 'యం యం వాపి స్మరణ్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః'
అను శ్రీగీతావాక్యమిందు స్మరింపఁదగును.

తే. తెరువరికి రాత్రిపూట నిద్రించుకొలఁకుఁ
గసరి తిట్టుచు నిచ్చిన గడ్డిమోపె
చేద్చుకొనుచును మరలఁ దానీడ్చివైచు-
చున్నదిల్లాలు కంటె ప్రత్యూషవేళ ! ౨౯౯

(అత్థుఁడు ? ౪-౨౯)

ఆ. చేటులందు వెతలఁ జెందరు; భయముల
గుండెచెడరు; సిరులఁ గ్రొవ్వుగొనరు;
ఎచ్చుదగ్గులందునేకచిత్తముతోడ
నొప్పువారు సూవె గొప్పవారు. ౩౦౦

(పరిణాలుఁడు. ౪-౩౦)

ఆ. తనదుచెలిని దలఁచుకొని యేమొ ప్రొద్దునఁ
బాడుచుండె వాఁడెవండొ చెలియ !
చెఱకువిల్తునంపకఱకులు దిన్న నా
మదిని బుండు గోటఁజిదుమునట్లు. ౩౦౧

(కేసవుఁడు. ౪-౩౧)

తే. కొలఁది మీఱఁగనెదిగెడు క్రొత్తపెండ్లి
కూఁతుపాలిండ్లయుదుటుపెక్కువను జూచి,
చిక్కనవసిన చెక్కిళ్ళచెలువు గలుగు
మొదటిపెండ్లాము నిట్టూరుపుల నిగిడ్చె. ౩౦౨

(మత్తగయిందుఁడు. ౪-౩౨)

---

(౨౯౯) దారిఁబోవువానికుపచారము చేయలేక మొదలు కోపము. తరువాత ఆరాత్రియే వానితో చెలిమి కుదిరినది. ప్రాతఃకాలమున వానిప్రయాణ కాలమున విరహదుఃఖము.

(౩౦౦) ఈగాథకర్త 'ప్రరితానుఁడు' అని పీతాంబరటీక.

(౩౦౨) దీనికర్త 'నీలభానుఁడు' అని పీతాంబరటీక.

తే. ఎంతయాఁకలిగొని యున్న నిదిగొ చూడు!
దయితకరిణీముఖంబును దలఁచుచుండి
తిన మనసురాని కుంజరమునకు వాడెఁ
దొండమునయందె తామరతూండ్లపిడుచ. ౩౦౩

(౪-౧౩)

ఆ. 'అలుకమాను చెలియ!' 'అలిగిన దెవ్వతె?'
'మెలఁత నీవె.' 'యొరులమీఁద నాకు-
నేఁటి యలుక?' 'యిచట నెవ్వరొరులు?' 'నాథ!
నీవె!' 'యెట్లు?' 'నాయదృష్టమహిమ!' ౩౦౪

(కువిందుఁడు. ౪-౧౪)

ఆ. నీవు వత్తువనుచు నిముసంబువలె రేయిఁ
దూఁగు లేక కడపెఁ దొలిసగంబు;
మలిసగంబు వెతలబలిమికిఁ జిక్కి యా
యింతి త్రోసె నొక్క యేఁడుఁ బోలె! ౩౦౫

(అల్లుఁడు. ౪-౧౫)

తే. తిన్నఁగా నాదుకొనుఁడు; భీతిల్లవలదు!
పాపమీమెకు దయ్యము పట్టలేదు;
ఉన్నదున్నట్లు మేఘంబులుఱుము గుండె
చెదరి కలఁగిన తెరువరిచెలువ గాని! ౩౦౬

(దుద్ధరుఁడు. ౪-౧౬)

---

(౩౦౩) దీనికర్త 'మత్తగజేంద్రుఁడు' అని పీతాంబరటీక.

(౩౦౪) పొలయలుక గొన్న మానినికిని ఆమెను సమదాయించు ప్రియునకును నడచిన సల్లాపము.

(౩౦౬) 'వర్షాకాలము వచ్చినదేమో: ప్రియుఁడు పరస్థళమునకు వెళ్ళినవాఁడు రాలేదే! గతియేమి?' అని ఆమె విభ్రాంతురాలైనది. ఏదో గ్రహచేష్ట యనుకొన్నారు ఇరుగు పొరుగులవారు. తత్వమెఱిఁగి కవికరించిన అనుభవశాలి యొకరు చెప్పెడు మాటయిది.

ఆ. కమలమందుఁ గేసరముల పుప్పొడితోడి
కమ్మఁదేనె యెంత క్రమ్మియుండు
నొండుపువుల నంత యుండిన నీదిమ్మ-
దిరుగులందగించుఁ దేఁటికొదమ !   ౩౦౭

(౪-౮౭)

ఆ. నిలువుగనులఁ దెరువరులు గొంతురాసతోఁ,
బాలకడలిఁ బుట్టి పయికి వచ్చు
కమలఁ బోలి పొలుచు కాఁపుబిడ్డను, దంచు
పిండితెలుపు మేన నిండియుండ.   ౩౦౮

(సురహివచ్చుఁడు. ౪-౮౮)

ఆ. 'ఎవరిఁ దలఁచుకొంటివేః' యని యడిగిన,
'నెవరు గలరు నాకు భువిః' నటంచు,
గోలుగోలుమనుచు గొంతెత్తి యేడ్చి యా
యింతి మమ్ముఁగూడ నేడిపించె.   ౩౦౯

(సురహివచ్చుఁడు. ౪-౮౯)

ఆ. చెడుగుపిల్ల! కాళ్ళఁ బడినాఁడు; నీపతి
నింకనైన లేవనెత్తవేమి ?
వలపులెంత గట్టివాటి నిల్చినవయ్యు
నిదియె వినుము వానికెల్ల మేర !   ౩౧౦

(హాలుఁడు. ౪-౯౦)

---

(౩౦౭) ఈగాథకవి 'దుర్ధరుఁడే' యని పీతాంబరటీక.

(౩౧౦) కాళ్ళకు మ్రొక్కినతరువాతఁగూడ అలుకవదలి త్రోవకు రావేని అంతటితో నతనికి నీ మీఁది వలపు తెగునని చెలియుపదేశము.

ఆ. పచ్చరాతిసూదిఁ గ్రుచ్చిన ముత్యంబు
పగిది, గరికతుదను దగులుకొన్న
నీటిబొట్టు, మెడను నిడుపుగాఁ జాఁచి, త్రా-
వెడిని వానకారువేళ నెమలి. ౩౧౧

(పాలితుఁడు. ౪-౯౪)

ఆ. నీలివన్నె రవిక నిండియు మిగిలిన
చంటిమిట్ట యొకటి సతికిఁ బొలిచె,
నీటనిండు మొగిలుచాటున నించుక-
వెలికిఁ దోఁచు చంద్రబింబమట్లు. ౩౧౨

(మీణసామి. ౪-౯౫)

క. దొరకెంచిన కీడుంబలెఁ
దెరువరి తెరువరికి వెఱచి తెలిపెడు 'నదె చూ
డర! మామిడియాకులలో
నర మొలచెను మొలవరాని యది యొక' టనుచున్. ౩౧౩

(బహుల్లుఁడు. ౪-౯౬)

ఆ. పుణ్యవతులు సుమ్ము పొలఁతులు కలనైనఁ
గాంతుమోము చూడఁగలుగువారు;
వాఁడులేక మూఁతవడనైనఁబడవు నా
కనులు; కలలనెవతె గాంచునింక! ౩౧౪

(మలయసేహరుఁడు. ౪-౯౭)

---

(౩౧౩) వసంతమునకు సూచకమగు మొగ్గతొడుగని భావము. ఈగాథ కర్త పేరు 'వల్లణుఁడు' అని పీతాంబరునిటీక.

ఆ. మొదలు చెక్కుటద్దములదాఁక నపరంజి
కమ్మలెపుడుఁ దాల్చు కలికిచెవులు
దాల్పవలసె నేఁడు తాటాకుచుట్టల
జోడు! కాలమహిమ చూచినావె! ౩౧౫

(౪-౯౮)

తే. మండుచుండెడి వేసవియెండవేళ
నరుగుచుండెడు తెరువరికైనఁ గాని,
మదిని నెలకొన్న ప్రియురాలి వదనచంద్రు
పండువెన్నెలవెల్లి తాపంబునణఁచు ౩౧౬

(మంగలకలసుఁడు. ౪-౯౯)

ఆ. దేశకాలములను దెలియక వేఁడిన
నెవరికైనఁ గోపమెట్లు రాదు?
భోగలాలసతకు లోఁగి, యేడ్చుననుంగుఁ
గొడుకునైనఁ దిట్టుకొనదె తల్లి! ౩౧౭

(మహోహియుఁడు. ౪-౧౦౦)

ఆ. మండెదేని మండు! మాఁడెదేనియు మాఁడు,
పగిలెదేని పగులు; పాడుమనస!
వాఁడు తగినవాఁడు గాఁడని యొకమాఱు
నిర్ణయించినాను నేఁడు మొదలు! ౩౧౮

(హాలుఁడు. ౫-౧)

---

(౩౧౫) ఈగాథకవిపేరు 'మంగలకశీలుఁడు' అని పీతాంబరటీక.

(౩౧౭) కవిపేరు 'మహోదధి' అని పీతాంబరుఁడు. 'మహోహియ' అనునది 'మహోదధి' వికృతరూపము కావచ్చును.

ఆ. మంచివారు గానిపించుటే యరిది యీ
పాడుజగమునందుఁ బలువగుంపు
నిండియుంటఁ; గాకితండంబులున్నంత
యంచలుండఁగలవె యవనిమీఁద ? ౩౧౯

(కుమారుఁడు. ౫-౫)

ఆ. వెడఁదమూతితుదను వెడలిన వాఁడియౌ
కోఱపంటితోడికొడుకుఁ జూచి
తల్లిపంది తనకునొల్లకున్నను మేయు
నూరిప్రక్కతోఁటనుండు యవలు ! ౩౨౦

(విగ్గహుఁడు ౫-౨)

ఆ. తోయమెల్ల లీలఁ దొండంపుఁదుదఁ బీల్చి,
కడలి రిత్తపాత్ర గానిపించి,
యడ్డులేని బాడబాగ్నిని నభమెల్ల
నించు గుజ్జువేల్పు నెగడుఁగాక ! ౩౨౧

(పొట్టిసుఁడు. ౫-౩)

క. ఇలమీఁదనశోకమ ! కా
వలసినదేమింతకన్న భాగ్యము నీకున్ ;
లలనారత్నంబుల చే-
తులఁ బోల్తురు నీదుచివురుతోఁగద రసికుల్ ! ౩౨౨

(కడ్డిల్లుఁడు. ౫-౪)

---

**(౩౧౯)** ఈగాథ పీతాంబరుని మూలమునందలిది. ఈసంఖ్యయు నందలిదే.

(౩౨౦) ఎవరైన నదలింపవచ్చిరేని కొడుకుపౌరుషము ప్రకటించునవకాశము లభింపఁగలదను పొగరుతోడియాశ తల్లిపందికి. ఈగాథకవి 'విగ్రహరాజు' అని పీతాం.టీ.

**(౩౨౨)** కవిపేరు 'కట్టిల్లుఁడు' అని పీతా.టీ. ౬౧ వ గాథకర్త 'కటిలుఁడు' కాఁబోలును.

క. కొడుకునకును దయితునకును
నడుమను గూర్చున్నవేళ నఖముఖముల రా-
పిడిచే నిల్లాలికిఁ జ-
న్గడవలలోఁ జేపునొకటొకటి పులకించున్. ౩౨౩

(హాలుఁడు. ౫-౯)

ఆ. మరులు నించు నింతచిఱుతప్రాయమునందె;
జుత్తెఁడైన లేదు చూడు మరల!
పెరిగెనేని రెడ్డిబిడ్డ యనర్థంబు
దెచ్చు నిజము, విసపుఁదీఁగవోలె! ౩౨౪

(భోజయుఁడు. ౫-౧౦)

ఆ. 'నిదురపోవె! కడచెనిదిగొ మూఁడవజాము'-
ననుచుఁ జెలులు! నన్ను నాడనేల?
నన్నుఁ గూర్కనీదు నల్లవావిలిపూల
నిండుతావి; నిద్రపొండు మీరు! ౩౨౫

(సిరిసత్తి. ౫-౧౨)

ఆ. బురదయెల్లనెండిపోవఁ, దాఁబేళ్ళను
మీలు వెట్టఁజిక్కి మిడియుచుండ,
నేఁడు గంటిమెపుడుఁ జూడనిదీతటా-
కంబునడుగునేల; కాలమహిమ! ౩౨౬

(౫-౧౪)

---

(౩౨౪) రెడ్డి = గ్రామణి, ఊరినాయకుఁడు.

* 'శాలవాహనుఁడు' అని సీతాం. టీ.

ఆ. దొంగతగులములకు లొంగి చీఁకటిరేల
వలసినట్లు తిరుగవలదు బిడ్డ!
కానఁబడెదు చక్కఁగానె యింకను దీప-
కళిక వోలె నంధకారమందు! ౩౨౭

(బమ్హయంతుఁడు. ౫-౧౫)

క. అడిగిన బదులాడదు, క-
న్నడు వారలమీఁద రేఁగిపడునూరక, యా
చెడిపె గనుమేటి చెంగటి
మగువు పొదలు చిచ్చు దగిలి మండుచునుండఁ! ౩౨౮

(రోలయేవుఁడు. ౫-౧౬)

తే. నిజము చెడిపెలమేమెల్ల; నీది మచ్చ
లేనికులము! పతివ్రత! లేచిపోవె!
కాని మాకెవ్వరికిని మంగలిని వలచు
నెఱతనము లేదొకానొకగరితఁబోలె! ౩౨౯

(పాలితుఁడు. ౫-౧౭)

క. నిద్దుర గందురు; చెప్పిన
సుద్దులు వినఁగలరు: పలుకుచోఁ దడఁబడ; రే
ప్రొద్దు నినుఁ జూచి యెఱుఁగని
ముద్దియలది సుఖము, సుభగమూర్తి! జగమునఁ ౩౩౦

(దేవయేవుఁడు. ౫-౧౮)

---

(౩౨౭) 'బ్రహ్మదత్తుఁడు' అని పీతాం-టీకయందీకని పేరు. కనుక 'బమ్హయత్త' అను ప్రాకృత రూపముండఁదగును సున్న ఉత్తరాక్షరద్విత్వసూచకముగానుండుట ప్రాకృతలిపి పరిపాటి.

(౩౨౯) రహస్యదురాచారముగలయిల్లాలొకతె యొకవేశ్యను

ఆ. చూచినంతఁ గన్ను సొగియించి, కరముల
సోఁకినంత మనసు సొక్కఁజేయు
కళలరాశి, చంద్రుకరణి నుండు ప్రియుండు
వలచినంతనబ్బువాఁడె చెలియ ? ౩౩౧

(రాయరసియుఁడు. ౫ - ౨౧)

క. అనుఁగుఁ జెలికాఁడ! పై వా-
లిన తేఁటులబరువుదందడికిఁ బువుగుత్తుల్
తునిసెడునవి యివె కాలం-
బున దంట్లయి నిలిచెఁ బ్రబ్బపొదలేటి దరిన్ ! ౩౩౨

(దశరథుఁడు. ౫ - ౨౨)

క. కలలో దొరకెడు లిబ్బుల
వలెఁ, జూచినయట్లె మఱుఁగువడి పోయెడు నీ
వలపులకు లోఁగి పలుతలఁ-
పులతోఁ బిన్నమ్మ ! మోసపోతిమి గదవే ! ౩౩౩

(సరణుఁడు. ౫ - ౨౩)

ఆ. చక్కఁదనము తనకు సహజమై, గుణముతోఁ
గూడుకొనెడి యంపకోలనైనఁ
గడవఁ ద్రోయు విల్లు; తడవుగాఁ బొందెట్లు
సాఁగు వంకరలకుఁ జక్కటులకు ? ౩౩౪

(కంకణతుంగుఁడు. ౫ - ౨౪)

---

(౩౩౧) కరములు = చేతులు, కిరణములు, కళలు = శృంగారలీలాపాండిత్యము. చంద్రుని పదునారవ భాగములును. చంద్రుఁడును చేతికందనివాఁడే.

(౩౩౨) ఈగాథ మొదలుగా నిఁకముందు కవులపేర్లు అన్నియు పీతాంబరుని టీకనుండి యెత్తఁబడినవి.

(౩౩౪) అమ్ము స్వభావముగా చక్కఁగానుండును; గుణము - అల్లెత్రాడు - తో కూడునది. అట్టిదానిని వంకరగానుండు విల్లు వెలికిఁద్రోయును. అట్లే నిష్కపటులైన గుణవంతులకును వక్రస్వభావులకును చెలిమి కలిగినను చాలకాలము సాఁగదు.

ఆ. ప్రియులఁ గౌఁగిలించువేళలఁ జనులపై
రత్నహారములను రమణులూడ్తు;-
రెంత సుగుణవంతులేనియు నవమాన
మొందరొక్కొ కాలమొదవినపుడు ! ౩౩౫

(మకరందుఁడు. ౫ - ౨౯)

ఆ. వేఱుతెఱఁగు చూడవే లాఁతిచిచ్చుల
మచ్చుగాదు పాడుమరుని చిచ్చు !
నీరసంపుటెదల నాఱు; బగ్గుమటంచు
మండునెపుడు సరసమానసముల. ౩౩౬

(౫-౩౦)

తే. మన్ననలనట్లు పెరిగిన, దన్నినాళ్ళ-
చెలిమిచే వేఱు బలిసి నిల్చినది, చూడు,
ప్రేమవృక్షంబు పడిపోవువేళ నింత-
చప్పుడైనను లేదేమి చెప్ప నత్త ! ౩౩౭

(శాలవాహనుఁడు. ౫-౩౧)

అ. తీయమాటలాడఁ దెగి చేఁదులాడితి;-
వతఁడు కాళ్ళఁబడిన నరయవైతి;
వెడలి పోవ నడ్డుపడవైతి! పొలయల్క-
యెవరికొఱకుఁ బూనితింకఁ జెలియ ! ౩౩౮

(మానుఁడు. ౫-౩౨)

---

(౩౩౫) సుగుణము = మంచిదారము. హారములకిది యుండును.

(౩౩౬) నీరసము = తడిలేనిది; అనురాగములేనిది. సరసము = తడిగలది, అనురాగము గలది.

(౩౩౭) ఒకచెడ్డమాటగూడ లేక కాలపరిణామముచే మాయిద్దఱిప్రేమ చల్లగా చల్లఁబడి అంతరించినదని భావము.

ఆ. తుడుచు నొక్కమారు; కడుగు నింకొకమారు,
కొసరి యొక్కమారు గోరఁ జిమ్ము;
ముగుద యెఱుఁగలేదు ! మగఁడు చన్మిట్టపై
నాఁటియున్న గోటికాటు గంటె ! ౩౩౯

(పాలితుఁడు. ౫-౩౩)

ఆ. యౌవనంబువలె నుదారపయోధర-
లీలఁ బొల్చు వానకాలమరుగ,
మొదటి రెల్లుఁబూవు మొలచెను, భూదేవి-
శిరమునందుఁ గురుల నరపు వోలె, ౩౪౦

(పాలితుఁడు. ౫-౩౪)

క. ఉడుగని జలధారలనెడు
నిడుద్రాళులఁ గట్టి యీడ్చి నిక్కియు బలిమిన్
బుడమిఁ బయికెత్తలేకా-
ర్చెడుగతి నుఱిమెడిని గంటిరే మొగిలు దివిన్ ! ౩౪౧

(కహిలుఁడు. ౫-౩౬)

ఆ. ప్రియుఁడు గడువుదినముఁ బేర్కొన్నవేళలో
నొప్పుకొంటివిప్పుడున్నయట్లె
పాడుమనస! కలఁగఁబాఱెదవేమి ? న-
మ్మించి నన్నుఁ జెఱుప నెంచినావె ? ౩౪౨

(ఉల్లోలుఁడు. ౫-౩౭)

---

(౩౪౦) పయోధరములు = స్తనములు, మేఘములు. వర్షాకాలమునకంటె శరత్కాలమున మన్మథవేగము తక్కువయని భావము.

(౩౪౨) గడువుదినము - మరల ఇన్నవనాఁడు తప్పక వచ్చెదనని చెప్పిన దినము.

ఆ. "తెలియనట్టిరకును దెలిపెడుఁ జూడవే
'వాఁడు పగులఁ గొట్టినాఁడు గాజు'-
లనుచు, వట్టిబేల !" "యట్లుగాదే ! పాప-
మతనిమీఁద దానికంత వలపు !" ౩౪౩

(అట్టరాజు. ౫-౩౮)

ఆ. నిండుజవ్వనంపు నిగ్గులుదేఱు క-
పోలమూలమందుఁ బొలఁతికదిగొ !
చెవిని వ్రేలుచుండు పువుగుత్తి వంగి లా-
వణ్యరసము ద్రావునట్లు దోఁచె ! ౩౪౪

(మాధవుఁడు. ౫-౩౯)

ఆ. అంగమెల్లఁ జెమటలై యుండ నయ్యంద-
కానిఁ బేరుకొనుచుఁ, గడఁగి దూతిఁ
జెప్పినదియె మరలఁ జెప్పి పంపుచు నింతి
కడకు వానియింటికడకె వచ్చె ! ౩౪౫

(ఖరగ్రహుఁడు. ౫-౪౦)

క. నను గొట్టునమ్మనన వా-
నిని గొట్టెదవేని మదన ! నే మఱుజన్మం-
బునఁగూడ నాదు జీవం-
బును నీపాదములఁ బెట్టి పూజింతుఁ జుమీ ! ౩౪౬

(ముగ్ధుఁడు. ౫-౪౧)

---

(౩౪౩) ఇద్దఱు చెలికత్తెలు క్రొత్తనాయికను గూర్చి కనికరముతో చేసెడు సల్లాపము.

ఆ. సిగ్గులేనివాఁడ! చేసిన మేలును
మఱచువాఁడ! నీదుకొఱకు వాన-
కాలమందు రాత్రివేళఁ ద్రొక్కిన యూరి-
బురద నేఁటికైన మఱవలేను! ౩౪౭

(కైశోరుఁడు. ౫-౪౫)

ఆ. ఇట్టి సొబగుపొగరు హెచ్చి వ్రేపల్లెలో
నెల్లయెడలఁ దిరిగెదేని తిరుగు!
పణఁతులందుఁ గల్గు గుణదోషములు చక్క-
నెఱిఁగి కొనఁగఁ జాలుదేని, కృష్ణ! ౩౪౮

(శాలవాహనుఁడు. ౫-౪౭)

ఆ. ప్రణయమయములైన పల్కుల తెగవేఱు!
ఇచ్చకంపు నుడుల యచ్చు వేఱు!
మనసులెఱుఁగునత్త! మఱి వాని భేదంబు;
అక్షరంబు లొక్కటైన నేమి? ౩౪౯

(కుమారిలుఁడు. ౫-౫౦)

ఆ. పట్టి పెదవులందుఁ బుట్టినవీమాట
లిట్టివెన్నియైన నేమి ఫలము!
మనసునుండి వెడలు మాటలతీరట
వేఱు; నిల్వకిందు వెడలి పోర! ౩౫౦

(చారుదత్తుఁడు. ౫-౫౧)

ఆ. నాకు సాటిగాఁగ నీకడ సౌభాగ్య
గరిమ దానికెట్లు దొరకనేర్చు ?
దానిపేరు గూడ దయమాలి హరియించి
నాకుఁ దెచ్చిపెట్టినావు నేఁడు ! ౩౫౧

(విష్ణురాజు. ౫-౫౨)

ఆ. అతివ ! తెలియకుండనడిగెదఁ; బ్రియులను
బాసినప్పుడాఁడువారికెల్లఁ
జెప్పు మున్నయట్లె చేతుల గాజులు
పెరిగి తమకుఁదామె పెద్దవగునొ ? ౩౫౨

(కజ్జలరాజు. ౫-౫౩)

తే. చుట్టుఁ దిరుగును; వగగొని సురుగు; మరలు;
చక్కఁ బయికెత్తఁ దొండము సాఁచి చూచు;
బురద దిగఁబడి యున్న కుంజరముఁ గాంచి
వలపుసంకిళ్ళచేఁ గట్టువడిన కరిణి. ౩౫౩

(దుర్గరాజు. ౫-౫౪)

ఆ. నీదు చూపుదారి నిలిచెడు, దిరుగాడుఁ
బ్రక్కలందు, ముందు పరుగులిడెడుఁ,
గులుకులాఁడి; చేతియెలఁదీఁగతో నిమ్మ
గట్టిదెబ్బ యొకటి ! కాఁపుకొడుక ! ౩౫౪

(వసంతుఁడు. ౫-౫౬)

---

(౩౫౧) దాక్షిణ్యమునకీమెదగ్గరకు వచ్చి తనకు ప్రియురాలైన ఇంకొకనాయిక పేరుతో ఈమెను బేర్కొన్నాఁడు నాయకుఁడు. దానికిది యీమె యిచ్చిన ఛలోక్తి. సౌభాగ్యము = భర్త ప్రీతికి పాత్రమగుట.

(౩౫౨) వియోగముగలిగినప్పుడు తాను కృశించినది. గాజులు వదులైనవి. అది తెలియనేరక అముగుద చెలికత్తెనిట్లడుగుచున్నది.

ఆ. గొల్లదొడ్డినడుమఁ గ్రొవ్విన తుంటరి-
కోడెవాఁడికొమ్ముగొనల మెల్లఁ
గనులు గోఁకికొనుచుఁ దనదు సౌభాగ్యసం-
పదను జాటుచుండు మొదవుఁ గంటె ! ౩౫౫

(చల్లోతుఁడు. ౫-౬౦)

ఆ. పాదములకు మ్రొక్క, బలిమి ముద్దులు గొనఁ,
గలుగు పలువగల సుఖంబులెల్ల,
గొలపిల్ల ! చెఱుచుకొంటివి గదె, వానిఁ
జూచినంత నలుకసుద్ది మఱచి ? ౩౫౬

(శాలవాహనుఁడు. ౫-౬౫)

ఆ. చూడుమిట్లు; ముద్దులాఁడి! నేఁటికి నింత
యలుక చాలు; మరల నలుగవచ్చు !
నిండుఁ జందమామ నిగ్గుల పండుగ-
రేయి సొగసులివిగొ మాయఁదొడఁగె ! ౩౫౭

(పోటిశుఁడు. ౫-౬౬)

ఆ. దీనులైనవారిఁ దేఁకువదీర్చి ర-
క్షింపఁ జాలువారలిరువురిలను;-
పార్వతీశుఁడైన పరమేశ్వరుఁడు, రాజ-
వల్లభుండు శాలవాహనుండు. ౩౫౮

(పృథ్వీనాథుఁడు. ౫-౬౭)

---

(౩౫౫) అంత తుంటరి యాబోఁతుగూడ తన్నేమియుఁ జేయలేనంత లొంగి పోయిన దని, అది తన కామనీయకబలమని, ఆవు చాటుచున్నది.

ఆ. ఊరికెల్ల నున్నదొకటే కదా రెడ్డి-
వారియింట నత్త! పాద్రిచెట్టు;
మరఁది జుట్టునిండ మరి యిన్ని యాపూలు
గలవిదేమి బాగుగాదు మనకు! ౩౮౯

(౮-౬౯)

ఆ. వలుదరెప్పలోలయ నలుపులై తెలుపులై
వాలు నిడుదకనులు వదనసీమఁ
గలవు గాని యితరకాంతలకును; నవి
తెలిసికొనవు చూచుకలికితనము. ౩౯౦

(చుల్లోతుఁడు. ౮-౭౦)

ఆ. పేదరాలు నిండువేవిళ్ళకాలమం-
'దేమి వలతు?' వనుచు నెందఱెన్ని-
మారులడుగుచున్న 'మంచినీరే' యను
మగనిఁ గలఁతపెట్ట మనసు రాక! ౩౯౧

(ముకుందుఁడు. ౮-౭౨)

క. విరహము మందరమై, ము-
మ్మరముగఁ బాల్కడలిఁ బోలు మాహృదయంబున్
దఱచి, యకట! రత్నంబుల-
కరణిఁ బెరికివైచె మా సుఖంబులనెల్లన్. ౩౯౨

(శాలవాహనుఁడు. ౮-౭౮)

---

(౩౮౯) మరఁదికి దండిగా పాద్రిపూవులిచ్చువారు రెడ్డివారియింట ఎవరోయున్నారని వదినెకు సందేహము. పాద్రి = కలిగొట్టు చెట్టు, పాటలము.

క. వెలఁదులకుఁ బలుతెఱంగుల
వలపుల నెఱవగలు నేర్పువారెవ్వరు? లో-
కులకెల్లఁ జెలిమి యొక్కటి
నెలకొనెనా నేర్పునదియ నేర్వనివెల్లన్. ౩౬౩

(కపిలుఁడు. ౫-౭౭)

తే. పొలఁతి! చెప్పెడువారి మాటలకె వలచి
డబ్బులాడెదు గాని, చూడవు నిజంబు
వానిఁ; జూచిన యెవ్వరికైన నిట్టు-
లొడలు తమచెప్పుచేఁతల నుండఁగలదె ? ౩౬౪

(వరాహుఁడు. ౫-౭౮)

తే, నీకొఱకు వేచి కన్నులు నిదురలేక
వాచియుండఁగ, సొగసులు వమ్ముగాఁగఁ,
జిన్నఁబోవుచు వగకాఁడ ! చెలులతోడఁ
జెప్పుకొనుటకు నోపదాసిగ్గులాఁడి ! ౩౬౫

(దుర్లభరాజు. ౫-౮౨)

ఆ. బ్రదుకు బొంగరంబువంటిది; విరహాగ్ని
సైఁపరాదు; మేను సన్నగిల్లె;
చెలియ ! యింకనేమి గలదు చెప్పఁగ ! నీవె
తెలియనేర్తు చేయవలయుదాని. ౩౬౬

(అజయుఁడు. ౫-౮౬)

ఆ. కలల నిన్నుఁ జూడఁగల సుఖంబులు లేవు
నీవియోగమందు నిదుర లేక;
కనులు నీరు గ్రమ్ముకొనుటనింతికి లేదు
నీదు దారిగను వినోదమేని. ౩౬౭

(మహాదేవుఁడు ౫-౮౭)

క. పెఱతప్పులకలిగిన నొక
తెఱఁగున నెపుడైన నరులఁ దేర్పనగుఁ జెలీ!
సరిపడనితప్పుచే ని-
త్తఱి నలిగినవానినేవిధంబునఁ దేర్తున్ ? ౩౬౮

(వనగజుఁడు. ౫-౮౮)

ఆ. వచ్చి కానిపింతు, విచ్చకాలాడుదు;-
వింతె మంచితనములెమ్మెకాఁడ !
యెవరి మనసులోన నేముండునో యది
తెఱచి యెవరికెవరు తెలుపఁగలరు ? ౩౬౯

(రాఘవుఁడు. ౫-౮౯)

ఆ. ప్రియుని జేరనడ్డమయి పాడువెన్నెల-
సీరదెంత గలదో నింగికొలన !
చెలియ ! చంద్రకిరణముల గొట్టముల యూట-
రెంతకాలమైన నెండి పోవు! ౩౭౦

(దూరమానుఁడు. ౫-౯౧)

క. సుందరతరుణజనంబుల
దందడిలోఁ గూడ నీదు దర్శనమునకై
వందురుచు నడవిలోన బ-
లెం దిరిగెడు నవ్వెడంగులేమకుఁ జూపుల్. ౩౭౧

(విరహవిలాసుఁడు. ౫-౯౨)

ఆ. ఊరఁ గొడుకు లేకయుండఁగాఁ గోడలు
వచ్చి కాళ్ళ మ్రొక్క వంగినపుడు
గాజులెల్ల జారఁగాఁ జూచి కడుఁగోప-
కత్తెయయ్యె నేడ్చె నత్తగారు ! ౩౨౨

(విదగ్ధుఁడు ౫-౯౩)

ఆ. మ్రాఁకులెల్ల గ్రీష్మ మధ్యాహ్నవేళల
మండుటెండలందు మాఁడి పోయి
యేడ్చుఁబోలెఁ జూచితే ! యతితారమై
మొరయుచుండు నీలపురువురొదల. ౩౨౩

(దుర్లభరాజు. ౫-౯౪)

ఆ. తొలుత మూఁగిన తేఁటిపెంటులకు వలచి
గండుదేఁటులు జుమ్మని క్రమ్ముచుండ,
విమలరవిబింబరుచికదంబములు ముద్దు-
గొనఁగ విచ్చెడు తామరగుంపు గంటె ! ౩౨౪

(పరమేశ్వరుఁడు. ౫-౯౫)

తే. 'మలయ మారుత సౌరభములకు నోర్వ.-
వనుచు నన్నిల్లు వెడలనీదత్తగారు;
పెరటియూడుగు పూవులపరిమళంబు
గొట్టుకొని చచ్చినను జచ్చినట్టు గాదొ ! ౩౨౫

(మాధవుఁడు. ౫-౯౬)

---

(౩౨౨) కోడలి విరహకార్శ్యము అత్తగారికిని ఓర్వరానంత యెక్కువైనది. అత్తగారైనను ఆఁడుమనసు, తల్లిమనసు పూర్తిగా లేకుండదు గదా. కొడుకునింతగా వలచినదే యని కనికరము.

(౩౨౩) అతితారము = తారస్థాయిని మీఱినంత కీచునాదము గలది.

ఆ. సుదతి మొగముఁ జూచుచును వాఁడు, వాని మొ-
గంబు మత్తు మిగిలి కనుచునదియు
ధన్యులైతిమనుచుఁ దలఁతురాల్మగలింక
నొరులు పుడమి లేకయున్నయట్లు ! ౩౭౬

(శాలవాహనుఁడు. ౫-౯౮)

తే. నేమమడిగెదె ? యది యెట్లు చిక్కు మాకు ?
నదిగొ చూచెదుగా యింటియంగణమునఁ
బొట్టిమామిడి ! యద్దానికొట్టకొనను
పుట్టరాని యనర్థంబు పుట్టెనొకటి ! ౩౭౭

(౫-౯౯)

ఆ. వీడుకొనెడువేళ వెలవెల్లనైన యి-
ల్లాలిమోముఁ జూచినట్టులెల్ల
బందెగాళ్ళువడఁగఁ బయనంపుమాటయే
తలఁపనేరఁడయ్యె దారికాఁడు ! ౩౭౮

(శాలవాహనుఁడు. ౫-౧౦౦)

ఆ. సూది గ్రుచ్చుకొన్నచోట రోకలి దూర్చు
వారు పాడుజనులు; వీరికోస-
మొక్కయూరనుండియును రెండుకన్నుల-
నిండఁ బ్రియుని జూడనేరనమ్మ ! ౩౭౯

(విక్రమభానుఁడు. ౬-౧)

---

(౩౭౭) వసంతసూచకమగు చిగురాకు.

(౩౭౯) స్వల్పమును పెద్దగా చేసి ప్రకటించువారు లోకులు.

ఆ. నిన్ను వేఁడుకొందు; నేఁడొక్కపూఁట న-
న్నేడ్చుదానినడ్డగింపవలదు;
అతఁడు రేపువెడలునప్పుడు నెచ్చెలీ,
భూమినున్న నేడ్వఁబోను లెమ్మ! ౩౮౦

(సర్వసేనుఁడు. ౬-౨)

ఆ. నిన్నుఁ జూచువేడ్క నీసద్దు విని యెన్ని-
యడుగులింతి వేగనరుగుదెంచె,
వెనుకకన్ని మోసికొనిపోవ వలసెను
దాని మేము, నీవు దాఁటిపోవ. ౩౮౧

(శ్రీమాధవుఁడు. ౬-౪)

ఆ. బొమలముడులు మత్సరమును నీసును లేక
యెండినట్టులుండు రెండుకనుల
నతఁడు నన్నుఁ జూచునందఱివలె; నింకఁ
జిక్కిపోక యేమిసేతు నత్త? ౩౮౨

(౬-౬)

ఆ. ఎపుడు మదికిఁ గూర్తు; వెగ్గలు సేయవు;
నిజము గాని, ప్రేమ నిండియుంట
నమ్మకంబు లేదు నాకు నీయెడ: ధైర్య-
మా. దవారికేది యందకాఁడ! ౩౮౩

(రోలదేవుఁడు. ౬-౮)

---

(౩౮౦) రేపు ప్రియుని ప్రయాణమని విన్నప్పటిదీయేడ్పు.

(౩౮౨) వలపుగలచోట పైగుణములు చూపులకుండును. అవిలేని చూపులందఱిని జూచునవి. 'నేనుగూడ అందఱితోడిదాననే యైతినే' యని యామె మరుగుచు కృశించినది.

ఆ. ఇంకనొక్కఁటియు లభించు నీకింతలో;
మంకుమనస ! దుఃఖమాత్రమునకె
యింత మిడుకనేల ? యింతట ముగిసెనే
పరులసొత్తుకాసపడిన నీకు ? ౩౮౪

(౬-౯)

ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను బనికిరానిదాన, నిజము.
కాని యందకాఁడ ! దానిఁబోలఁగలేని-
వారలెల్లఁ జావవలయునేమి ! ౩౮౫

(యశస్సింహుఁడు. ౬-౧౧)

ఆ కలిమి లేమియును సుఖంబు దుఃఖంబును
దెలిసి నడచి యిల్లు దీర్పనేర్చు-
వారె సతులు; లాఁతివారలు మగలకు
నంటియుండు ముప్పులంతె, కొడుక ! ౩౮౬

(బహుబలుఁడు ౬-౧౨)

తే. అలఁతినగవులె చీవాట్లు; హద్దుమీఱి
సలుపు నుపచారములె మదిఁగలఁచు పనులు;
కంటఁ దడిపెట్టుకొనుటయె కలహవిధము;
అరయ నిట్టిది మంచియిల్లాండ్రనడత. ౩౮౭

(కుమారిలుఁడు. ౬-౧౩)

---

(౩౮౪) ఇంకనొకటి - దశమావస్థ, మృతియనుట.

ఆ. జనవిరుద్ధమైన పనిగాన వానితో
మాటలాడకున్న మానెఁగాని;
ఎదురుపడినవాని నెట్టిశత్రువునైన
నెవరు చూడకుండ నేఁగఁ గలరు ? ౩౮౮

(మన్మథుఁడు. ౬-౧౪)

ఆ. పేదవాఁడు గూడఁ బ్రియురాలు కైవసం-
బేని ధనికునట్లె యెంచుఁ దన్ను;
ఉర్వియెల్లఁ జేతనున్నను బ్రియురాల
లేనిఁవాడు తలఁప లేనివాఁడె ! ౩౮౯

(ఈశ్వరుఁడు. ౬-౧౫)

ఆ. నొగిలి యేడ్వనేల ? వగచి క్రుళ్ళఁగ నేల ?
కన్నవారిమీఁదఁ గనలనేల ?
విషమువోలెఁ బ్రేమ విషమంబు లలితాంగి !
యెవరు దానినడ్డగింపఁగలరు ! ౩౯౦

(ఈశ్వరుఁడు.౬-౧౬)

క. ఆయూరిసొగసు, నామా-
ప్రాయము, నావయసుమగల వైభవముఁ గథా-
ప్రాయముగఁ జెప్పుకొంద్రు చె-
లీ! యందఱు; నేఁటికాలకించెదమేముణ్ ! ౩౯౧

(శాలవాహనుఁడు. ౬-౧౭)

తే. మోవి చెక్కుఁ గన్నీట మునిఁగి యదరు-
చుండ వెడనవ్వునవ్వుచు నువిద పలికె:
"ఇఁకను నీపయిఁ గోపింపనేల ? బాస
చేసి యొప్పించు గతికి వచ్చినది ప్రేమ !" ౩౯౨

(౬-౧౮)

ఆ. వన్నెనేయి పూసికొన్న నామోమును
గూడఁ దమిని ముద్దులాడుఁ దొలుత;
ఇపుడు చూడు ! నన్ను నింత సింగారించు
కొన్నఁ దాఁకుటకును గొంకు వాఁడు; ౩౯౩

(౬-౧౯)

ఆ. అవును; జగడమాడినప్పుడంతయుఁ దమ-
కములు దాల్చుఁ గ్రొత్తకమ్మఁదనము;
కాని యొక్కమాట; మానిని! పొలయల్క-
పెరిగెనేనిఁ జెఱుచుఁ బ్రేమమెల్ల. ౩౯౪

(౬-౨౧)

ఆ. వినవె ! పొల్లయలుకవేఁదుఱుగొని యకా-
రణమె కారణముగ రంపుసేసి,
మొగము చూడకుండఁ దెగనాడి, వానితోఁ
బాడుచేసికొంటిఁ బ్రణయమెల్ల. ౩౯౫

(౬-౨౨)

---

(౩౯౨) నిజమైన వలపున్నప్పుడు వట్టిమాటయే చాలును. బాసలు గీసలు అక్కర లేదు. అది లేనప్పుడే యివి. అట్టిచో 'నీకు నామీఁద ప్రేమలేదు' అని అలిగినమాత్రము ఫలమేమి ? ఉన్నవలపును లేదని వాదించుటయే ప్రణయకలహమునకు మూలరహస్యము.

(౩౯౩) 'అకాలమున రజస్వలలు గుర్తుగా మొగమునకు వన్నెవేసిన నేతిని పూసి కొనుట దేశాచారము' అని వ్యాఖ్యాత. (చూ. మూ. గాథ ౧-౨౨.) ౩౯౨ వ పద్యమునుండి ౪౨౩ వ పద్యమువఱకు పీతాంబరవ్యాఖ్య దొరకలేదు. కనుక ఆ కర్తలపేళ్ళు తెలియవు.

ఆ. వలచినట్టిచోట వలవనిచోటఁ దీ-
దీపునుడులె నుడువఁ, గోపగించు
పడఁతి యలుకదీర్ప, బహువల్లభుఁడవగు
నీదుచెంత నౌరులు నేర్వవలయు ! ౩౯౬

(౬-౨౩)

ఆ. సిగ్గు విడిచి, నడత చెడఁగొట్టుకొని, లోక-
మెల్లనపయశంబునెత్తి చాటి,
యెవనికొఱకుఁ జెలియ ! యిట్లైతి, వాఁడెనా-
పాలికన్యుఁడైనవాఁడు నేఁడు ! ౩౯౭

(౬-౨౪)

క. పలుమొగ్గలు దోఁపని నగ-
వులు, ముంగిటికడప దాఁటిపోవని గమనం-
బులు, నెమ్మొగమెత్తని చూ-
డ్కులుఁ- బద్ధతులివియ చూవె కులవధువులకున్. ౩౯౮

(౬-౨౫)

ఆ. "ఇంతపొగరుకేమి హేతువు ? నడచెద-
వడుగుమీఁదనడుగులిడుచు బంది ?"
పెదవులందు నగవు బిగఁబట్టి యది పల్కె,
"దొంగ ! యింతలోనెఱుంగుదీవె !" ౩౯౯

(౬-౨౭)

---

(౩౯౬) బహువల్లభుడు = పలువురు వల్లభలు - వలచినవారు - గలవాఁడు.

(౩౯౯) అపహరించికొని పోయెడు దొంగకుముందు నడచుచున్నదీమె. 'ఇంతలోనే నాభర్త వచ్చి నన్ను విడిపించును' అని ఆమె యుత్తరముభావము.

తే. ఎందుఁ జూచిననందెల్ల నెదుట వ్రాసి
పెట్టినట్టుల నీవు కాన్పింతువెపుడు;
ఏమి చెప్పుదు ! దిక్కులందెల్ల నంద-
కాఁడ! నీపటముల వ్రేలఁగట్టినారొ ! ౪౦౦

(౬-౩౦)

ఆ. తొలఁగి నిలుచుఁ; గొమ్మ దుల్పును; గొఱకొఱ-
మనుచు గోళ్ళబఱుకు నదిగొ కోఁతి !
తొలుతఁ గుట్టినట్టి తుమ్మెద యనుచు నే-
రేడుపండుఁ దాఁకఁనోడుఁ జూడు ! ౪౦౧

(౬-౩౧)

ఆ. ఆకుపొదరునడుమ నల్లన వ్రేలాడు
దూలగొండిగుత్తిఁ బోలెనున్న
యాఁడుకోఁతిచేతి నంటదు మగకోఁతి,
దురద దగులుననుచు వెఱచి కంటె ! ౪౦౨

(౬-౩౨)

ఆ. పొట్టిదైనఁ, జివికి పోయి యున్నను, జెంత
దొరకుచెట్టుఁ బ్రాఁకు దోసతీఁగ;
అద్ది నల్లకలువయరిదినెత్తావుల
గుప్పు పంటకారు తప్పు సూవె ! ౪౦౩

(౬-౩౪)

ఆ. పరువులెత్తుజనము, మొరయు తూర్యంబులు,
నలబలమును గలిగి యకట ! చూడు,
వాఁడొకండు లేమి నేఁడదే పండుగ
యూరు గాలుచున్న తీరు దోఁచె. ౪౦౪

(౬-౩౫)

ఆ. పనులు ముగియకుండ మునుమున్న తెరువరి
యింటిత్రోవఁ బట్టి యేఁగుచుండఁ,
గ్రొత్తవానకాలమత్త ! నవ్వుచునున్న-
మాడ్కిఁ దోఁచుఁ గొండమల్లి పువుల. ౪౦౫

(౬-౩౭)

ఆ. మీఁదికెక్కి వచ్చు మేఘంబులను జూచి,
బ్రదుకుమీఁదియాశ వదలుకొనుచుఁ
గనుల నీరు గ్రమ్మగాఁ బాంథునిల్లాలు
చిన్నికొడుకుమీఁదఁ గన్నువఱపె. ౪౦౬

(౬-౩౮)

తే. ఐదువతనంబునకు గుఱుతైన గాజు
సారెసారెకు ముంజేత జాఱుచుండఁ
బైకిఁ ద్రోయుచునుండి యాపడఁతిపాలఁ
జెలిమికత్తెలె గాజులసెట్టులైరి ! ౪౦౭

(౬-౩౯)

తే. మెండుకొని మిద్దెబంగలనుండి కురియు
వాననీళులఁ దడిసి చేడ్వడిన యింట
నానకుండిన చోటును నాన్చుఁ దెగని
బాష్పముల సోన గురియుచుఁ బాంథగృహిణి ! ౪౦౮

(౬-౪౦)

---

(౪౦౬) తాను మరణించినచో ఈశిశువుగతి యేమని యామె భయము.

(౪౦౮) బంగలు = మట్టిమిద్దెలమీఁద వానకు పడు రంధ్రములు.

ఆ. మలయమారుతంబు పొలయదు; మామిడీ
కొమ్మలందు మొగ్గ కూడుకొనదు;
కాని కలఁతగొనెడు మానసంబె వసంత-
కాలమనుచుఁ దెలుపఁ గలుగు నత్త! ౪౧౯

(౬-౪౨)

ఆ. కారణంబు లేక కడుఁ దమకంబుతోఁ
దేఁటిదండు మావితోఁటనిట్లు
మలయఁజాలదెపుడు మగువ! క్రొంబొగతీఁగ-
లగ్గిలేక యెట్టులాడఁ గలవు? ౪౨౦

(౬-౪౩)

క. దిక్కులు సూచుచుఁ బాడుచుఁ
జొక్కపడుచు నావులించుచును నిట్టూర్పుల్
గ్రక్కుచు నేడ్చుచుఁ గుంటుచుఁ
బొక్కెదు! నీకేల దారిపోకలు పథికా? ౪౨౧

(౬-౪౬)

ఆ. అత్త పడినదింట మత్తెక్కి; పతి యెందొ
పోయినాఁడు; గుక్కపోతు సచ్చె;
బ్రత్తిచేను విఱుగఁబడ మేసెనెనుబోతు;
దీనినతనికెవరు తెలుపువారు? ౪౨౨

(౬-౪౯)

---

(౪౨౦) వసంతకాలము వచ్చినది; మామిళ్లు పూచినవి; అనిభావము.

(౪౨౨) ఈమాట 'ఇంట నేనొంటిగానున్నాను, రావచ్చును' అనుధ్వనిని పొంచి వినుచున్న ఉపపతికిఁ గలిగించుటకై చెప్పినది.

ఆ. ఎండవేఁడి నవసి, కొండయేఱని నాకఁ
దొడఁగెఁ బాముమేను దున్నపోతు;
దానినోరిజొల్లు ద్రావుచు సర్పంబు-
నుండె నల్లరాతియూట యనుచు! ౪౧౩

(౬-౫౧)

తే. బైటఁ గొనిపోవె పడకింటిపంజరంబు-
లోని గోర్వంకనెక్కడికైన నత్త!
పాడుపులుగుది; రేయి మేమాడుకొన్న
చనవుమాటలనూరెల్లఁ జాటఁబెట్టు ౪౧౪

(౬-౫౨)

ఆ. 'ఇంతపెద్దయూరనెందు బిచ్చము పుట్ట'-
దనుచు దమ్మకాఁడ! యాడెదేల?
కాన్గుపొదలు విఱువఁగా నిన్ను బ్రదికిపో-
నిచ్చినారమదియె హెచ్చుగాదె! ౪౧౫

(౬-౫౩)

---

(౪౧౪) చిలుకకన్న గోరువంకకు మాటలు స్పష్టముగా వచ్చును. వచ్చిన మాటలను పదేపదే వదరుచుండుట దాని స్వభావము.

(౪౧౫) దమ్మకాఁడు = ధర్మబోధ ప్రజలకు చేయువృత్తిగల బిచ్చగాఁడు. అతఁడు పండ్లు తోముకొనుటకై కానుగుపొదలకొమ్మలను విఱుచుచున్నవాఁడు. ఈమెకు - ఈమె వంటివారికి - అది సంకేతస్థానము. ఆచోటు బయలైపోవుచున్నదని వానిపై ఈమెకీకోపము.

ఆ. నిడుదకురులు చూడు ! నీళ్ళాడి లేచిన
తఱిని గోమలాంగి పిఱుఁదులంటి,
బంధనంబువలని భయమునఁనేడ్చెడిఁ
బోలెఁ జాఱునీటిబొట్లఁ జూడ. ౪౧౬

(౬-౫౫)

ఆ. చేటగాలిపోయె; సెనగలు వేఁగవు ;
చూడకుండ మునుపె వాఁడు పోయె;
అత్తగారికింటనలుకయ్యె; - నంతయుఁ
జెవిటియెదుటఁ బట్టు సెంకులయ్యె ! ౪౧౭

(౬-౫౭)

తే. కన్నుగవ విచ్చి చూపులు కదలకుండఁ
బులకరించు చెక్కిళ్ళతో, జలకమాడు-
వేళ, నీటమునింగిన ప్రియుని కౌఁగి-
లింపునొగియింపు సతులు దెల్పెదరు కంటె ! ౪౧౮

(౬-౫౮)

తే. పగళులంతయుఁ గార్కొనఁ బఱచు వాన-
కాలమందలి క్రొత్త మేఘంబులుఱుమఁ,
గడుముదంబున నెమిళులు మెడలుసాఁచి
యాడునాటలు కనుపండువయ్యెనిపుడు. ౪౧౯

(౬-౫౯)

---

(౪౧౬) కురులు చేసినపని ధర్మద్రోహము. దానికి రాజశిక్ష బంధవము - చెఱలో పెట్టుట. స్నానము చేసిన తరువాత కురులను బంధింతురు. చేసినతప్పునకు ఆశిక్ష తప్పదుగదా యని అవి యేడ్చుచున్నట్లున్నవనుట.

(౪౧౭) కోడలు సెనగలు పప్పు చేయుటకై వేయించుచున్నది. ఇంతలో ఆమె చూడఁ గోరు గోవాఁడు వీథిలో పోవుచున్నాఁడని తెలిసినది. పని విడిచి తటాలునలేచి పోయినది. అప్పటిదీకథ.

ఆ. కొమ్ముతోడఁ జిమ్మి కొట్టఁగఁ బిసపిస
మీఁదికెగిరి, గోళ్ళమీఁటినట్టి
వీణెలట్లు, గేదెవీఁపున దోమలు
గూఁతవెట్టుఁగంటె గుంపుగట్టి ! ౪౨౦

(౬-౬౦)

తే. తుఱ్ఱుమని మీఁదికెగిరెడుఁ దొఱ్ఱనుండి
గండుఁజిల్కలవే ! శరత్కాలమందు,
జ్వరము దగిలిన మ్రాను నెత్తురును బిత్త
మొక్కమూఱుగఁ గ్రక్కుచునున్నయట్లు. ౪౨౧

(౬-౬౨)

తే. ముక్కులను వానసోనలు గ్రుక్కి కడుగఁ,
గుత్తుకలు గ్రుంగ, ఱెక్కలు కుదిసివ్రేలఁ,
గంచెకొమ్ములనుండెడు కాకులవిగో !
శూలమెక్కించి నిల్పినచొప్పు దోఁచె. ౪౨౨

(౬-౬౩)

ఆ. కోపమలవిమీఱఁ గొని నడుమంత్రపుఁ
బలుకులీవు పలుకఁ గలఁగినంత
మనసు కలఁక గొనదు మానిని ! మాటలే
యాడకుండునపుడుగూడ నాకు ! ౪౨౩

(౬-౬౪)

---

(౪౨౩) నడుమంత్రపుఁబలుకులు = రాగద్వేషములు లేక యుదాసీనముగా ఆడు మాటలు. ప్రణయప్రపంచమున అవే నిరాశను గలిగించునవి.

తే. కడిమిపూఁదావి మూర్కొని కనులనీరు
గార్చికొనియెదవేల ? యోదార్చుకొనుము;
వయసువాఁడవు, పథిక ! వెండియునునిల్లు
సేరి నీచెలిమోము దర్శింపవలదె ? ౪౨౪

(పరివరసేనుఁడు. ౧_౧౫)

ఆ. ఇనుపగుండెవాఁడనేను; నామీఁదనే
యుఱుముకొనుము సత్తువున్నయంత;
కాని, వ్రేలుకురులదాని ననాథ నా-
చెలిని జంపవలదు ! జలధరంబ ! ౪౨౫

(కలశుఁడు. ౧_౧౧)

తే. సాంధ్యరాగంబు గప్పిన చంద్రరేఖ
నెలమొదలినాఁడు కనులఁ దన్పెడిని గంటె !
వలిపచెంగావిపైఁటలోపలఁ జెలంగు
క్రొత్తమగనాలిగుబ్బగోరొత్తువోలె. ౪౨౬

(చామీకరుఁడు. ౧_౧౯)

ఆ. ఆకసంబువంక నట్లేల చూచెద
వోయి మరఁది ! నీకు నుబుసుపోక;
ఇంటఁ జూడరాదె యిల్లాలియెదమీఁద
నర్ధచంద్రరేఖలన్నియుండ ! ౪౨౭

(అర్జునుఁడు. ౧_౨౦)

---

(౪౨౭) అర్ధచంద్రరేఖలు = నఖక్షతములు. 'అవి నీవు చేయవలసినవింకెవరో చేసినారు. నీవు చూచుకోలేదు' అని భావము.

ఆ. వలపుటగ్గి పొగల వలె, లోకమును మరల్
గొలుపు నెమలియాకకుంచెవోలెఁ,
బ్రాయమునకు సిడెముపగిదినమ్మొగుద మో-
చెడిని గంటె! సురభిచికురభరము. ౪౨౮

(చారుదత్తుఁడు. ౬-౨౨)

ఆ. ఒరుల మగల నెవరి సరకు సేయక తడిఁ
దోఁగినట్టి కన్నుదోయిఁ జూచు
కలికిమొగమె చెప్పకయ చెప్ప, వర్ణింపఁ
బూననేల వేఱ వానిరూపు? ౪౨౯

(దేహలుఁడు. ౬-౨౩)

క. పెనుదామరపూవులఁ జిం
దినతేనెల సొగియుతేంట్లతెట్టువ జుంజు-
మ్మనెడు, వసంతశ్రీ నడు-
మునఁ గదలెడు నీలమణుల మొలనూలనఁగన్, ౪౩౦

(ఇంద్రరాజు. ౬-౨౪)

ఆ. చోరజనులు సారెసారెకుఁ జూతురు,
భయముఁ గోరికయును బైకొనంగ,
వీరవరునిపత్నిపీఁగుఁజన్నులఁ, బాము
గాచుకొన్న లిబ్బికడవలట్లు. ౪౩౧

(సమర్థుఁడు. ౬-౨౬)

ఆ. చూడు వింధ్యశిఖరి సొబగు! వర్షర్తుల-
క్ష్మీపయోధరములు మేనుసోఁక, -
నన్ని దెసల మొలచుచున్న లేఁబచ్చిక-
నింపుపేరఁ బులకరింపు మోచె! ౪౩౨

(ఇందీవరుఁడు. ౬-౭౭)

ఆ. అవును; దరులఁ గ్రమ్మునడవులు, రొదలిచ్చు
నీరుకోళ్ళుఁ, జల్లనీళ్ళుఁ, దక్కు--
చేఱులందునున్నవే; గాని నర్మదా
నదిని గానఁబడు గుణాలె వేఱు! ౪౩౩

(పాలితుఁడు. ౬-౭౮)

ఆ. ఇట్లు వచ్చి చూడరే మీరు! మారేడు-
పండ్లజోడుఁబోలు పడఁతిచనులు,
ఎదనణంగకుండనెదుగుచున్నవి యున్న-
తముగ, సాధుజనుల తలఁపులట్లు. ౪౩౪

(అనుత్సాహకుఁడు. ౬-౭౯)

ఆ. వానకారు రాఁగఁ బూని యొండొంటితోఁ
బేర్చి పంతగించి పెనుమొగిళ్ళు
మూసి పట్ట, నేమి మోసమో యెఱుఁగము
గాని, యాకసంబు కాఱుఁదొడఁగె! ౪౩౫

(శాలవాహనుఁడు. ౬-౮౦)

---

(౪౩౨) వర్షఋతువుయొక్క లక్ష్మి = సమృద్ధి; స్త్రీలింగసారస్యముచే ఒక స్త్రీయనియు. పయోధరములు = దాని మేఘములు, స్తనములును.

ఆ. ఎన్నినాళ్ళు సాఁగునే దిమ్మదిరుగుల
సొగియుచున్న ప్రియుని సోయగంబు,
అతివలిట్లు వలపుటాఁకలిఁ గలఁగి క్రీ
గనులు వైచి పట్టుకొనుచునుండ ? ౪౩౬

(నారాయణుఁడు. ౬-౭౧)

ఆ. ఇంటియాలు; కౌఁగిలించుకో; తొలుకోడి
గూయ బెదరి మేలుకొన్నవాఁడ !
ఇదియుఁ బొరుగువారి యిల్లనుకొని వల-
దెదవడంగ సొంతమింటఁగూడ ! ౪౩౭

(చుల్లోహుఁడు. ౬-౭౨)

ఆ. కడిఁదిగాడ్పు వచ్చి మెడఁబట్టి కొండపై-
నుండి బలిమిఁ ద్రోయ నొడలు చిదిగి
చెడిన కారుమొగిలు జీవంబువలె నూఁగు-
లాడు గుటుకుగుటుకుమనుచు మెఱుపు ! ౪౩౮

(జీవదేవుఁడు. ౬-౭౩)

తే. ఇంద్రచాపంపుఁ గొడుపుతోనెత్తి పొడువ
నొప్పినోర్వక బిట్టుగ రొప్పుచుండు
మొగిలనెడు కాఱుదున్న కడుపునను వెడలి
వ్రేలుచుండెడు ప్రేఁగు గాఁబోలు మెఱుపు ! ౪౩౯

(భెజ్జా. ౬-౭౪)

క. గోమునఁ బొడమిన తొలుతటి
మామిడిచివురాకు, కుంకుమనసులఁ బథిక-
స్తోమము, నెత్తుటఁదోఁగిన
కామునిచెయిబాకుఁజోలెఁ, గాంచెదరడవిఁ. ౪౪౦

(౬-౭౫)

క. పొగరెక్కి దేశదేశము
మగవారలు దిరుగుతప్పు మగువలదే; మె-
ల్లఁగనొకరిద్దఱి బ్రదుకులు
ముగియువఱకు నీవియోగములు తెగవు భువిన్ ! ౪౪౧

(శేఖరుఁడు. ౬-౮౬)

ఆ. తామసంబు చేసెదవె ! చావనున్నదా-
పిచ్చిపిల్ల యిపుడు; పిన్నవాఁడ !
బ్రదుకఁగలుగు నిన్ను నది చూచినను జాలు;
సందియంబు వలదు; సరగఁ బొమ్ము ! ౪౪౨

(ముగ్ధహరిణుఁడు. ౬-౮౭)

ఆ. కాఱుచిచ్చునాలుకల యెఱ్ఱవన్నియల్
గ్రమ్మియున్న కాననమ్ము వదలి
పోదు ముగుదలేడి, పూచినమోదుగు-
మ్రాఁకులనుచు నకట ! మదిని నమ్మి. ౪౪౩

(సారుఁడు. ౬-౮౮)

ఆ. గోరువంక పెద్దవారిముందరఁ బడ-
కింటి మాదుసుద్దులెల్లనపుడు
చదువ మొదలుపెట్టుసరికి మాయమ్మ ! యెం-
దేఁగి చొచ్చుటకును నెఱుఁగనైతి ! ౪౪౪

(సారుఁడు ౬-౮౯)

ఆ. అత్త ! మొల్లతీవయందదియేమియో
కలదు గొప్పగుణము; తెలియలేము
గాని; తేఁటిదండు కన్నులతోడనే
దానిఁ ద్రాఁగివేయఁ దలఁచుచుండు ! ౪౪౫

(కుమారుఁడు ౬-౯౧)

క. రూపన్న రెడ్డికూఁతురి
రూపేయగుఁ గాని యొరులరూపును రూపే!
ఆపల్లెవారు వేలుపు-
లై పోయిరి దాని తెప్పలార్పక కనుచున్! ౪౪౬

(అనంగుఁడు. ౬-౯-౨)

ఆ అంబురాశిఁ ద్రచ్చి యన్నికష్టములతో
నమృతరసముఁ దేల్చిరమరులేల?
తమకు మిగులఁ గూర్చు తరుణులకెమ్మోవి-
రుచియె వారెఱుంగరో తలంప! ౪౪౭

(అనంగుఁడు. ౬-౯-౩)

ఆ. చేతికొలఁది నీడిచిన వాఁడియమ్ముచే-
నాయమందు గాయమైన లేడి,
'ఇదియె కూర్మియిట్టి తుదిచూప' టంచును
దడవు సూచె దానితట్టు దిరిగి. ౪౪౮

(పోటిసుఁడు. ౬-౯-౪)

ఆ. ఎక్కరానిచోట నొక్కమామిడిపండు
వ్రేలుచుండఁ జూచి బిడ్డఁడేడ్వ,
నీదు శత్రుగృహిణి నిలిచి వేఁడినది యా-
దారి వచ్చిపోవువారినెల్ల! ౪౪౯

(భీమస్వామి. ౬-౯-౫)

---

(౪౪౯) ఇదెవఁడో దొరను గూర్చిన వందిస్తుతి. 'నీవు శత్రువును జంపఁగా వాని భార్య చిన్నబిడ్డనితోఁగూడి తప్పించుకొని పాఱిపోయి అడవులపాలై గతిలేకయున్నది' అని భావము. ఆఁడువారియీగోడు అకాలపు వీరుల పౌరుషమునకు గుర్తుగా వర్ణించుట వాడుక!

ఆ. పూవులమ్మపొలఁతి భుజమూలసౌందర్య-
దర్శనంబుచేతఁ దనివిసనక
తరుణవిటుఁడు చుట్టుఁదిరుగుచున్నాఁడు
చూడు ! వట్టిబేరమాడుకొనుచు. ౪౫౦

(శాలవాహనుఁడు ౬-౯౮)

ఆ. ఒకటినొకటి ప్రోచుటకు వింటికెదురుగాఁ
జొచ్చుచుండు జింకజోడు సూచి,
మనసు గలఁగి, బాష్పమునఁ దోఁగుపెనువిల్లు
వేఁటకాఁడు జాఱవిడిచెనపుడు ! ౪౫౧

(చుల్లోహుఁడు. ౭-౧)

ఆ. ఎమ్మెకాఁడ ! నిలుమొకింత; నీకొక్క తె-
సుద్ది చెప్పవలయు;—వద్దులెమ్ము -
లేకయున్న ! తెలివిలేని పోకలఁబోవు
చపలచిత్త యదియె చావనిమ్ము ! ౪౫౨

(చుల్లోహుఁడు. ౭-౨)

ఆ. ఊరిబేరిసాని యొసఁగిన వాయనా-
లారగించి మరగినట్టి కాఁపు-
బిడ్డఁడొరులు దెచ్చిపెట్టిన వాయనా-
లిపుడిసీయటంచు నీసడించు ! ౪౫౩

(చుల్లోహుఁడు. ౭-౩)

ఆ. పొడుచు సూర్యకిరణములు సొచ్చి రేకులు
చీలి యుబ్బు తమ్మిపూల సోయ-
గంబు, రాత్రిగడవ, గమగమలాడఁగఁ
దొడఁగె లోకమెల్ల దోఁపుగొనుచు ! ౪౫౪

(దుర్లభరాజు. ౭-౪)

ఆ. అడ్డులేని నవ్వులాటకుఁ దిరుగులా-
టలకునెల్ల నీరు తొలుత విడిచి,
వెనుకఁ గోడలు చెడిమునుఁగు సంసారంపుఁ
బెద్దబరువు మీఁదఁబెట్టుకొనియె. ౪౫౫

(శాలవాహనుఁడు. ౭-౬)

తే. వానిచెంతకుఁ బోదువుగాని, యాత్ర-
మేల చెలి ! చందమామ పైకెక్కనిమ్ము;
పాలఁ గలిసిన నీరును బోలె, నెవఁడు
నీమొగము గుర్తుపట్టు వెన్నెలలలోన ? ౪౫౬

(మహిషాసురుఁడు. ౭-౭)

తే. గోధనంబులు విడిచిన గొల్లదొడ్డి-
కరణి, ద్రవ్యంబులేని మందిరముపగిది,
వట్టిపోయిన సెలయేటివాయి వోలె,
రమణిమొగమయ్యె నీవిరహమున నిపుడు. ౪౫౭

(పాలితుఁడు. ౭-౯)

ఆ. సిగ్గులాఁడికేమి చెప్పుదు ! నిను నాఁడు
గన్నయపుడు పుట్టియున్న వలపు
మనసునందె నిలిచి మాసిపోయెడిని బై-
కొనక, పేదవారికోర్కివోలె. ౪౫౮

(చంద్రోహుఁడు. ౭-౧౦)

ఆ. 'పుడమి నెవతె చిక్కిపోయిన నదియెల్ల
నీదుకొఅకె యనుచు నియమమేమి ?
నగుచు నడిగెదిట్లు ! నామేను వేసవి
నిట్లె' యనుచుఁ బలికి యేడ్చెనింతి. ౪౫౯

(భీమస్వామి. ౭-౧౧)

తే. చెలియ! వర్ణక్రమంబులు చెడినఁగాని
యుత్తమగుణంబు గలదొండు చిత్తరువున;
ఒండొరులకౌఁగిలికిఁ జిక్కియున్న ప్రియులు
నిముసమేనియు వదలకుండెదరు దాన. ౪౬౦

(భీమస్వామి. ౭-౧౨)

తే. నీ మదికి నింపుగానివన్నియును జేత-
నైనయందాఁక జేయక మానఁగలను;
నేనె నీకింపుగాకుంటి నేని చెప్ప-
మదియు నాచేతనున్నదే? యందకాఁడ! ౪౬౧

(మేఘచంద్రుఁడు. ౭-౧౫)

ఆ. అవయవముల పనుల నన్నిటినీపాదు-
సిగ్గు చెల్లకుండఁ జేయుఁగాని;
చెవులు వినక యడ్డునేయఁజాలదు చెలి!
చూడు పెద్దలున్నచోటఁ గూడ! ౪౬౨

(వాక్పతిరాజు. ౭-౧౬)

ఆ. ఇట్టి యొంటి దిరుగ నేఁగుచో లేడి పే-
రాస దానిఁ జూచినట్టి చూపె,
మగువమీఁద మిగుల మక్కువ గల చెంచు-
తేని చేతివిల్లు క్రింద జార్చె. ౪౬౩

(వాక్పతిరాజు. ౭-౧౮)

---

(౪౬౦) వర్ణక్రమము = కులనియమము; వన్నెల యేర్పాటు. సామాన్యదాంపత్యమునకు కులనియమము గలదు. చిత్తరువునకు అది - వన్నెలనియమము - లేదు. ఇష్టము వచ్చిన వన్నెలలో చిత్రించవచ్చును.

క. తిరిగెదు తామర, నలఁచెదు
గురివిందను, మరియు జాజిఁగూడ వదలవ-
ద్దిర! నీ తరళగతులఁ బా
దిరి యొక్కటి తీర్పగలదు తీర్చినఁ, దేఁటీ! ౪౬౪

(౭-౧౯)

ఆ. చూఱునుండి వాననీరు గాఱఁగఁ దల
యడ్డుపెట్టి కొడుకు నాదుకొనెడుఁ
గాని, పాంథగృహిణి, కన్నీటవానిని
దానె తడుపుచుంట గానదకట! ౪౬౫

(శాలవాహనుఁడు. ౭-౨౧)

తే. పండుగకు దంచుచుండిన పిండి యెగిరి
తెల్లఁబాఱిన చనుదోయి తెఱవకదిగొ
మోముతెలిదమ్మిచాటున గోముదేరు
కలికి రాయంచకవవోలెఁ గానవచ్చు. ౪౬౬

(రోహా. ౭-౨౪)

ఆ. తెలివి చాలకుండఁ దెగరాచి రత్నశో-
ధకులు ఱాత, నిన్ను దార్చినారు
కొనకు నూవుగింజకొలఁదికి; నిఁక నీకు
మరకతంబ! విలువమాట యేది? ౪౬౭

(౭-౨౭)

ఆ. ఇంకనెవరినైన నీచెంచుమగవారిఁ
జేరి యడిగి చూడు జింకతోళ్ళు;
ఓయి దారికాఁడ! మాయింటి మగఁడు విల్
వంపఁ డెపుడు జింకపదువు మీఁద. ౪౬౮

(శాలవాహనుఁడు. ౭-౨౯)

తే. నాకొడుకు తొల్లి యొక్కబాణమునఁ జావఁ
గొట్టఁగలవాఁడు దొరయేనుఁగులను గూడ;
అంపమోపులఁ గొనిపోవునదిగో! యిపుడు
చూడుమడవికి ! కోడలిచూపుమహిమ ! ౪౧౯

(వోహా. ౭-౩౦)

ఆ. వింధ్యగిరికి వలస వెడలెడు సుద్ది యీ-
పల్లెలోన నెత్తవలదు; రెడ్డి-
కూపిరాడుచున్న; దొకవేళ బ్రదికి యీ
మాట వినినఁ జచ్చుమాట నిజము ! ౪౨౦

(౭-౩౧)

ఆ. బుద్ధిసెప్పె రెడ్డి పుత్రునిఁ బిల్చి, ప్రా-
ణములు వదలువేళ, 'నాదుపేరు
సెప్పుకొనుచు సిగ్గుచేటుగాఁ బల్లెలోఁ
బందబ్రతుకు బ్రతుకవలద' టంచు. ౪౨౧

(౭-౩౨)

ఆ. తేనెటీఁగకాటుచే నాథుపెదవి వా-
చినది చూచినంతఁ జెంచుగరిత
ఈసుముదిరి, పల్కరించినఁ బలుకక
యొండుమ్రాని నీడయందకరిగె ! ౪౨౨

(౭-౩౪)

---

(౪౨౦) ఈగాథమొదలుగా కర్తలపేర్లు ప్రాచీనటీకలలో దొరకలేదని పీతాంబరటీక. (పు. ౬౬; గాథ ౬౩౬).

ఆ. కొదుకువలదు ప్రణయగోష్ఠుల; నాకుజొం-
పాలు కంచెలెల్ల; గాలి వంగి
యూఁగు వెదురుపొదలు నుండును; ధన్యులు
కొండపల్లెలందునుండువారు. ౪౨౩

(౭-౩౫)

తే. జలజలన పాఱు సెలయేళ్ళచప్పుడులను,
గడిగినట్లున్న బండలఁ, గడిమిపూల-
నిండుతావులఁ, జెలఁగాడు నెమలిగములఁ-
గొండపల్లెలు మనసునాఁకొలుపు మిగుల. ౪౨౪

(౭-౩౬)

ఆ. చేపినపుడు మున్ను చేయైనఁ దడిగాదు;
గోవు నేఁడు చూడు ! గొల్లవాఁడు
మేపి బుజ్జగించు మెలఁకువచేఁ బాలు
కడవకొలఁదిఁ బితుకఁగలిగె నౌర ! ౪౨౫

(౭-౩౭)

ఆ. మూరుకొనును, దాఁకు, ముద్దాడు, నెదపయి
నిలిపికొనును మేనఁ బులకలెగయఁ,-
దనకుఁ గూర్చు మగువ నునుజెక్కిలినిబోలు-
నిప్పపూవు, దారినేఁగువాఁడు. ౪౨౬

(౭-౩౯)

ఆ. కొండదరిని దగులుకొనియున్న పెనుబాము-
పొరనుజేరి యదిగొ ! కఱకుటెండఁ
జిక్కినడవియేన్గు, సెలయేటినీరంచుఁ
దలఁచి తలను రిత్త తడుపఁజూచు ! ౪౨౭

(౭-౪౦)

తే. వెలఁగపండ్లసుగంధము వలచి పాఱి
పోయెదవు తేఁటి ! తామరపూవు వదలి;
చిత్తరువులోని లడ్డునాశించు పామ-
రునిపగిదిఁ, దాఁకినప్పుడెఱుంగఁగలవు. ౪౭౮

(౭-౪౧)

ఆ. జరుగనున్న పెండ్లిచవికెలో శుభగీత-
ములను బాడుచుండఁ జెలియ ! వినుచు
నిన్ను జూచి నవ్వుచున్నట్లుదోఁచె నా
ప్రాయమైన మగలుఁ, బ్రబ్బపొదలు ! ౪౭౯

(౭-౪౩)

తే. చవితిపండుగ గడచిన నవ వియోగ
బాధలఁ దలంచి, గట్టిగాఁ బట్టుకొన్న
యావధూవరులిద్దఱి హస్తయుగము
చెమటకన్నీళ్ళు నించి యేడ్చెడిని బోలె ! ౪౮౦

(౭-౪౪)

క. ఆయెడనె పుట్టునెప్పుడు-
నాయెడనే సాఁగు, సుద్దులందే ముగియున్;
ఓయత్త ! యొక్కఁడేనా
ప్రాయపుమగఁడింత పెద్దపల్లెకునెల్లన్ ! ౪౮౧

(౭-౪౮)

---

(౪౮౦) చవితిపండుగ పెండ్లినాల్గవనాఁటిది. శుక్లకృష్ణపక్షాల చవితిగాదు. దానివి ముగించుకొని అల్లుఁడు తనయింటికి వెళ్ళుట లోకవ్యవహారమని వ్యాఖ్యాత.

క. ఏమాటలు మేమాడుదు-
మామాటలె యూరివారునాడుదు; రవియే
కోమలి! యాతండాడిన
నేమో సౌఖ్యంబు మదికినిచ్చుచునుండుఁ! ౪౮౨

(౭-౪౯)

ఆ. వలచినట్టివారిచెలిమి సాధింపఁడె-
ట్లయిన, సుఖమునందునాసయేని;
యెవరిమదికినెది రుచించు వారికి దాన
లేదు సుఖముగానిదేదిగాని, ౪౮౩

(౭-౫౦)

ఆ. చూచుచుంటిమేని చూపులఁ దన్పును;
దలఁచుకొన్నయపుడు దనుపు మనసు;
చేరి మాటలాడఁ జెవులఁ దన్పును; నిత్య-
రమ్యమూర్తి యత్త! ప్రణయిజనము. ౪౮౪

(౭-౫౧)

తే. హృదయఫలకముమీఁద నేమేమి చిత్ర
మాసలనియెడి కుంచెల వ్రాసికొనునొ,
నవ్వుచును విధి దానినంతయును బట్టి
తుడిచి వైచుచునుండు, బాలుఁడునుబోలె! ౪౮౫

(౭-౫౬)

ఆ. దవ్వు గడచి చనిన దయితుఁగానక చూడ్కి-
పట్టి త్రిప్పుకొంటినెట్టకేని;
కాని పాడుమనసు వానివెన్నంటి మ-
ల్లాడుచున్నదిపుడునడ్డులేక! ౪౮౬

(౭-౫౮)

తే. వానిమాటెత్తఁ బులకలు వాఱెమేన;
కాలిసవ్వడి విన్నంతఁ గరఁగెనలుక;
మొగము గన్నంత వడఁకెదు; ముగుద! వాఁడు
కౌఁగిలించిన నేమికాఁగలవొ యింక! ౪౮౭

(౭-౫౯)

ఆ. వాలి, బరువుచేత వంగు గూఁడులకొమ్మ-
కొనలఁ గాళ్ళు కుదురుకొనక జాఱి,
ప్రాఁకుతుదల నిలుచు మరలరెక్కల విది-
లించికొనుచుఁ బులుఁగులెట్టకేని. ౪౮౮

(౭-౬౦)

ఆ. తిండినీరుఁ బెట్టి దండిగఁ గుక్కనా-
చెడిపె యెంతచనవుచేసికొన్న-
దొరచూడు! మిండఁడరుదేరనెదురేఁగు;
నింటిమగఁడు వచ్చెనేని మొఱుఁగు! ౪౮౯

(౭-౬౧)

ఆ. ఉన్నదున్నయట్లె యూరియందఱిముందు
చెక్కి పెద్దవిల్లు చిన్నఁజేయు
కొడుకుఁ జూచి, మగఁడు మడిసినప్పటికన్న
మించుగాఁగనేడ్చెఁ జెంచుతల్లి! ౪౯౦

(౭-౬౩)

తే. ఏమి యెఱుఁగనివారము మేము; ప్రియుఁడు
పలుదెఱంగుల తళ్కుబెళ్కులను వలచు;
వేఱుగతి యేమిలే; దింక వెల్లివాఱు
కంటినీరెట్లు నిల్పుకోఁగలము చెలియ! ౪౯౧

(౭-౬౪)

తే. చిలుక, ముక్కునఁ బొడువఁగఁ జిట్లి మేన
నిండియుండిన మామిడిపండురసము-
తోడఁ బఱవఁగఁ, దేంట్లును గూడి పాఱెఁ
దావిచేఁ గన్నుగానక దానివెంట. ౪౯-౨

(౭-౬౬)

ఆ. ఇచట నేఁబరుందు; నిచ్చటనత్తగా-
రిచటఁ బరిజనంబులెల్ల; వినుము;
రాత్రి నీకుఁగానరాదు; నాపడుకపైఁ
దప్పిపడెదవేమొ! దారికాఁడ! ౪౯-౩

(౭-౬౭)

ఆ. ఎట్లు మేనువెంచెనిదియొక్కటే, తల
యెత్తిచూడు, మఱ్ఱివిత్తుమొలక!
ఇంత పెద్దయడవి నితరవృక్షంబుల-
న్నియును దీనినీడ నిలువవలనె! ౪౯-౪

(౭-౭౦)

ఆ. ఎవరు సుగుణశాలులెవ్వరుదారులు
తెలివి మాఁగినట్టి దిట్టలెవ్వ-
రట్టివారినెల్లనరసి ప్రేమించెదు
పేదఱికమ! నీదు పెరిమయెంత! ౪౯-౫

(౭-౭౧)

---

(౪౯-౩) పదుమని ధ్వని.

ఆ. ఎందు గుంటమిట్టలేకమై, రాకలు
పోకలెల్ల నిలిచిపోయి చాల,
నింతలోన దారులెల్లను గోర్కుల-
కైన దాఁటరానివగును జూవె! ౪౯౬

(౨-౨౩)

క. ఊరకె యలుగుట, యప్పుడె
యూరడిలుట, టక్కులాడుచుందువని కడుఁ
దూరుట, యీసుమెయిం బలు-
మాఱేడ్చుట-యెల్లఁ బ్రేమమార్గము కొడుకా! ౪౯౭

(౨-౨౪)

ఆ. రెండుచెవులఁ గ్రోలుచుండుఁ జిన్నది నీదు-
పలుకులెల్ల, జనుల కలకలమునఁ
గలిసి యున్నఁగాని, కడఁకమై రాయంచ
పాలు నీరువదలి క్రోలునట్లు. ౪౯౮

(౨-౨౬)

ఆ. ముగుద! ప్రియునిచరితములనిట్టులడిగెదు
క్రుచ్చిక్రుచ్చి, సిగ్గుగూడ లేక;
మరువమునకుఁ దావిమైయెల్ల నెలకొని
యుండఁ బువులులేకయున్ననేమి? ౪౯౯

(౨-౨౨)

---

(౪౯౬) రాఁబోవు వర్షాకాలపు వర్ణనమిది.

ఆ. కావివన్నెయెల్లఁ గడచెనించుకయైన
లేక; ముగుద ! నమ్మలేవుగాని;
లేఁత చివురుటాకులీలఁ గెంపైన నీ-
కరములేల మరల మరలఁ గడుగ ? ౫౦౦

(౭-౭౮)

ఆ. కాంత ! చూడు; పంటకారున నీరెల్ల
ముగియఁ గురిసియుండు మొగిలుగములు
దోఁచె, నేకినట్టి దూదికుప్పలువోలెఁ,
గూడుకొన్న యుప్పుగుట్టలట్లు, ౫౦౧

(౭-౭౯)

ఆ. కనులు చెమ్మగిల్లఁ గడునందముగఁ దోఁచె
మొగము; తుడుచుకొనవె మొదలు బిడ్డ !
యీ మొగంబుసొగసునే వాఁడు వలచుచు
వెండి యిట్లు చేయకుండుఁగాక ! ౫౦౨

(౭-౮౧)

ఆ. నడుమఁ బలుచనగుచు నడకచేఁ బంకంబు
రెండుప్రక్కలందు నిండియుండఁ,
బొలిచె రచ్చ, యూరితలమీఁదఁ బాపట
తీసిపెట్టినట్టి తెలుఁగు దోఁప. ౫౦౩

(౭-౮౨)

తే. ఇంటికపరాహ్ణవేళలో నేఁగుదెంచి-
నట్టియల్లునికోర్కె రెండంతలయ్యెఁ,
బెరటిజలదారి దిగియున్న పెండ్లికూఁతు-
జలకమును దెల్పుగాజుల గలగలలకు. ౫౦౪

(౭-౮౩)

ఆ. ఇచ్చకములఁ జేతురెన్నేని; తమపని
దీరినంత మరలఁ దిరిగి కనరు;
వినుఁడు కూళజనులు వీరు; కుక్కలవంటి-
వారు; వీరి నమ్మవలదు మీరు! ౫౦౫

(౭-౮౬)

ఆ. ఘోరుగుపల్లెకేఁగుతఱిఁ బోతుకుక్కల-
గుంపునిల్లె యీడ్చికొనుచు వెంట,
నాదు కుక్కపెంటి నడచి, నూతేండ్లు సో-
యగము చెడక పుడమి నెగడుఁగాక! ౫౦౬

(౭-౮౭)

ఆ. పైరు కోర్కిమీఱిపండ శారదవేళఁ
బాడునిచ్చకొలఁదిఁ బల్లెరైతు,
చక్కదంచినట్టి సన్నబియ్యముఁ బోలు
వన్నెగలుగు నిండువెన్నెలలను. ౫౦౭

(౭-౮౯)

ఆ. చేను దున్ను క్రొత్త సేద్యగాఁడదె చూడు!
కూడుదెచ్చిపెట్టు చేడెఁ జూచి,
కాఁడియెడ్ల పలుపుద్రాడు సడల్పంగఁ
బోయి విచ్చినాఁడు ముక్కుద్రాడు! ౫౦౮

(౭-౯౨)

ఆ. మనుజలోకమందుఁ గనులును జెవులును
లేనివారిబ్రదుకు లెస్సచూవె!
తులువలైనవారికలిమి పెంపొందుట
గనరు; వినరు కొండెగాండ్రపలుకు. ౫౦౯

(౭-౯౫)

తే. ఎచటనుండిరొ మూగలై యెల్లవారు
నాఁడు? వలదని కసరుచున్నారు నేఁడు,
విసముపోలిక నోర్వఁగ వసముగాక
యెల్లయొడలికి వలపుకై పెక్కుయుండ! ౫౧౦

(సిరిసుందరుఁడు. ౭-౯౬)

ఆ. ఇదియు నీకుఁ దెలియదే! నినుఁ జూచెడు
గాటమైనతమిని బీటమీఁదఁ
బీటగాఁగ నటుక పేర్చి యెక్కఁగఁబోయి
పడఁతి నాఁడు జాఱిపడినమాట. ౫౧౧

(సే(మే?) హణాయుఁడు. ౭-౯౭)

క. కనుగొలుకుల సందులఁ జొ-
న్పిన యొండొరు చూడ్కి మేళవింపఁగ, జగడిం
చిన యిరువురు నొకమాఱుగ
ననుపారఁగ బెద్దనవ్వు నవ్విరి కంటే! ౫౧౨

(౭-౯౯)

తే. సంధ్య వార్పఁగ దోసిట జలము వట్టి-
నపుడు గౌరీముఖాంబుజమందుఁ దోఁప,
మంత్రమంతయు నొకమాఱు మఱచి, వట్టి
మోవిని గదల్చు శివునకు మ్రొక్కులిడుఁడు! ౫౧౩

(౭-౧౦౦)

---

(౫౧౦) ౭-౯౬ వ గాథ మొదలు ఐదింటికి గంగాధరునిటీక లభింపకపోవుటచే 'కావ్యమాల' సంపాదకులు కులబాలదేవునిటీకనుండి వానినెత్తిచేర్చి సప్తశతిని పూరించి నాఁరట. ఈ గాథల కవినామములందులోనివఁట.

(౫౧౩) సప్తశతి నాందిపద్యము హాలునిదిగా పరిగణింపఁబడినది గనుక ఈ మంగళాంతగాథగూడ నతనిదే యని యూహింపవచ్చును.

శ్రీ

శాలివాహన

# గాథాసప్తశతీసారము

## 2 వ భాగము

ఆ. పల్లెఁ బుట్టినాను ! పల్లెలో నున్నాను;
నిజము; పట్టణాల నేర్పెఱుఁగ;
పట్టణాలవారి పతులు నాపాలు ! నే-
నెట్టిదాననైతి నేమి ! పోవె ! ౧

(౭౦౫)

ఆ. ఏడ్చుకొంటకె పుట్టెనీపాడుకన్నులు;
తుడువవలదు వీనిఁ ! దొలఁగిపోర !
నిన్ను జూచినంతనే యివి కైపెక్కి-
కానవయ్యె నీదు కటికమనసు. ౨

(౭౦౬)

---

ఈభాగమందలి గాథలు వీబరుపండితుఁడు సంగ్రహించి ప్రకటించిన ప్రతిలో, వేఱు వేఱు వ్యాఖ్యాతలు పరిగ్రహించిన మూలములోనివని తెల్పినవానిలోఁ గొన్ని. కుండలించిన సంఖ్య ఆతని ప్రతిలోనిపద్యాలది.

(౧) నాగరకస్త్రీయొకతె పల్లెటూరిదని మఱియొకస్త్రీని ఉదాసీనముగా నన్నది. ఆమాట కాపల్లెదాని తుంటరి ప్రత్యుత్తరమిది.

ఆ. విరహపీడ నవసి వేఁగు పెండ్లముమీఁది
కనికరమున మనసు కళవళింప,
దాఁటిపోయె వాఁడు తనయిల్లుగూడఁ గా-
నంగలేక యూరినడిమినుండి ! ౩

(౨౦౨)

తే. కడిమి పూఁదావితెమ్మెరలడువ సొమ్మ-
సిలి వినదు గాని యదియును నేమమయ్యెఁ;
గాకయుండిన నీతొలుకార్మొగిళ్ళ-
యుఱుములూరకపోవునే యుసురుగొనక ! ౪

(౨౧౧)

తే. వయసుమగవారు పలువురుండియును దిక్కు-
మాలినట్టులె యీపల్లె గాలి పోయె;
చెలియ ! సందడిలోఁ బైఁట తొలఁగి యాడు
నీదుగుబ్బచన్దోయిది గాదె తప్పు ! ౫

(౨౧౪)

---

(౩) ప్రవాసమునుండి తొందఱగా ఇల్లు చేరవచ్చుచున్నవాఁడితఁడు.

(౪) విరహిణులకు దుస్సహమైన వర్షాకాలపు తొలుతటియుఱుములు వినకముందే కడిమిపూవుల పరిమళమునకే ఆమె మూర్ఛిల్లినది. కనుక ఆమూర్ఛ క్షేమమునకే వచ్చినదని, అదిరాకుండెనేని ఉఱుముసద్దు విన్నతరువాత ఆమె జీవించియుండదని - మధ్యస్థురాలి మాటయిది.

(౫) నిన్ను జూచుచు నిలఁబడినవారే తప్ప అగ్గిచల్లార్చుపనికి చేయివేసిన ప్రాయపు మగవారు అప్పుడక్కడ లేరైరి. కనుక ఊరిని అగ్గి నిరర్గళముగా కాల్చివేసినది.

ఆ. చూచినపుడు మరలి చూడదు; మఱి పల్క-
రింపదతని సరళరీతి గలిగి;
ఉవిద చేయదింత యుపచారమైన;- జా-
ణలకు దానిమనసు తెలిసె దాన ! ౬

(౭౨౦)

ఆ. తనువునిండ మెండుకొను గగుర్పాటుతో,
వడఁకుతోడ, నూర్పువగల తోడ,
వలపుతగులమందుఁ గలిసినయట్లె తోఁ-
చెదరు దారికాండ్రు, సీతునందు. ౭

(౭౨౧)

తే. చెమటఁదోఁగిన పిఱుఁదులఁ జిక్కనంటు-
కొన్న వలిపెంపుఁద్రోవ గన్గొనఁగ లేక,
పుడుకులాడుచు రిత్తయ తడవుచుండు-
వానిచెయిసూచి చెలి ! నవ్వు వచ్చెనాకు. ౮

(౭౨౩)

ఆ. ప్రణయదూతి చెప్పు పల్కులు వినువేళ-
నడ్డుదగులరాదటంచుఁ బోలె,
తరుణిచెవులనుండి తటుకుననెగమీఁటె
గగురుపాటు నల్లకల్వవిరిని. ౯

(౭౨౪)

---

(౬) అట్లు చూచి, పల్కరించి, యుపచరించినచో అతనిమీఁద తనకుఁగల్గిన యనురాగము నితరులు కనుగొందురను భయమున ఆమె అట్లు చేయలేదు. కాని ఆ యుదాసీనము తెచ్చుకొన్నదేగాని సహజముగాదని తెలిసికొనఁ గల్గు జాణలవద్ద ఈగుట్టు దాఁగలేదని భావము.

ఆ. ఇచ్చకాలు పల్కి మెచ్చించునట్టిదీ-
జాతి; నమ్మియుండఁ జనదు దీనిఁ;
గొడుక ! తమ్మెయంత వెడలుపుగాఁ జెవిఁ
బొడుచుకొనఁగ నెవరుఁ బోరు చూడు ! ౧౦

(౨౨౮)

ఆ. మొగిళుఱుమఁ దొడఁగె; నిగనిగఁ బచ్చిక
దారులన్ని గప్పె; నేఱులెల్లఁ
బఱవఁజొచ్చె; మగనితెరువుకై యెదురు ని-
ల్చెదవె యిఁకను గవుడులేనిదాన ! ౧౧

(౨౨౯)

ఆ. కమలములను బట్టి కమలించునపుడు హే-
మంతఋతువు వేఁడి మనకుఁ దెలియు;
నడతచేత నెఱుకపడుఁగాదె లోకుల-
తత్వమెంత వారు దాఁచుకొన్న ! ౧౨

(౨౩౦)

తే. పాలకుండలు దెచ్చిన పడఁతితోడ
సుద్దులకు గొల్లవాఁడు కూర్చొనఁగ, వాని-
క్రొత్తపెండ్లాము చూడు ! తల్గులు సడల్చి
నిండురోసాన దూడలన్నిటిని విడిచె ! ౧౩

(౨౩౧)

---

(౧౦) వేశ్యలనుద్దేశించిన యుపదేశమిది. తమ్మెకాఁడ కెంతవలయునో అంతేకాని చెవితమ్మెయంతపెద్దగా చెవిఁ బొడుచుకొననట్లే, వేశ్యలందలి నమ్మకముగూడ ప్రయోజనపు మేర దాఁటనీయరాదని భావము.

(౧౧) 'నీభర్త రాఁగలకాలము మీఱినది. నీకు తెలివిచాలదు. ఈవర్షాసమయమున నీత్రోవ నీవు వేఱుగా చూచుకొ'మ్మని కుట్టినియుపదేశమిది.

(౧౨) హేమంతము చలికాలముగాదు - వేఁడికాలము, విరహులకు. ఆకాలమున కమలములు కమలిపోవుటయే దానికి సాక్షి. బయటికెట్లున్ననేమి - అనిభావము.

తే. అగ్గి ప్రొయినూఁది యది బగ్గుమన్నయంత
వెనుకకొరగెదవేఁటికే వెఱ్ఱిపడుచ!
చన్నుగడవలపైఁ దోఁచు చాయలింతె
కాని, మంటలు నిన్నుఁదాఁకవు నిజంబు! ౧౪

(౨౩౨)

క. నునుజెక్కుటద్దములనం-
టిన మంటలనీడలిపుడు నీదుచెవుల ప్రే-
లినలేఁజివురాకులతీ-
రున నందములయ్యె బిడ్డ! ప్రొయినూఁదునెడన్. ౧౫

(౨౩౩)

ఆ. ఎట్లు ముగియుఁ జెప్పవే పొగచీఁకట్లఁ
గొమ్మ! నీవు ప్రొయి రగుల్చు గొడవ!
మోముఁదమ్మిఁ బట్టి ముద్దాడునేఁకట
నీదుమఱఁది ప్రక్కనిల్చియుండ. ౧౬

(౨౩౪)

ఆ. ఎఱ్ఱఁబాఱు కనులు నెగఁబోఁతకసియాడు-
వీఁగుఁజన్నుఁగవయు, వెడలు బాష్ప-
ములును గలిగి, నీవు ప్రొయ్యూఁదుపని యిట్లె
మగువ! సాఁగుఁగాక ముగియకుండ! ౧౭

(౨౩౫)

---

(౧౪) ఆమె దేహలావణ్యమంత నిద్దమైనది. కాని అది తెలియదాముగ్ధకు. దీని తరువాతి రెండుపద్యములందును ఇట్లే.

తే. విందుచుట్టమటంచు మీరందఱిఁకను
దానిఁ బేర్కొందురేల ? నామేను మంద !
ఇపుడు మావారిపెద్దఱికపుగుణంబు-
మహిమ నింటికదే యజమానురాలు ! ౧౮

(౭౩౬)

ఆ. అన్నికళలు ముగిసినంతట మిత్రుని-
మండలంబుఁ జందమామ సొచ్చు;
చొచ్చినట్లె మరలి వచ్చు; వైభవహీను-
నెవరు జగతి లేవనెత్తువారు ! ౧౯

(౭౩౮)

తే. నీకు వయసేమొ చిన్నది నిజము; కాని
దిసమొలను బిడ్డ ! వీథిలోఁ దిరుగవలదు;
నగరములనుండు ప్రాయపుమగలు జాణ-
లవధరింతురు 'తల్లి బిడ్డవలె' ననుచు. ౨౦

(౭౪౧)

---

(౧౮) విందుకై పిలువఁబడి వచ్చిన బాసాలి అక్కడనే కొంతకాలము నిలిచినది. దానికి కారణము మగనితోనామెకు ఏర్పడిన చెలిమియని యిల్లాలెఱుఁగును. కనుకనే 'విందు చుట్టమింకను ఇక్కడనే యున్నదేమి ?' అని ఇతరులు ప్రశ్నింపఁగా ఆమె అక్కసుతో నాడినమాట యిది.

(౧౯) కళలు = కాంతులు; చంద్రుని షోడశభాగములును. మిత్రమండలంబు = స్నేహితుఁడు ప్రభువుగానున్నచోటు; సూర్యుని బింబమును. కృష్ణచతుర్దశినాఁడు చంద్రుఁడెట్లు అమావాస్యనాఁటి సూర్యమండలములోఁ జొచ్చునో అట్లే శుక్లప్రతిపత్తునాఁడు బైటికి వచ్చును. మిత్రుఁడు వానికేమియు సహాయము చేయఁడనుట.

క. పులులు శరభములు గురుపో-
తులు కరడులు కరులు హరులు దున్నలు మొదలౌ
పలుమెకములకభయము ప-
ల్కులీలఁ బెరిగినవి చెంచుకోడలిగుబ్బల్. ౨౧

(౨౪౨)

ఆ. బొమలు ముడువఁగలను; పొమ్మని బెదరింపఁ
గలను; పెడమొగమున నిలువఁగలను;-
చెలులు! మీరలేమిచెప్పిన నదిచేయఁ-
గలను- వానినొకని గాంచకున్న! ౨౨

(౨౪౩)

తే. మోసమునఁ దోఁచు; బలవంతమునను గలుగు;
వట్టి డబ్బుపేరాసఁ జూపట్టు; మరియుఁ
బుట్టు మొగమోటమునకును భువిని - ప్రేమ;
దండములు దండములు సుమ్ము దానికెల్ల! ౨౩

(౨౪౪)

ఆ. మగని యూరడింపుమాటల చేఁతల-
చవులెఱుంగలేనిదెవతె భువిని?
చేసికొన్నయలుక చెడఁగొట్టు హేమంత-
కాలరాత్రులిట్లు గలుగవేని. ౨౪

(౨౪౫)

---

(౨౧) ఈమె యౌవనబలమునకు లోఁగి చెంచునాయఁడు పై మహామృగములను వేఁటాడుశక్తిని గోలుపోవుననుట.

(౨౩) స్త్రీని పురుషుఁడిన్నివిధములను వశీకరించుకొనును. దేహమనస్సులు రెంటను స్త్రీలు అబలలని యొకతె తమ పారవశ్యము దెల్పినది.

(౨౪) అలిగియున్నప్పుడు మగఁడు సమదాయించుటలో ఎంతో రుచియున్నదని యొకతె చెప్పఁగా, అలుకను నిల్పుకొనుట యీశీతకాలముననసాధ్యమని మఱొక్క అనుభవరసిక చెప్పుమాట.

తే. అమ్మ! యందందె యాకసమందు రిత్త-
చుట్లఁ బెట్టుచు మరలుచుఁ జూడు నన్నుఁ
బాడువలపిది నవ్వులపాలుసేసెఁ,
గడలిలో నోడకంటిన కాకిఁబోలె! ౨౫

(౭౪౮)

ఆ. పట్టుకొన్న చేయి బలిమి విదుల్చక
తప్పి చనెదు కాని దారికాఁడ!
మనసునుండి యిట్లె చనఁగలవేని నీ-
దిట్టతనమునపుడు తెలిసికొందు! ౨౬

(౭౪౯)

ఆ. ఇంతనిజము; ప్రియుఁడవీవు నాకు; నదెట్లొ
యెఱుఁగ!- నలుగకుండ నించుకంత
యేను బ్రియను నీకునెట్లొదు నాగుట్టు
నీవె నేర్పు నాకు నీటుకాఁడ! ౨౭

(౭౫౦)

ఆ. వలపువెఱ్ఱిఁ దగులువడి కాఁపుకొడుకంచుఁ
దెంపుసేసి కౌఁగిలింపఁబోతి;
కఱకు మేనుసోఁకి కాంతునా, యది యూరి
కంచెమీఁదనుండు గడ్డిబొమ్మ! ౨౮

(౭౫౧)

---

(౨౫) ఓడమీఁద వాలి దానివెంటనే నడికడలికిఁ బోయిన కాకి మరల గట్టునందలి తన గూఁటికి పోవలెనని ప్రయత్నించి నెగ్గక నవ్వులపాలగును. దుర్లభవ్యక్తిమీఁది ప్రేమయు నట్టిదే.

ఆ. మానమునకు బ్రదుకు మగవారలకు రెండె
గతులు గలవు సూ జగంబునందు:
కోరు సిరి గడించికొందురు; కాదేని
తెగుదురందుకొఱకుఁ దిరిగి తిరిగి. ౨౯

(౭౫౨)

తే. కటకటా! యేమిపనిచేసె గండుదేఁటి!
జాజితోడి విరాళిని సైఁపలేక;
చూడవే పిల్ల! అగ్గి యంచును దలంచి
వాల్చె మేనినశోకపుష్పములనడుమ. ౩౦

(౭౫౪)

తే. వట్టిబట్టలు మిగిలినయట్టిదయ్యెఁ
జాజిపొదఁ దేఁటి విడనాడి చనదు చూడు!
దాని యరవిరిమొగ్గలలోని కమ్మఁ-
దావి తాఁజవిగొన్నది తలఁచి కొనుచు. ౩౧

(౭౫౫)

ఆ. ఎదురువచ్చి ముందుకేగినప్పుడు నిన్ను
శోకనైనలేమిఁ జూడు! సుదతి,
తనదు మేను చిన్నదనుచును, దనయూరి-
తెరువు విరివి యనుచుఁ, దిట్టుకొనెడు! ౩౨

(౭౫౬)

ఆ. అడవినెల్లఁ జూడు! చెడఁగాల్చి కార్చిచ్చు,
మిట్టపల్లములను మెట్టి దాఁటి,
గట్టునందు వ్రేలు గడ్డివెంబడి నేటి-
కడకుఁ జేరె, దప్పివడినయట్లు. ౩౩

(౭౫౮)

తే. కాచుకొనుచున్నదదె తేఁటి కడఁకఁ జూడు!
జీవమునుబోలె నొండొకచింతలేక,
బయటికరదోఁచు పులికోఱపంటికొనకు
సాటివెట్టఁగఁ జాలిన జాజిమొగ్గ. ౩౪

(౭౬౧)

ఆ. ఎల్లపనులయందు నెడఁబాయకుండ స్నే-
హంబు నించి బుజ్జవంబు నెఱపు
చున్న, నల్లఁబాఱుచుండు నీదీపాల-
మూతులేమనంగఁబోలు వీని! ౩౫

(౭౬౨)

ఆ. దప్పిగొనియె లేడి త్రాఁగనిమ్మని యిఱ్ఱి,
యిఱ్ఱి డస్సెనంచు నెంచి లేడి,
రెండు దప్పిగొనియు నిండునెయ్యంబున
నీరు దాఁకకుండ నిలిచియుండె! ౩౬

(౭౬౩)

---

(౩౫) స్నేహంబు = నూనె; ప్రేమ. ఏపనియందును మనము దీపమును వదలము. స్నేహము నించుచునే యుందుము. అప్పుడప్పుడు బుజ్జగించినట్లు వత్తిమీఁదికి త్రోయుదుము. ఐనను వానిమూతులు నల్లఁబడును. అయోగ్యులైన మనుష్యులును ఇట్లే.

(౩౬) ఆఁడుజింక యందు లేడి పదమునకర్థము. 'ఇఱ్ఱి' మగజింకకువలె 'లేడి' పెంటిజింకకు పేరుగా ప్రయోగసిద్ధముగాదు. ఐనను ఆనుకూల్యమునకై శబ్దలాలిత్యమును బట్టి యిట్లు ప్రయోగించుట.

తే. తళుకు బెళుకుల కరవాఁడి కొలుకులొప్ప
నీదు తెలికన్నుఁగవబల్మి యూఁది, మరుఁడు,
మరల ముక్కంటితోడ సంగరము సేయఁ
బూనఁగోరెడుఁ, జామనమేనిదాన ! ౩౭

(౭౬౪)

ఆ. పిచ్చిపిల్ల ! వానవచ్చి నిండెను ద్రోవ-
నడుసు; కాలు జాఱి పడెదు సుమ్ము !
ఎదుట నిలిచినట్లె మదికిఁ దోఁచు నీ-
ప్రియునిచేతఁ జేయిపెట్టఁ జనుచు. ౩౮

(౭౬౬)

తే. అభిసరింపఁగఁ బోయినయప్పుడతివఁ
బ్రియుఁడు తొడపయిఁ గూర్చుండఁ బెట్టి, దాని-
కాళ్ళకంటిన బురదను గడిగివైచెఁ,
జెంతనున్న బానిసవలెఁ, జెమటనీరు. ౩౯

(౭౬౭)

తే. ఇంటిపెనుగంచె నీబరువెల్ల మోయఁ
గల్గినది, వీడి పొరుగింటికంచె మీఁద
సాఁగి పోయెదు గుమ్మడి తీఁగ ! చూడు
నిన్నుఁ దెగఁ ద్రుంచి వైతురు నేఁడొ రేపొ ! ౪౦

(౭౬౮)

---

(౩౭) ఒకమారు శివునితో పోరి బూదియైనవాఁడు మన్మథుఁడు. మరల అప్రయత్నమునకు వానికి తగినయాయుధము దొరకలేదు. నీకన్నులయందపుబలము వానికి దానినిచ్చినదనుట.

(౪౦) బైటిగుమ్మడి తీఁగ నెపము మాత్రమే. ఇంటిలో దానివలె కన్నుగానక వర్తించు విల్లాలిని గూర్చిన హితోపదేశమిది.

తే. అడవియెలుకలు పండ్లచే బుడములెల్లఁ
గొఱుక నఱవఱలై పడి, పఱచు టెండఁ
జివికి, వెలవెలఁ బాఱిన నువుల చేను
గాంచి వలవల యేడ్చెను గాఁపుగరిత. ౪౧

(౨౧౯)

తే. కఱకుఁ జలి గాచుకొనఁగ నొండొరులఁ గడవఁ
జిదురుపుల్లల కొఱకుఁ గంచెలమొదళ్ళ
బుడుతలందఱుఁ దోపులోఁ బుడుకుచుండ
నూరకయ మండిపోవుచు నుండె నగ్గి. ౪౨

(౨౨౦)

ఆ. ఎవనియురమునందుఁ బవళించు నిల్లాలు
వేఁడిగుబ్బచనుల వ్రేఁగు వైచి,
పచ్చడంబులేల వానికి ? నిప్పుల-
కుంపటేల ? వెచ్చకొట్టు నేల ? ౪౩

(౨౨౧)

ఆ. అదిగో నడవఁజొచ్చె, నామనిదొరరాకఁ
దెలుపు మొదటి కమ్మఁ దెచ్చునట్లు,
మలయమారుతంబు తొలుతటి యూడుగు-
తలిరు గొనుచు, నూరిదారులందు. ౪౪

(౨౨౨)

---

(౪౧) సంకేతస్థానము చెడిపోయెనే యని ఆమె దుఃఖము.

(౪౨) చలికాలమున పల్లెలలో ఊరిబైట తోపులలో ప్రాతఃకాలము ఊరిపిల్లకాయలు మంటవేసి చలిగాచుకొందురు. పుల్లలు చాలవని, నేను తాను అని, బాల్యచాపల్యముచే కంచెల నుండి యేరి తెచ్చుటకందఱును లేచి పరువెత్తుదురు. వారు మరలునంతలో అగ్గి వ్యర్థముగా మండిపోవును.

తే. మూతివిచ్చిన యూడుగు మొగ్గలకును
బెదరి పోవునీపొలయల్క పేరు లేక;
ఇట్టిదానిని నిల్పుకోనెట్లు వచ్చుఁ
బ్రియుని ముఖచంద్రునెదుట దర్శించినపుడు ? ౪౫

(౨౨౮)

తే. కారణము గల్గి కొన్నయల్కయును నాకు
సన్నగిలిపోయె నున్నది యున్నయట్లె
పూని పూచిన యూడుగుమ్రాన ! దాని-
పాపమంతయు నీనెత్తిఁ బడును గాక ! ౪౬

(౨౨౯)

ఆ. శిశిరమందుఁ గాఱుచిచ్చునఁ గాలి యా-
మనికిఁ బొటమరించి మరల, ముంగి-
చెవులఁబోలి యెదుగు చివురాకుతోడ మో-
ఘుగులుఁ కనులఁదన్పఁ దొడఁగెఁ గంటె ! ౪౭

(౨౮౧)

ఆ. చివురులంచులగుచుఁ జెలఁగ నెత్తావుల
దవులఁ జల్లు నున్నఁబువులవలువ
మదనుఁడిచ్చెఁ బోలె మధుమాసలక్ష్మికి
నలువుమీఱు పసదనంబు గాఁగ. ౪౮

(౨౮౨)

ఆ. కారణంబు గల్గి కైకొన్న పొలయల్క-
నేని చూడు ! మానిపింప నేర్చుఁ,
జెవిని జేరి యనుఁగుఁ జెలిమికత్తియఁ బోలె
మానినులకుఁ గ్రొత్తమావిచివురు. ౪౯

(౨౮౩)

తే. 'నేఁడు పండువునాఁడు సూ; నీ ప్రియుండు
వచ్చు నిజముగ; నేడువవలదు బిడ్డ !'
అనుచుఁ గోడలినూరార్చికొనుచు మొగము
నావలకుఁ ద్రిప్పి తానేడ్చునత్తగారు ! ౫౦

(౨౮౪)

ఆ. అతివ వీడుకొన్నయప్పుడు మెడకుఁ గే-
ల్దీఁగ సాఁచి కౌఁగిలించి విడువఁ,
బయనమైన ప్రియుని పాదాలపైఁ గంక-
ణములు జాఱె, సరిపణలునుబోలె. ౫౧

(౨౮౫)

---

(౪౯) చెవిమీఁదికేదో యొకచిగురాకునలంకారముగాఁ జెరివికొనుట విలాసినుల పద్ధతి. అట్లు చెవికెక్కినది క్రొత్తమామిడి చిగురాకాయెనా వసంతము వచ్చినదని తెలియును. ఇఁక ప్రియుడెంత తప్పుచేసియున్నను వానిమీఁదికోపము మానవతులకు నిలువఁజాలదనుట.

(౫౦) ఇది వట్టిమాటయేకాని వాఁడు రాఁడనియు, దానిచే నిఁకముందు కలుగఁగల ప్రమాదములను ఆమె యెఱుఁగును. అందుకేడ్పు.

(౫౧) విరహముచే ఆమె హఠాత్తుగా కృశించినది. జాఱిన ఆమెచేతికడియాలు పయనముకానున్న పతికాళ్ళకు సంకెలలై పడినవి.

తే. నవకమగు క్రొత్తవరిపైరుచవికి మరగి
వింధ్యగిరిమీఁది సీమను విడిచి దిగెడు
తరుణకుంజరమునకు యూథపతి పట్ట-
మెన్నిసుగుణంబులున్నను నెట్టులబ్బు? ౫౨

(౨౯౮)

ఆ. పువులు గోయుచెలువనవకంపు గోళులఁ
గొంతతడవు, పువులఁగొంతతడవు,
చివురులపయిఁ గొంత, చేతులపైఁ గొంత-
తడవుఁ దడఁబడుచును ముసరుఁదేంట్లు. ౫౩

(౨౯౯)

తే. ఇండ్లు, వేసవిపగలు, వాకిండ్లకనులు
మూసికొని, లోనివారిచప్పుడులడంగి,
గళగళమటంచుఁ దిరుగళ్ళు తిరుగురొదల
గొళకవెట్టుచు నిదిరించుకరణిఁ దోఁచు. ౫౪

(౩౦౦)

---

(౫౨) కొండమీఁదియేనుఁగులు అందే సురక్షితముగా నుండును. నేలమట్టమునకు రావు. యూథమును తిండికక్కుర్తిచే వదలి క్రిందికి దిగఁజొచ్చిన మగయేనుఁగెంత సమర్థమైనను అవి దానిని నమ్మి పతిగా నెన్నుకొనవు.

(౫౩) గోళ్ళేవో పువులేవో, చేతులేవో చిగుళ్ళేవో తెలియక తుమ్మెదలు తడఁబడినవని తాత్పర్యము.

(౫౪) ఎండవడగొట్టునని తలుపులన్నియు మూసియుందురు. లోపల ఎవరును మాటలాడకుందురు. ఇల్లాండ్రు మాత్రము రొట్టెలకు,ముద్దలకు, పిండి విసరుచుందురు. కనుక కనులు మూసికొని నిద్రించుచు గొళకపెట్టునట్లుగాఁ దోఁచును ఇండ్లన్నియు.

ఆ. నాల్క సాఁచి యింత నాకవచ్చును గాని,
పసులపెదవికేని పంటికేని
పట్టువడదు మొదటఁబుట్టిన పచ్చిక-
మొలక, కాటువడిన మోవిఁబోలె. ౫౫

(౨౦౧)

ఆ. అడఁపరాక తీవియలఁ జాఁచెదవు; పొరు-
గింటికంచెయును దెగించి దాఁటఁ-
గోరెదవు; నిజంబు గుమ్మడి! నిను జూడ
నేఁడొ రేపొ పూఁతనింపఁ గలవు. ౫౬

(౨౦౨)

ఆ. తళుకులాఁడి గురునితంబభారము రెండు
గాన కాళ్ళు మోవఁగలవు గాని,
ఓర్వనేర్చునెట్టులొంటిది నన్నువ-
కౌను వీఁగుచున్నఁగవను మోవ? ౫౭

(౨౦౩)

తే. వలదటన్నను బండువెన్నెలకు వలచి
యింటిముంగిటనే శయనింపఁబోకు,
బిడ్డ! నీమోముఁ జూచి జాబిల్లియనుచు
నీటిదయ్యము పట్టుకొనీని గదవె! ౫౮

(౨౦౪)

---

(౫౮) నీటిదయ్యము = రాహువు. 'అంబుపిసాఓ' - అంబుపిశాచః - అని మూలము. 'రాహౌ దేశీ' అను టీకావాక్యము వీరు ఎత్తిచూపినాడు. ఛాయాగ్రహమైన రాహువును నీటిదయ్యముగా గ్రహించిన దేశవ్యవహారమునందలి వింతకై అట్లే తెలిఁగింపఁబడినది.

ఆ. వీరు వారుఁజెప్ప వినుచుంటి నీమాట;
నేఁటికెట్టకేని నిన్నుఁ గంటి;
నందకాఁడ! యేమియైనఁ బల్కఁగదోయి!
అమృతరసము వీనులానుఁగాక! ౫౯

(౨౦౫)

ఆ. వెఱ్ఱిపిల్ల చిక్కెవిరహంబుచేనిది;
చనినవాఁడు రాతిమనసువాఁడు;
వెడలిపోవఁజొచ్చె వేసవినాళ్లు; ముం-
దేమి యగునొ కాని యెఱుఁగమమ్మ! ౬౦

(౨౦౬)

ఆ. అమ్మ! యంగణమున నరనిద్ర నాదారి-
కాఁడు రేయి 'యోసి కటికదాన!
ఇట్లు దిరిగి చూడవే!' యని కలువరిం-
పంగఁ జూచి యేడ్పు వచ్చె మాకు! ౬౧

(౨౦౭)

తే. అలుకగొని యేడ్చు జవరాలి యశ్రుజలము,
కనుల చెక్కిళ్ళ కెమ్మోవి కాంతి బెరసి,
చక్కనగు వానవిలువోలె జాలువాఱఁ
దడవు గనుచుండె దయితుఁడు తనివిసనక. ౬౨

(౨౦౮)

తే. అది తటాలున వెలుపలికరుగుదెంచెఁ
గాని, కనులార నిను జూడఁగలుగదయ్యె,
నెత్తిఁగొట్టిన పాముమేనివలె రచ్చ
వంకరలు గొన్న యీపాడుపల్లెలోన! ౬౩

(౨౦౯)

తే. చెలులు నేర్పరులాడుకోఁగలిగి నేఁడు
బ్రదికి యున్నది ప్రాణము పట్టుచెడియుఁ,
గొంత నీవిరహంబునఁ, గటికచేతి-
పులుగువలె; నీకు దయ యింత గలుగదకట! ౬౪

(౨౧౦)

ఆ. 'కుప్పసమున దాఁచుకొన్నావు దొంగిలిం-
చినవి ప్రత్తిగవ్వల'నుచు నత్త!
గొల్లవాఁడు బల్మిగొని చూడు! నాయెద-
కిట్టిపాటు దెచ్చిపెట్టె నేఁడు. ౬౫

(౨౧౧)

శ్రీ

శాలివాహన

# గాథాసప్తశతీసారము

## 3 వ భాగము

ఆ. గాథలందు, గేయగతులందు, వీణెల
పలుకులందుఁ బ్రోఁడ మెలఁతలందుఁ
గలుగు మేలిరసము గనుగొనలేనివా-
రవనినున్న వారికదియ శిక్ష ! ౧

(౮౧౫)

ఆ. బొడ్డుదమ్మియందుఁ, బురుషాయితమువేళ,
నలువ యుంటఁ జూచి, కలిమిచెలువ
సరగనొక్క చేత మురవైరికుడికన్ను
మూసిపెట్టె రసవిమూఢ యగుచు. ౨

(౮౧౬)

ఆ. నవ్వవోయి ! యొరులు నవ్వని యట్లు; భా-
షించవోయి ! యొరులకించునట్లు;
బ్రదుకవోయి ! కీర్తి పొదలునట్టులు; తుద
గిట్టవోయి ! మరలఁ బుట్టనట్లు. ౩

(౮౧౮)

---

ఈ భాగమందలివి తెలుఁగుదేశపు మూలపాఠములోనివని వీబరు సంగ్రహించిన గాథలలో నుండి యేర్చినవి. కుండలిత సంఖ్య అతని ప్రతిలోనిది.

(౨) విష్ణువు కుడికన్ను సూర్యుఁడు. దానిని మూసినచో వికసించిన నాభికమలము ముడుచుకొని అందలి చతుర్ముఖుని మఱుఁగుపఱుచునని లక్ష్మిభావము,

తే. గాడిదలకు గేదెలకు మేకలకు నెల్ల-
కెల్లకడలందుఁ జోటు లభించుఁ గాని,
భద్రగజరాజములకుఁ గావలయుఁ జుమ్మ
దొడ్డయడవులు, కాదేని దొడ్డదొరలు! ౪

(౧-౨౦)

ఆ. పోను బోవె నేను జేనికిఁ! బంట మే-
సినను మేయనిమ్మ చిలుకదండు!
తెరువుకాండ్రు దారిదెలిసియు మరిమరి
వచ్చి నన్నెయడుగఁ జొచ్చినారు! ౫

(౧-౨౧)

తే. అల్లుఁడాకస్మికంబుగా నరుగుదెంచి
యింటిపెద్దలనడుమఁ గూర్చుంటఁ జూచి,
యొడలు పొంగఁగఁ 'జిట్టి రాలెదిని; బిగువు
పాడుగాజు!' లటంచుఁ గోపపడు బిడ్డ. ౬

(౧-౨౨)

ఆ. 'ఇందు రారె! చూడరే వింత!' యనుచు ని-
ల్చుండి యబ్బురమునఁ జూడఁ దొడఁగె,
నద్దమందుఁ జెక్కునద్దంబు చెక్కునఁ
గానవచ్చుచుండ, దానిసకియ. ౭

(౧-౨౪)

---

(౪) భద్రగజములు - రాజయోగ్యములై శుభకార్యములందలి యూరేగింపులకు పనికి వచ్చునవి.

(౫) తమదారికంటె తనతోడి సల్లాపమందే తెరువునఁ బోవువారికి ఆసక్తియెక్కువ. ఇదియెంత గర్వహేతువైనను అట్టి పాంథులందఱితోడను మాటలకు దిగుట అపిల్లకిష్టముగాదు.

ఆ. ఎపుడు పుట్టె ? నెప్పుడెక్కడ నేర్చె నీ-
చెడుగుపిల్ల ! చెప్పఁ జిట్టలమ్మ !
ఎదిగినట్టి గరితలేమేమి నేర్తు ర-
వెల్లఁ దెలిసికొనియె నిదియుఁ జూడు ! ౮

(౮-౨౫)

ఆ. చెవుల మావిపూతఁ జెరివి, సీధుమదంబు
కనుల జేవురింపఁ, గల్వపువులు
ముడిచి, చనుల గందవొడి పూసికొన్న నీ-
యునికి బిడ్డ ! పల్లెకొక్కతొడవు. ౯

(౮-౨౬)

ఆ. అడిగి పడసినప్పు, డడుగక బల్మి ము-
ద్దాడినపుడు, చెలి తనంత వలచి
మోమొసంగినపుడు, మోవి యొక్కటియైన
వేఱువేఱుచవులు వెలయుఁ జూవె ! ౧౦

(౮-౨౭)

ఆ. విప్పుగనులఁ దళుకు వెల్లువయ్యె, నును-
జెక్కులందు జాలు చెమటసోన
గలిగి, వలపుఁజొక్కు కడముట్టెననుటఁ జె-
ప్పకయ చెప్పుచుండెఁ బడఁతిమొగము. ౧౧

(౮-౨౮)

ఆ. నిదుర నెడుట లేక, నెఱయూసు లేక, దై
న్యంబు లేక, పొల్లయల్క లేక.
కవుడు లేని చాటుకారంబులును లేక,
యుండుచోటఁ బ్రేమయును హుళక్కి. ౧౨

(౮౨౯)

తే. పొగరుగొననేల యింత 'చన్నుగవమీఁద
నామగఁడు చిత్తరువు వ్రాసినాఁడ' టంచు ?
నాప్రియుఁడు గూడ వ్రాయువిన్నాణమెఱుఁగుఁ
బోవె !- చేతుల వడఁకింత పుట్టదేని ! ౧౩

(౮౩౦)

ఆ. 'నేను బోయి వత్తునే' యన్న నీమాట
యకట ! పాపజాతినైన నాదు
చెవిని బడియె; మదికిఁ జేరె! నే విరహమం-
దోర్వలేనిదేమి యున్నదింక ? ౧౪

(౮౩౧)

ఆ. త్రోవ సదరమయ్యెఁ దొలినాఁడు నడచు పాం-
థునకుఁ గాళ్ళబిరుసు తొట్రువడెదు,
ఎదను నిల్చియున్న యిల్లాలి గురుతర-
శ్రోణిభారమునకు స్రుక్కునట్లు. ౧౫

(౮౩౨)

---

(౧౨) చాటుకారము = ప్రేమతో చేయు అసత్యమైన పొగడ్త. ప్రేమయున్నప్పుడే అది కవుడు లేనిదిగానుండును.

(౧౩) నాభర్త నాదగ్గఱకు వచ్చినమాత్రమున సాత్వికోదయముచే అతనిదేహము వడఁకును. అంత తీవ్రమైన యనురాగమును గలిగించు శక్తి నీవద్ద లేదు పొమ్మని భావము.

ఆ. సందులేక తనదుసతిపేరి యక్కరం-
బులనె కమ్మనిండఁ బొదిగి పెట్టి
వ్రాయలేఁడు కుశలవార్తయైనను బాంథుఁ;-
డింకనింటిసుద్దికేది చోటు ! ౧౬

(౮౩౩)

ఆ. తలఁపులోనఁ దోఁచు దయితుని యంగసం-
గమున వెల్లివొడుచు చెమటఁ దోఁగి,
మగఁడు వలసచన్నమగువ, హేమంతంబు
గడచి పోయినదియుఁ గానదయ్యె ! ౧౭

(౮౩౪)

క. కలలోనఁ దోఁచి దయితుఁడు
పులకోద్గమ నిర్భరాంగములతో నిడు కౌఁ-
గిలి వడసి సొగియుఁగాక, చె
లులు ! పాపము దీని మేల్కొలుపకుఁడు మీరల్. ౧౮

(౮౩౫)

తే. క్రొత్తదిరిసెనపూఁదావి గొన్నగాలి
గమగమలు నించు నెలసంజఁ గలిగినంత
తపన గలుగదు పాంథునిదయిత కెండ-
లగ్గి చల్లెడు మట్టమధ్యాహ్నమైన. ౧౯

(౮౩౯)

ఆ. ప్రియుఁడు వలసపోయి పెద్దకాలము గాఁగ,
వానికథల వలఁతులైన సఖులు,
చెలికి విరహమోర్చుచేవకై వరుసఁ దె-
ల్పెదరు తప్పునడలు లేనివైన. ౨౦

(౮౪౦)

ఆ. వలస చన్న తనదు వలపులఁజేనికిఁ
గమ్మ వ్రాయఁబూని కాంత, వాని-
పేరి యక్కరములు పెట్టినయక్షెల్లఁ
జెఱుచుఁ గలమువెంటఁ జెమట జాఱి. ౨౧

(౮౪౧)

తే. ఇట్లె కనుమూసికొని యుండనిండు ప్రియుని
దలఁచుకొనుచును; వారింపవలదు దీని;
చెంతనాతఁడు లేనిచోఁ. జెపుఁడు మీరు,
కనులు దెఱచియు మఱి యేమి గాంచఁగలదు ! ౨౨

(౮౪౨)

ఆ. నిడుద వేఁడియూర్పు, సడలని తహతహ,
యేడ్పుగద్గదికల నెలయు పాట;-
వేడ్కలివియ సుమ్ము వెలఁదికిఁ బ్రియవిర
హమున, బ్రదుకు మీదియాస యున్న. ౨౩

(౮౪౩)

తే. ఈవు మాయెడ దయగలవేని దేవ !
యియ్యవలవదు నరజన్మ; మిచ్చితేని
ప్రేమఁ గల్పింపవలదు; కల్పించితేని
చేతికందనివారిపైఁ జేర్పవలదు. ౨౪

(౮౪౪)

ఆ. కుఱుచలగును వేసఁగులయందు రాత్రుల-
టంచు లోకులెల్లనంద్రు గాని;
దయితుఁడండ లేని తఱినవి, యేఁటికో
యెఱుఁగ, మాదుపాలఁ బెరుగుచుండు ! ౨౫

(౮౪౫)

క. ఒక యయనమునఁ బగళులిం-
కొకదానను రేలుఁ బెరుగుచుండు; నపూర్వం-
బిఁక విరహాయనమిదివో ;
సకియా ? యిట రెండుగూడ సమముగఁ బెరుగున్. ౨౬

(౮౪౬)

క. చిరజీవితఁ గోరుచు న-
స్థిరమైన రసాయనములు దిని యలయకుమా !
విరహమును దెచ్చుకో; యుగ-
పరిమాణములగును దాన భామిని ! దినముల్. ౨౭

(౮౪౭)

తే. ఏడ్చుచుండిన నాతోడనేడ్చు, గడువు-
దినములు గణించుఁ. మఱి నావలెనె కృశించు,
గట్టివాలిది ప్రియవియోగమున నత్త !
యెంతయపురూపమైనదా యింతి చెలిమి ! ౨౮

(౮౪౮)

తే. ప్రియుఁడ ! మీఱలేవు పెద్దలమాట; యే-
మందు భాగ్యహీనురాల నేను !
ఇపుడ పోవవలయునేని పొమ్మీవె వి-
నంగఁగలవు మీఁదనడచు తెఱఁగు ! ౨౯

(౮౫౧)

---

(౨౭) రసాయనములు = ఆయుస్సును పొడిగించు మందులు.

(౨౮) గట్టివాలిది = సైరంధ్రి; తనవేషభూషణములు సవరించు పనికత్తె. నాదుఃఖమును స్నేహధర్మమున తానును అనుభవించుచున్నదని పైమాట. నాప్రియుఁడు దానికిని ప్రియుఁడేయనుట తత్వము.

(౨౯) నీవు వెడలిన పిదప నేను జీవింపనను విషయము నీవే విని తెలిసికొందువు, నేనిప్పుడు చెప్పిన నీవు నమ్మవు-అని భావము.

ఆ. విరివి చాలఁ గలదు ధరణికిఁ; బీవర-
స్తనయుగములు గురునితంబములును
వెడఁదకనులుఁ గల్గు వెలఁదురెందఱొ లభి-
యింతురందకాఁడ ! యేల వగవ ! ౩౦

(రా౫౨)

క. పోయిన దూతి మరల రా-
దాయెను; జాబిల్లి వొడిచె; నరుగఁగఁ జొచ్చెఁ
రేయియు; నన్నియు విషమము-
లే యన్నిటనయ్యెఁ; నెవరినేమందుమిఁకఁ ! ౩౧

(రా౫౪)

క. ఏకసక్కెంబునకై దూ-
తిక 'యాతఁడు రాఁడ' టంచుఁ దెల్పఁగ నాయిం-
తికి నెంత దాఁచుకొన్నను
ముకురకపోలములఁ దోఁచె మోదము గంటే ! ౩౨

(రా౫౬)

ఆ. 'ఎట్లు నీవు పోయితెట్లు సూచితి వాని ?
నేమిచెప్పితందుకేమి చెప్పె
నాతఁ ?' డనుచు నాడినదె యాడుచుండునా-
మగువమాటలెపుడు ముగియకుండు. ౩౩

(రా౫౭)

---

(౩౨) అది యెకసక్కెమని యామె తెలిసికొన్నది. దానికిఁ దగినట్లు నిర్వేదమునభిన యింపఁబోయినను పొంగివచ్చు సంతోషము దానిని సాఁగనియ్యలేదు.

ఆ. కడిదియూర్పువేఁడిఁ దడఁబడు పదముల,
నదవదలుగ వెడలునక్కరములఁ,
జెలియ ! వాఁడు నీకుఁజెపుమన్న మాటల-
కెఱుఁగనైతి నర్థమిట్టులనుచు ! ౩౪

(౨౫౯)

తే. పూటపూటకు వానిఁ దేఁబోయి యచట
నాగొఱకుఁ జాల గాసిగొన్నావు గదవె !
చెలియ ! నాచెల్మినమ్మకములకుఁ దగిన
కరణి నడచితివేమైనఁ గాని లెమ్మ ! ౩౫

(౨౬౦)

క. అనుచుందువెప్పుడును 'నీ-
పనియే నాపని' యటంచు; ఐళి ! తుదముట్టం-
గను దానినిట్లు నెఱవే-
ర్పనుగంటివి; దూతి ! సత్యవచనవు గదవే ! ౩౬

(౨౬౧)

---

(౩౫) నాయకుని తోడితెచ్చెదనను నెపముతో పోయిన దూతి అతనిమీఁద తనకుఁగల వలపును అక్కడనే సార్థకము చేసికొని వచ్చినది. ఇంగితాకారములచే దానిని నాయిక గ్రహించి సవ్యాజముగా నిట్లు నిందించినది.

(౩౬) ఈ గాథార్థమునకును పైదానివలె దూతి చేసిన మైత్రీద్రోహమును నాయిక గ్రహించుటయే మూలమైన భావము.

క. ఎలదీఁగఁ దీఁడినపుడా-
హాలికవధువు బెదరు సూపునరిదివగల నే-
ర్పుల నింటింటను నేర్వఁగ
నెలఁ(బ్రాయపుఁ జెలువలబ్బెసించెదరిపుడుఁ ! ౩౭

(౮౬౧)

ఆ. పున్నియంబు సేసి పుట్ట; నాసలు కొన-
సాఁగకుండ నిల్లె సమసి పోదు;
అడికైనఁ బుట్టదయ్యేను 'నాకు నా
కాఁపుకొడుకు వలపుకాఁడ' టంచు ! ౩౮

(౮౬౪)

ఆ. బిడియమొకటి నిండు తొడవుగాఁ గలవారు,
పరులగొడవలకును జొరనివారు,
తుంటరికముదిక్కు దోఁపనివారు నౌ
సతులు గలరు పుణ్యశాలులిండ్ల. ౩౯

(౮౬౬)

ఆ. వెగటు లేని ముద్దునగవులు, కులుకులు
బెళుకులెఱుఁగకుండు లలితగతులు,
సరళరీతి వెడలు సాజంపుమాటలు
సతులకుండుఁ బుణ్యశాలులిండ్ల, ౪౦

(౮౬౭)

---

(౩౭) క్రొత్త పెండ్లామును ఎలఁదీఁగతోఁ గొట్టుట ఆకాలపు శృంగారహావములలో నొకటి. కొట్టినప్పుడు నొప్పి, కోపము, భయము మొదలగు భావములను ఆకర్షకముగా ఆపిల్లయు నభినయించినది. ఆ అందచందాలు తాము నేర్చుకొనవలెనని ఆపల్లెలోని తక్కిన పడుచుల ప్రయత్నము.

తే. మగఁడు పురాణమునందలి
వగకత్తియ రూపగరిమ వర్ణింపఁగ, బె-
ట్టుగ హుంకరించె నాతని-
మగువ సహింపంగలేక మాత్సర్యమునన్. ౪౧

(౫౬౫)

క. ఒరులకుఁ జెప్పుకొనరు, వెలు-
వఱుపరు వగచుచును, హృదయఫలకమునందే
కరఁగింతురు, పొలయల్కల-
తెఱఁగులఁ గులపాలికా సతీమణులెందున్. ౪౨

(౫౬౯)

ఆ. జిత్తఁదనము చూడ్కి హత్తఁగఁ, గాటుక-
మెఱుఁగులెల్లఁ జెడఁగ మఱుఁగునంద
మిన్న కేడ్చి తుడుచుకొన్న కన్నులు కులాం-
గనల విరహబాధ మనకుఁ దెలుపు. ౪౩

(౫౭౦)

ఆ చెలువు జవ్వనంబు తళుకులు బెళుకులుఁ
దోఁచుచుండుఁ గులవధూటి మేనఁ,
జూడు! దయితుఁడిల్లు సొచ్చినప్పుడు సొచ్చి,
వెడలునపుడు వెడలు వడువు గాఁగ, ౪౪

(౫౭౧)

ఆ. కనులనీరు కుత్తుకకు నడ్డురా బిట్టు
మగనిమృతికిఁ జెడిపె వగచి యేడ్చె,
'సాగుమానమునకు సమకట్టునో' యని
అంకుమగఁడు గూడ శంకఁజెంద ! ౪౫

(౧౨౩)

ఆ. పక్షిగణములెగిరి ప్రబ్బలి పొదలలో
నలబలంబు సేయనాలకించి,
యింటిపనులఁ దెఱపి యెఱుఁగని కోడలి-
కంగమెల్లఁ గ్రుంగినట్టులయ్యె. ౪౬

(౧౨౪)

ఆ. కటికమనసుదత్తగా, రింటిపనులెల్లఁ
దలకుఁగట్టి నన్ను నలఁచుచుండు;
ఉబుసు సందెవేళ నొక్కింత కలిగెనా
కలుగుఁ, గలుగకుండుఁ; గదవె నాకు ! ౪౭

(౧౨౫)

---

(౪౫) సాగుమానము = సహగమనము. ఆమె తనతప్పునదఁతనెంతో రహస్యముగాఁ బెట్టుకొన్నది. కనుక తనసుశీలప్రఖ్యాతిని చచ్చినతరువాతఁగూడ నిలుపుకోఁ బ్రయత్నింపవచ్చునని శంక.

(౪౬) ప్రబ్బలి పొదలు ఏటిలోనివి. సంకేతస్థానము. కాలమునకు సరిగా విటుఁడు అక్కడ చేరినాఁడని పక్షుల కోలాహలము సూచించినది. కాని తాను అట్లు చేయలేక పోయినదని యంత దిగులు.

(౪౭) సందెవేళనే సంకేతసమయమేర్పఱుపవచ్చునని, పొంచి వినుచున్నవానికో, కుంటెనకత్తెకో, సూచన.

తే. తడవతడవకు మల్పుల దాఁటు; మల్పు-
మల్పునను బ్రబ్బితీవ జొంపములఁ బెంచు;
మఱఁది! నీవుమాయూరికి నరుగలేదె?
అచటి మురళాతరంగిణి నరయలేదె? ౪౮

(౨౭౬)

ఆ. ఇప్పపూవులొక్కటేమి? నాయొడలిపై
చీర గొన్నఁగాని, చిన్నవాఁడ!
యెవరితోడ మొఱ్ఱలిడుదు నీయడవిలో!
నూరు దవ్వు; నేను నొంటిదాన! ౪౯

(౨౭౭)

తే. పెదచదువులెన్నొ చదివెదు! పెద్ద ధర్మ-
వేత్తవుర! చేఁదు మేసెడు వేఁపపుర్వు-
సాటివాఁడవు! మనకొక్కసారె నరక-
మిద్దఱకు వచ్చునేని రానీర! పోర! ౫౦

(౨౭౮)

---

(౪౮) మాయూరిలో మన స్వచ్ఛందవిహారములకవకాశములు చాలఁగలవని వ్యంగ్యము.

(౪౯) ఒడిలోని యిప్పపూవులిమ్మని బలవంతముచేయువానితో ఒక ధీరకామిని తెగింపు మాట యిది.

(౫౦) 'మనయిరువురిచెలిమి అధార్మికము' అని శాస్త్రవాక్యములుదాహరించు వానితో తెగించిన నాయిక చెప్పినమాట. 'నీ సతీవ్రతము వేఁపమ్రానిలోని పురుగు జీవనము వంటిది. శాస్త్రమున్నదని అరసికమైన బ్రదుకు బ్రదుకుచున్నావు.' అని తాత్పర్యము.

ఆ. కనులచూపు బెదరి కలఁగెడు నినుఁజూచి
సకియ ! బరువు మోయఁజాలవనుచు,
నిజము ! తలుపుదాఁకు నెపమునఁ దనుదానె
కోరి పగులఁగొట్టుకొనియెఁ గడవ ! ౫౧

(౭౭౦)

ఆ. వడిగ వచ్చినాను గడుఁబెద్దదీనిండు-
గడవ మోచికొనుచుఁ; గాన చెలియ !
ఒడలు వసము దప్పె నూర్పు చెమ్మటలచేఁ,
గొంత సేద దేర్చుకొందు నిందు. ౫౨

(౭౭౧)

ఆ. జాణలైన వారిసంగడంబున నీవు
వంకపలుకులాడవలదు బిడ్డ !
మనసులోనన్న మాటలు గూడ నీ-
కూళజాతి తెలిసికొనును జూవె ! ౫౩

(౭౭౩)

ఆ. వంకపలుకులాడు వలనేడ ! యరగంటి
చికిలిచూపు సూచు చేవ యేడ !
ఊరినిండ జాణలున్నారు; నిట్టూర్పు
చక్క విడుచుటయు నసాధ్యమిందు. ౫౪

(౭౭౪)

---

(౫౧) నిండుగడవ మోసికొని వచ్చుచో వెనుక నాకస్మికముగా పోవుచున్న ప్రియుని తిరిగి చూచుచు ఈమె ఇంటితలుపును 'డీకి' తాఁకినది. కడవ పగిలిపోయినది. ఈ రహస్యము గమనించిన మఱియొకతె ఛలోక్తిగానన్నమాట యిది. దీనికి మొదటిగాథ యనఁదగినది ఈ భాగమందే ౯౯ పది కలదు. చూచునది.

(౫౨) నీలాటిరేవులోని తన స్వచ్ఛందవిహారపు బడలికను ఇట్లు సమర్థించుకొను చున్నదీ నాయిక.

తే. కుంజములు గలవందును; గొండకనుమ-
లందు దూఁకు గోదారియు నచటఁగలదు;
అక్కడను నీకుఁ జెలులుందు; రత్తవారి-
వాడకేఁగుచు నేడువ వలదు బిడ్డ! ౫౫

(౨౨౫)

ఆ. ఎవనికలుక గలుగదే ప్రియురాలికె-
మ్మోవి కాటు గన్న? ముగుద! తేంట్లు
మూఁగియున్న తమ్మి మూరుకొంటివి; వల-
దన్న వినవు; సైఁపవమ్మ యిపుడు! ౫౬

(౨౨౬)

క. పెఱమగల చవులు లోకం
బెఱుఁగక యేమేని యాడనీ; మేమేమో
పెఱమగఁడనుకొనియే సుఖ
మెఱుఁగఁగలము సొంతమగనియెడఁగూడఁ జెలీ! ౫౭

(౨౨౨)

ఆ. వేశకామినులకు వినయంబు లేమియే
పొందుపఱుచు నందచందములను;
మంటకంపెఁ బొగయుచుంటయే సొగియించు-
తీరుగాదె సురభిదారువులకు? ౫౮

(౨౯౦)

---

(౫౬) భార్యమోవిగంటిని జూచి భర్త కోపించుకొన్నాఁడు. దానిగుట్టు దెలిసిన చెలి, ఆగంటికి కారణము తుమ్మెదకాటని యతఁడు నమ్మునట్లుగా సందర్భమునల్లి చెప్పి నాయిక మానమును రక్షించుచున్నది.

తే. కాలగతి చూచితేమె! యా మేలువాఁడు,
సరసకావ్యాలలో నెఱజాణ, యిపుడు
చదివి చెప్పెడి నాపరాశరునినుడులు!
మామగనివెంటఁ దిరిగెదమేముగూడ! ౫౯

(౮౯౨)

ఆ. పొల్లయలుకపాదములకు మ్రొక్కఁడు; పెఱ
వేల్పుగొడవలేల వెలఁదులార!
దానిదయను గాదె దయితులు మనదు పా-
దాంతసీమ దేవులాడఁగలరు! ౬౦

(౮౯౩)

ఆ. అనునయంపుఁ బెంపులడుగు మ్రొక్కుల సొంపు-
లటిమి ముద్దుగొనెడునరిదియింపు-
లివియు మఱియు నిట్టివెన్నేనియును బండుఁ
బూనితెచ్చుకొన్న పొల్లయలుక. ౬౧

(౮౯౪)

క. పలుదెఱఁగుల యూరార్పుల
యెలయింపుల బిడ్డ! వలతువేనియు నీవా-
వలకానిచెంత నిముసం-
బలుగుము; కన్నీరు నింపు; మంతియ చాలుఁ! ౬౨

(౮౯౫)

(౫౯) మేలువాఁడు, వలపుకాఁడు. పరాశరుని నుడులు, కలియుగమందలి విధినిషేధములను దెలుపు పరాశరస్మృతి వాక్యములు.

ఆ. బదులు సెప్పకుండఁ బనిసేతు; వాఁడెడ
గాంచుచుందు పెదమొగంబు వెట్టి;
వదలి పోయెనేని వానికై నిట్టూర్తు;
పుత్రి! వింత నీదు పొల్లయలుక! ౬౩

(౮౯౬)

తే. కనులనదలించినను గెలఁకునకె వచ్చుఁ;
జేత విదిలించినను జీరచెఱఁగు వట్టుఁ;
గొట్టినను బల్మి ముద్దులు వెట్టు; సిగ్గు-
దొలఁగినాతనిమీఁద నేనలుగుటెట్లు? ౬౪

(౮౯౮)

ఆ. ప్రియుఁడు నాకుఁ గానిపింపనప్పుడు, చెప్పఁ-
డెవరికొఱకుఁ గోపగింతు? నింకఁ
గానిపించినపుడు గనలితినేని, వాఁ-
డమ్మలార! యెట్లులగుఁ బ్రియుండు? ౬౫

(౯౦౧)

క. ఎఱుఁగుదును వానితప్పుల-
నెఱుఁగుదునన్నిటను బొంకులే వానినుడుల్;
మఱి వాఁడు నన్నుఁ దేర్పం-
దఱిసినఁ జెలి! యెల్లతప్పు నాదనిపించున్. ౬౬

(౯౦౨)

ఆ. మదికి నేది దోఁచునది యెల్లనాడుచు
నుండుమిల్లె; మేము నోర్వఁగలము;
పొసఁగి యుండలేవు పోర! ప్రాణాలు నో-
ర్వమియు వలఁచినట్టి వారియొద్ద. ౬౭

(౯౦౪)

తే. పిలుము పిలుము నన్నిల్లై! నాపేరు నదియె!
యెందుకీ వెడచూపు నీకందకాఁడ!
నాకుమాత్రము పనియేమి నీకుఁగూడ
మనసుకెక్కనిదాని నామముగఁ గొనఁగ! ౬౪

(౯౦౫)

ఆ. కొడుక! కానిపేరులిడి పిల్చి యూరకీ-
పిన్నదాని రేఁగఁబెట్టఁ బోకు;
నవ్వులాటకాడు నాలిపల్కుల దారి
యిట్టిదనుచు నిదియునెఱుఁగుఁ జుమ్మ! ౬౯

(౯౦౨)

ఆ. పండిపిల్ల! తెలియఁజాలవె! నిను మారు-
పేరువెట్టి వాఁడు పిలుచుటెల్ల,
కనులు మత్సరమునఁ గునిసియాడెడు నీదు
మొగముఁ జూచు తగులమునన చూవె! ౭౦

(౯౦౪)

ఆ. ఒక్కపడుకమీఁద నొదిగి పెణఁబొలయల్కఁ
బెడమొగంబు గొన్న పడఁతిమిన్న,
కలను దయితుతోడఁ గలహించి మార్మొగం-
బగుటకొఱకు నెదురుమొగమె పెట్టె! ౭౧

(౯౧౧)

---

(౬౯) తనకు ప్రీతి పాత్రమైన యింకే నాయికపేరో పెట్టి యీమెను పొరపాటున నాయకుఁడు పిలిచినాఁడు. అది పట్టి నవ్వులాటకై చేసిన పనియని చెప్పి, చెలికత్తె, తెలివితో ఈమెమనస్సు చెడకుండఁ జేయఁబ్రయత్నించి, అతని పొరపాటును సూచించినది.

ఆ. అపుడు కడిఁది మాటలన్న నంటివి గాని,
నీదు పొగరె గెలిచి నెగడసీర !
నిన్నుఁ బాసియుంటినేని నాకంటికిఁ
గూర్కు రాదు; చోటు కొంచెమిమ్ము. ౭౨

(౯౧౨)

ఆ. వన్నెకాని తప్పు విన్నయంతన కల్గు
వంత నొగులునపుడు నింతులేద్వ,-
రతఁడు కంటఁబడి నయమ్మునఁ దమ్మార-
డింపఁ జొచ్చునప్పుడేడ్చునంత. ౭౩

(౯౧౫)

ఆ. ఎడఁద రోసముట్టిపడ మీఁదికెత్తిన
యడుగుఁ దలకుఁ దార్చి యతఁడు గొనఁగఁ,
బెద్దమనుసుదింతి ప్రియుఁ దన్నదయ్యెఁ; గ-
న్నీరు వెల్లివార నూరకేడ్చె, ౭౪

(౯౧౬)

ఆ. పట్టుమనుచుఁ బ్రియుఁడు పానపాత్రంబియ్య
మౌనముననె చెలికి దానినిచ్చి!
చెలువ మనసుపేర్మిచేఁ జెప్పకుండియుఁ
జెప్పినట్లె చేసెఁ జిత్తవికృతి. ౭౫

(౯౧౭)

ఆ. అతఁడు దానియింటికరుగవచ్చును; బ్రవే-
శింపవచ్చు; జెంతఁ జేరవచ్చుఁ;
జెప్పఁదగినదెల్లఁ జెప్పను వచ్చు;- నే
యుత్తరంబుఁ బడయు నొక్కొ యచట ! ౭౬

(౯౧౮)

ఆ. బొమలు ముడివడంగఁ బొలిచెడి క్రొత్తయం-
దాల నీదుమోము నాకుఁ జూపి
యుపకరించె నెంతయో నేఁగు నేఁజేయ-
కున్న తప్పుగూడ నోమృగాక్షి ! ౭౭

(౯౨౦)

ఆ. ఇచ్చవచ్చినట్టులెల్లఁ బల్కవు; పనుల్
చెప్పినపుడ చక్కఁ జేసి పెట్టె;-
దతివ ! యీవినీతగతులె తెల్పెడిని నీ
మనసులోన పాదుకొనిన యలుక. ౭౮

(౯౨౧)

క. తరుణివి; సొబగుల సొగసుల
బరణివి; సరికాని, మానభరమున మమ్మున్
గరకరఁబెట్టెదు, పాముం
బొరసిన చందనపుఁగొమ్మవోలెఁ, గుమారీ ! ౭౯

(౯౨౨)

ఆ. చక్క నిన్ను వాఁడు సవతాంధ్రసముఖంబు-
నందె 'కనికరింపు' మనుచు వేఁడెఁ;
జెలియ ! చేసికొన్న పొలయల్కకింతకు
నెక్కువైన లాభమేమి గలదు ? ౮౦

(౯౨౩)

క. వదులగు గాజులు పయికీ-
డ్చెదు; బాష్పము నెమ్మొగంబు డించి కనుల జా-
ర్చెదు; నిట్టూర్పులవడినాఁ-
పెదు; నీపొలయల్కతెలివి పెద్దది గదవే ! ౮౧

(౯౨౪)

ఆ. ఉఱక పొల్లయల్క పెరిమెలు మేకొని
పులకలొడలినిండఁ బోసికొనెదు;
నీదుగుట్టు తెలిసెనే పిల్ల ! యుదుటులొ
వానికౌఁగిళులకు వాచినావు ! ౮౨

(౯౨౯)

ఆ. ఎంతదాఁక దుఃఖమే తెచ్చు బహుసతీ
వల్లభునకుఁ జెలియ ! వలపు గొనమొ,
అంతదాఁక సౌఖ్య మందాఁక రతి యుండు;
వంతకెడము గల్గదంత దాఁక. ౮౩

(౯౩౧)

తే. అధరమును బ్రియుఁడానఁ గోపారుణంబు
కరఁగుచుండెడు ముగుదమొగంబు వాలిచెఁ,
ద్రావునప్పుడు మధుమదిరారసంబు
కొఱఁతవడుచుండు పలుగుఱాకోర వోలె. ౮౪

(౯౩౩)

క. బిగికౌఁగిటికై వలపుల-
మగఁడు తమిని గేలు సాఁప, మానినిమదిలోఁ
బొగసినయలుక వడిం బా-
యఁగఁదొలఁగె, నలంగి పోదుననుభీతిబలెన్. ౮౫

(౯౩౪)

ఆ. పొడువుఁ బఱపు దిటవుఁ గడుకొనఁ బొలయల్క-
కొండ నేఁ గుదిర్చికొంటిఁ గదవె !
వలపుకాని చూడ్కి కులిశంబునకు నది
సకియ ! విరిసి పడియె నైఁపలేక. ౮౬

(౯౩౫)

తే. అపుడు నాచెక్కిళుల నిల్పినట్టి చూడ్కి-
నొండుదెసకు మరల్పక యుంటివీవు!
అదియె నేను, నాచెక్కిళ్ళునవియె! కాని,
చూడుమిప్పుడు లేనిదాచూడ్కి యొకటె! ౮౭

(౯౩౯)

క. ఆమెప్పులకాయొప్పుల-
కామాటల తియ్యములకు నాయాశలకా-
ప్రేమలకును బరిణామం-
బేమందును సొగసుకాఁడ! యిట్లు ఘటిల్లెఁ. ౮౮

(౯౪౦)

తే. బూటకపుటల్కఁ బూనినప్పుడును నన్ను
నిజముగానల్గినట్టులె నీవు దేర్తు;-
వాదినంబులు గడచెనే యనుచు నిప్పు-
డడలెదను గాని, నీపయినలిగి కాదు! ౮౯

(౯౪౧)

తే. నిజము, తప్పింతయును లేదు నీది, యంద-
కాఁడ! నాపాడుకనులది గాని, యిందు;
అలుకకోర్వని నాహృదయంబునందు
దిటవుచాలనివివి నిన్నుఁ దెచ్చి నిలిపె. ౯౦

(౯౪౨)

తే. పొమ్ము వేగమె ! యేడ్పులూర్పులును నాకు
నొక్కతికె యవియన్నియు నుండనిమ్ము !
పాడుమొగమోటమునకు నాపడఁతిఁబాసి
వచ్చితివి; నీకునవి కల్గవలెనె యింక ! ౯౧

(౯౪౪)

ఆ. సిగ్గు చెడినవాఁడ ! ఛీ పోర ! దానినే
యనునయింపనేఁగు ! మదియ కాదె
తనదు కాలివ్రేలి తడిలత్తుకను నీకుఁ
దిద్ది పెట్టె నుదుటఁ దిలకసేవ ! ౯౨

(౯౪౬)

ఆ. అదియె నెలవుకొనియె మదిని; జూపులయందు
నదియె; కలలయందు నదియె నీకు !
నన్నుఁబోలు పాపినాఁతులకచ్చోట
సందు దొరకుబెట్టులంద కాఁడ ! ౯౩

(౯౪౭)

ఆ. ఎట్లు వచ్చు మాకు నేనుఁగుదంతాలు
పెద్దపులులతోళ్ళు బేరివాఁడ !
కలికిమొగముమీఁదఁ గదలు ముంగురులతోఁ
గోడలింటఁ దిరుగులాడుచుండ ! ౯౪

(౯౫౧)

---

(౯౧) నిన్నుఁబాసి నేను ఏడ్పులు ఊర్పులును అనుభవింతును. దానిని బాసినచో నీకవి తప్పవు. ఆ పాపము నాకేల - యని చెప్పుట.

(౯౨) కాళ్ళకు మ్రొక్కినపుడు తడిపారాణికాలితో అది నీతలను ద్రోసినదని, అట్టి దానినే సిగ్గులేక వలచుచున్నావని, భావము.

(౯౪) ఈ కోడలియందచందాలకు పరవశుఁడై కొడుకు దౌర్బల్యముచే జింకకుందేళ్ల వేఁటకు దిగినాఁడని చెంచుతల్లి నిర్వేదము.

తే. అంచపోతుల నోళుల నంచపెంట్లు
కొలికి తామరతూ(డుల( గొనెడి( గంపె!
అలరు విల్తుని యంపపోటులకు( జిక్కి
నెలయ గండ్లైన వానిగుండియల( బోలె! ౯౪

(౯౪౨)

ఆ. నిదురలేమి, చింత, నిట్టూరుపులు, మేను
సోలియుంట, పాలుమాలికయును,-
నిన్ను గూడ( జెలిచెనే చెలి! నాకొలి;-
కెంత భాగ్యహీన నేను జూడ! ౯౫

(౯౪౫)

ఆ. దయితమొగము( జూడ( దమకించు తెరువరి!
వేలుదారి(బట్టి వెడలి పొమ్ము;
కా(పు పెద్దకూ(తురీపాడుకొంపలో(
గలదు, మీలరాని గాలమగుచు. ౯౬

(౯౪౬)

తే. పూలు రాలినవేలుకో చాలు! కేల(
బట్టి వావిలికొమ్మ దుల్పంగ వలదు;
కా(పుకోడల! నీ మామగారి చెవుల(
బాడుగాజుల పెనుసద్దు పడినదిపుడు! ౯౭

(౯౪౯)

(౯౫) మధ్యవర్తినియైన చెలికత్తె నాయకునికి తానే వలపుకత్తె యైనది. నాయిక అగుట్టు పైచిహ్నములచేత నూహించినది. 'నాకుపకరింప(బోవు క్రమముచే నీవును నావలె కష్ట పడుచున్నావే, ఎంత దౌర్భాగ్యము నాది!' అని వ్యంగ్యముగా ఎత్తిపొడిచినది.

(౯౭) వావిలి పొదలోని విహారము గాజుల గలగలకు హేతువు. మామగారది విని విచారణకు దిగకుండునట్లు, కొమ్మను పూలకొలకు దుల్పివ సద్దుగా సూచించి చెలికత్తె నాయికను రక్షించినది.

ఆ. కడవ చంకలోన నిడుకొని చెలి ! మోము
ద్రిప్పి దారివెంటఁ దేరికనుచుఁ,
జూడకుండ నిల్లు చొఱఁబోయి 'అయ్యయో !
పగిలి పోయె' ననుచుఁ బొగులనేల ? ౯౯

(౯౬౦)

తే. విందుగుడువంగ వచ్చిన వెలఁది నిప్పు-
డేమి యన్నదొ నీదు పెండ్లాము ! కాని,
చూడు మేడ్చెడిఁ బెరటిముంజూరుక్రింద !
దానినోదార్పు మేఁగి యందాలమఱఁది ! ౧౦౦

(౯౬౩)

---

(౯౯) ఈభాగమందలి ౫౧ వ గాథ ఇదే సందర్భమున దీనికి తర్వాతఁ జెప్పినదనఁ దగును.

(౧౦౦) మఱఁది విలాసవిహారములయెడ వదినెకుఁ గల యభినివేశమునీమాట ధ్వనింపఁజేయుచున్నది.

శ్రీ

శాలివాహన

# గాథా సప్తశతీ సారము

## 4 వ భాగము

తే. పోవలవదింక మరలు ! నీపుణ్యమగును !
తెలిమొగము వెన్నెలలఁ జీఁకటులు దొలంగె;
మగలఁ జేరంగఁ జను పెఱమగువలకును
అడ్డమై దాఁపురించెదవగడుపడుచ ! ౧

(ధ్వన్యాలోకము. ఉద్యోతము ౧. పు. ౨౧)

ఆ. అలిగినప్పు, డలుక వెలిసినప్పుడు, సంత-
సించి నవ్వునప్పు, డేడ్చునపుడు-
నెపుడు చేరఁజనిన నపుడె వెల్లాటపుఁ-
గులుకులాండ్రు చూఱగొండ్రు మదిని. ౨

(పై. ఉ. ౧, పు. ౫౨)

---

ప్రాచీనాలంకార గ్రంథములలోనివి, శాలివాహనుఁడు సప్తశతికి సంగ్రహించిన గాథల జాతికిఁ జేరినవి, కొన్నిటిని సంగ్రహించి తెలిఁగించి యీభాగమునఁ జేర్చినాను. వీబరు పండితుఁడును అట్టివి ౩౫ గాథలను ఏర్చి తన ప్రతిలోని గాథలసంఖ్యను సహస్రమునకు సరిచేసినాఁడు; ఆకరమును చూపలేదు.

(౧) ఈనాయిక తమోభిసారిక; చీఁకటి దట్టముగా నున్నపుడు ఎవరును చూడకుండ ప్రియుని జేరఁబోవు సాహసిని. ఆమెముఖకాంతులను మెచ్చుకొనుచు కుంటెనకత్తె కువాదముగా నవ్వుమాట యిది.

ఆ. క్రొత్తవధువు గబ్బిగుబ్బలపై నెల-
దీఁగఁ బ్రియుఁడు మెల్లఁ దీఁడినట్టి
దెబ్బ చిన్నదయ్యుఁ దీఱని పెనునొవ్వు
గలుగఁజేసె సవతిచెలుల యెదల. ౩

(పై. ఉ. ౧; పు. ౫౨)

ఆ. ఆదరించి సహృదయాళి చేపట్టిన
యపుడె యెల్లగుణములంకురించు;
తరణి కిరణములను దడవినప్పుడు గదా,
తమ్మిపూవులగును దమ్మిపువులు ! ౪

(పై. ఉ. ౧, పు. ౬౨)

ఆ. చెందిరంపుఁబూఁతచేఁ బొల్చు రిపుమత్త
కలభకుంభములకు వలచినంత,
వలవదెపుడు వీరవరుచూపు, ప్రియకాంత
కుంకుమలఁదుకొన్న గుబ్బలకును. ౫

(పై. ఉ. ౨, పు. ౧౧౧)

ఆ. దారికేల యడ్డుదగిలెదు, తొలఁగి పో !
సిగ్గులేదె ? తెల్విచెడినవాఁడ !
వట్టియిల్లు వదలి వచ్చితి; నెవరుఁ గా-
వలికి లేరు; పోవవలయు వేగ ! ౬

(పై. ఉ. ౩, పు. ౧౫౫)

---

(౪) ఇది ఆనందవర్ధనుఁడే రచించిన 'విషమబాణలీల' లోనిదఁట.

(౬) ఇంటికే వచ్చినచో స్వచ్ఛందముగా నుండవచ్చునని ఆహ్వానము ధ్వనితము.

తే. ఒక్కయెడఁ గూర్చుసతి యేడ్చుచున్న యులివు;
సమరసన్నాహతూర్య ఘోషమొకవంక
ప్రణయమునకును రణరసంబునకు నడుమ
నూఁగులాడఁగఁ జొచ్చెను యోధమనసు. ౭

(పై. ఉ. ౩, పు. ౧౭౩)

ఆ. అడ్డదారిఁ బుట్టినది; పండ్లుఁ బూవులా-
కులును లేవు; చూడ గోము లేదు,-
రేఁగుఁబోదరు; నవ్వరే నిను! దీనికి
వేయనేల కంచె వెట్టివాఁడ! ౮

(పై. ఉ. ౩, పు. ౨౧౯)

ఆ. కానివైనయట్లు, లేనివి యున్నట్లు,
వింతయర్థములను వెదకి చూపి
మనసులందు నెలవుకొనఁ జేయు కవుల విం-
గడపుఁబల్కు వెలయుఁగాక సతము! ౯

(పై. ఉ. ౪, పు. ౨౩౬)

ఆ. ప్రాయమెలమి మీఱి చేయూఁత యొసఁగంగ
నీదుగుబ్బదోయి మీఁదికెదిగి,
తరుణి! నిన్నుఁజేర నరుదెంచుపూవిల్తు
లేచి యెదురుకొనెడు లీలఁ దోఁచె. ౧౦

(పై. ఉ. ౪, పు. ౨౩౬)

---

(౮) అన్యాపదేశము. పనికిమాలినదానిపై ఇంత మక్కువ చూపుచున్నావని ఆక్షేపము అంతరార్థము.

(౧౦) ఎలమి - లేఁతతనము. ఇదే ఇళమై, ఎళమె అని తమిళకన్నడములలో కలదు. సంతోషము. వికాసము మొదలగునర్థములు తాత్పర్యపర్యవసితములు.

ఆ. వానికెందు మేరగానము; పునరుక్తి-
దోషమించుకైనఁ దోఁపదందు,-
వలపుఁజెలులు సూపు వగలును సుకవుల
పలుకులిచ్చునర్థములును జూడ. ౧౧

(పై. ఉ. ౪. పు. ౨౪౧)

ఆ. పెద్దపేరు సూచి బేలువోదురు గాని
గుణము వలచి మెచ్చుకొనరు జనులు;
చెలియమోము గాంచి చెమ్మవెట్టదు గాని,
చలువఱాయి కరఁగుఁ జంద్రుఁ జూచి ! ౧౨

(మహిముని వ్యక్తివివేకము; విమర్శము ౩, పు. ౧౩౭)

ఆ. పలుకులవియె; కన్నుఁగొలుకులు నవియె! లేఁ-
బ్రాయమదియె కాని, పడఁతి కిప్పు-
డించువిల్తులచ్చి యించుక నెమ్మేనఁ
జేరి యన్ని క్రొత్తసేసి పెట్టె ! ౧౩

(ధనికుని దశరూపవ్యాఖ్య. పు. ౮౪)

ఆ. మొగడ చన్నుదోయి మొలచినంతటఁ జూడు !
దానిమేననెల్లఁ దళుకుబెళుకు-
లెట్లు వెల్లివిరిసె, 'నిది చిన్నదా ?' యంచుఁ
జాలఁ జెలులుగూడ సంశయింప ! ౧౪

(పై. పు. ౮౫)

---

(౧౩-౧౪) ఈరెండును ధనికుని సొంతపు రచనలే.

ఆ. చెలువు జవ్వనంబు వలపు విలాసంపు-
సొంపు జాణతనము సుఖము దుఃఖ-
మొక్కరీతిఁ గలిగి యుండువారు లభింతు-
రొక్కరీతిఁ బున్నెమున్నఁ జూవె! ౧౫

(భోజుని శృంగారప్రకాశము. ప్రక. ౨౨, ప. ౭౭)

తే. రూపమెట్టిదియైన, నాలాపమెట్టి-
దైనఁ, గైసేఁత యెట్టిదియైనఁ, బ్రాయ-
మెక్కివచ్చెడు పడఁతులదేని దాని
యందమదియేమొ యొక క్రొత్తయై తనర్చు! ౧౬

(పై. ౨౨-౮౬)

తే. ఒక్కకనుబొమ మీఁదికి నిక్క, నలఁతి-
నగవు పలుమొగ్గవెన్నెల నలువులీన,
నెవరి మనసును బల్మి హరింపదాకు-
రంగలోచన చూచెడు దొంగచూపు! ౧౭

(పై. ౨౨-౧౯౬)

ఆ. ఎవ్వరేని నిలిచిరెదుట వారలె చొచ్చి
యతుకుకొంద్రు లోన నద్దమందుఁ-
బోలె నెవరిచిత్తమున, వారికిదె నమ-
స్కారమిడుదు జారకామినులకు! ౧౮

(పై. ౨౨-౨౦౪)

క. విసమగుఁ గొందఱకు; నమృత-
రసమగుఁ గొందఱకుఁ; గొందఱకు నమృతంబున్
విసమునగుఁ; గొందఱకు మఱి
విసమును నమృతమును గాక వెడలును బ్రదుకుల్. ౧౯

(మంఖుకుని అలంకారసర్వస్వము, పు. ౬౭)

తే. రేఁగుపండ్లొండొకటిపయి రెండు పెట్టి
బోడితలపయిఁ దడవు నిల్పుకొనఁ జనెదు!
పోర! పోకిరి! నిను నీవ మోసగించు-
కొనెదు; మఱి జాణలేల లోఁగుదురు నీకు? ౨౦

(పై. పు. ౮౩)

ఆ. నియతిగరిత యెపుడు నిలువక పయనంబు
పోవుచుండు కాలపూరుషునకుఁ
జద్ది గట్టి యిచ్చుసమయంబునకుఁ గొఱ-
గాని యురువులెందుఁ గాని లేవు. ౨౧

(పై. పు. ౧౨౩)

ఆ. సామి! కొంతయాఁగి చనుము; నీవిరహంపుఁ
జింతఁజేసి గుండె చెడిన మనసు
గొంత కుదుటఁ బెట్టుకొని చెప్పుదును,- కాక
యిట్లె పొమ్మ! చెప్పనేమి గలదు! ౨౨

(పై. పు. ౧౪౦)

ఆ. పాడుగుడులు గలవు; ప్రక్కలఁ బెనుఁబొదల్
గలవు; వయసుమగలు గలరు చాల;
మగఁడు ముసలియనుచుఁ బొగులకు; నినుమంచి-
యూరె చూచి యిచ్చినారు బిడ్డ! ౨౩

(వాగ్భటుని కావ్యానుశాసనము; అధ్యా. ౩)

---

(౨౦) రేఁగుపండ్లు = గుండురేఁగువి; గంగరేఁగువిగావు. 'నీవు నావంటిదానిని వశము చేసికొనుకోరిక అట్లు అసాధ్యమైనది' అని ఒకధీరనాయిక ఒకచపలచిత్తునితో నాడినమాట.

(౨౧) నియతి = విధి. కాలము నిలువదు. అది వచ్చినపుడు తలవ్రాఁత ప్రకారము, పిన్న, పెద్ద, ఆడు, మగ మొదలగునేవివక్షయులేక అందఱును దానికాహారము గావలసినవారే.

(౨౨) 'నీవంటి నిర్దయునకేమిచెప్పిన నేమిఫలము?' అని తాత్పర్యము.

తే. పచ్చనాకుల గుబురుజొంపముల నీడ
కడలఁ బర్వించి, కృష్ణపక్షమును బోలి,
యూరిసొమ్మైన పెనుమఱ్ఱి యుండుదాఁక,
నిండుజాబిల్లి ! యెవరు గణింత్రు నిన్ను ! ౨౪

(పై. అధ్యా. ౩)

తే. అఱుకుతోఁ బ్రోచుకొనుచుండవలయు, నెచ్చె-
లులకునైనను వెలివెట్టనలవి గాదు,
పెరుగునట్లెల్లఁ దాపంబుఁ బెంచుఁ,-బిసిని
వారలధనంబు, జారగర్భంబు వోలె. ౨౫

(శోభాకరామృతకవి, అలంకారరత్నాకరము; పద్యము ౧౭)

క. ఒడలను బులకలు, మోవిని
వడఁకులు, సీత్కృతులతోడి పలుకులుఁ, బ్రియకాం-
తుఁడు దెచ్చునెల్లవగలి-
క్కడ సతులకుఁ జేసె శీతకాలము గంటే ! ౨౬

(పై. ప. ౪౧)

క. మ్రొక్కెదము నిదురతల్లికిఁ;
చక్కంగల కోటిదేవతలు మాకేలా ?
యెక్కడ దవ్వుల నున్నను
జిక్కెడు నాతల్లికరుణచేఁ బ్రియుఁడు కలన్. ౨౭

(పై. ప. ౧౦౧)

---

(౨౪) చీఁకటి రాత్రులందువలె సదా సంకేతస్థానమగుటకు తగినదామఱ్ఱిమ్రాను. వెన్నెలకాలమని యీయూరి జారవనితలు భయపడరని భావము.

ఆ. జవ్వనంపుఁ బెంపు, సంపద, జాణల
తోడిచెలిమి, వలపుదొలఁకు దయిత,
నవవసంతవేళ - యివియపో స్వర్గము !
వట్టికథలు తక్కినట్టివెల్ల ! ౨౮

(పై. ప. ౧౪౦)

ఆ. కడుపుఁజిచ్చులేని కవి, నాగుఁబాముల-
యండలేని లిబ్బి, కొండెకాఁడ్ర-
రట్టు తొలఁగినట్టి రాజును. నిండు పు-
న్నియము లేక దొరకనేరరిలను. ౨౯

(పై. ప. ౨౧౦)

ఆ. కాదు రూపు, కులముగాదు, గుణంబును
గాదు, నేర్పుగాదు, కలిమిగాదు;
ఇట్టి యేమికతమొ, యెవరికో, యెవ్వరి
యెడనో, ప్రేమరసము పొడముచుండు ! ౩౦

(పై. ప. ౨౮౧)

ఆ. తరణిమండలంబుదాఁకను పాతాళ-
పంకలేశములను బాఱఁజిమ్మి
యందునొక్కమచ్చ యతికించు నాదివ-
రాహమూర్తి యూర్పులకు నమస్సు ! ౩౧

(పై. ప. ౩౨౪)

(౩౧) చంద్రునియందు మచ్చగలదు. వానిసైదోడు సూర్యునికి లేకుండుట తగదు. ఆదివరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరింప సముద్రముఁ జొచ్చి నిశ్వాసము విడువఁగా పాతాళపుబురద ఆకాశమున కెగరి యీలోటు తీర్చినది.

తే. వలసపోయినవానితొయ్యలి యదేమొ !
నిండు పున్నమరేయి చందిరుని జూచి,
చిత్తరువులోని శ్రీహరిచేతి చక్ర-
మందుఁ బఱపె రోషారుణమైన చూడ్కి ! ౪౦

(పై. ప. ౫౬౦)

ఆ. ఇంతికాళ్ళ దొరలి యెట్టకేనియు గడి-
యించుకొన్న దాని మంచితనము-
నీవె చెఱుచుకొంటివేమిర ! పెడతలఁ
బెట్టి తెలివి, మాఱుపేరఁ బిలిచి ! ౪౧

(పై. ప, ౬౬౬)

ఆ. విరహమునఁ గృశించి వేఁగుదానికి నొక్క-
పెట్టి తెల్పవలదు ప్రియుని రాక
మీరు; సంతసంబు మేరమీఱినవేళఁ
జచ్చునెవతె యదియుఁ జచ్చినదియ ! ౪౨
(నరేంద్రప్రభసూరి అలంకారమహోదధి. తరంగము ౩. ప. ౧౨౪)

క. చెలి ! చెపుమ ! వానివెంటనె
తెలవాఱఁగ నేను నేఁగితినె ? బాష్పములన్
గలఁగిన మొగమున నింకే-
వెలఁదియొ యగపడెడుఁ జూడవే యద్దమునన్ ! ౪౩
(పై. త. ౩, ప. ౧౪౮)

---

(౪౦) రాహువు శిరస్సును కత్తిరించినదిచే. అట్లుకానిచో చంద్రునినతఁడు పూర్తిగా మ్రింగివేసి యుండునని, వియోగకాలమందు వీనిబాధ యుండియుండదని, కోపమామెకు.

(౪౩) పొలయలుకను తేర్చుటకెంతో ప్రయత్నించి ఫలముగానక విసిగి అతఁడు వెడలి పోయినాఁడు. తాను గట్టిమనసుతో నున్నానని నాయిక నమ్మినది. కాని అద్దములో చూచుకొన్నప్పుడు తనయేడ్పును ముఖవికారమును గానవచ్చి గాబరాపడినది. అప్పటి చెలితోడి మాటయిది.

ఆ. బేలు జింక; యెంత విసిగించినవొ దాని-
మనసు పాడుబెండమావులకట !
నీరు నిజముఁగాగ నిండిన యేఱుల-
దెసకుఁగూడ మొగము ద్రిప్పదిపుడు ! ౪౪

(పై. త. ౮, ప. ౬౯౦)

ఆ. కొమిరె వయసు తిమురు గొని పచ్చిపచ్చిగఁ
బలుకుచున్న పల్లెపడుచుఁ జూచి,
చెవులు మూసికొనుచుఁ జెంగటియిల్లాండ్రు
వినఁగలేక తొలఁగిచనిరి చూడు ! ౪౫

(సింగమనేని రసార్ణవసుధాకరము; విలాసము. ౨. పు. ౧౦౬)

ఆ. ఇంటిపొంత పొదలనెల్లఁ గాల్చుచునుండు
మామగారిఁ జూచి మనసు విఱిగి,
యెన్నిమాఱులఱచుచున్నను గోదలి-
కత్తమాట చెవులనైనఁ బడదు ! ౪౬

(పై విలా. ౨. పు. ౧౨౨)

ఆ. అలుకవచ్చినప్పుడంతగా నను వీఁపు-
దట్టి రేఁపినట్టి దిట్టతనము,
వానిఁ జూచి బేలువడినయప్పుడు చూడు,
చెలియ ! మఱుఁగువడియెఁ జెప్పకుండ ! ౪౭

(పై. ఉల్లా. ౪, పు. ౧౦౮)

---

(౪౬) సంకేతస్థానము వశించెనని యాపిల్ల దుఃఖము: నిరాదరణ. (ఈగాథ సింగ భూపాలుఁడు తానే రచించినదిగా "యథా మమైవ" అని వెంకటగిరి తెలుగుముద్రణమున నున్నది. కాని అది నిజముకాదు. పు. ౮౬.)

ఆ. 'సొమ్ము చాలఁగలఁడు; సోమారులకు మేటి;
పోకిరీలకెల్లఁ బోటుమగఁడు;
అతనిఁ గంటె బిడ్డ!' యని చెప్ప విన్నంత-
నతివకనులు చేరెఁడంతలయ్యె. ౪౮

(పై. ఉ. ౪, పు. ౧౧౯)

క. ధీరులకు దుర్జనవ్యవ
హారంబులు దారుణంబులగు; నట్లైనన్
వారల జతనములింతయు
మాఱవు హృదయమను మిత్రుమన్నన గనుటన్. ౪౯

(పై. ఉ. ౪, పు. ౧౩౧)

తే. నిండు పున్నమనాఁటి చందిరునకంద-
కాఁడ! యేమౌదువీవు? నిక్కంబు నెపుమ!
యెవతె, మునిమాపునిసివోలె, నిపుడు నీదు-
సోయగము గొన్నయది తనసొమ్ముగాఁగ? ౫౦

(పై. ఉ. ౪, పు. ౧౩౮)

---

(౪౮) ఈమె వేశ్య. అట్టివిటుని తాను వశముచేసికొన్నచో అర్థకామములు రెండును పూర్తిగా సిద్ధింపఁగలవను నుత్సాహమును చూపినది.

(౪౯) ఎవరెంత విరోధించినను తమ హృదయమునకు నచ్చినపనిని ధీరులు పదల రనుట.

ఆ. తెల్లవాఱఁ జెమటదీయించుకొన్నాఁడు;
ఒడలు గడిగినాఁడు; కుడిచినాఁడు;
పల్లెకాఁపు, దివసవారతారలు జోస్యు-
నడుగ మెల్లమెల్ల వెడలినాఁడు ! ౫౧

(పై. ఉ. ౭, పు. ౨౩౭)

తే. మిగులఁ గూర్చిన తనదొంగమగని మొగము
గురుజనంబులనడుమఁ గన్గొన్నయంత,
నెలఁతమదికనిపించె 'నన్నిటిని వదలి
యడవికెందైనఁ బోవుదునా !' యటంచు. ౫౨

(పై. ఉ. ౭, పు. ౨౬౫)

ఆ. జుమ్ము జుమ్మటంచుఁ జొచ్చి చచ్చెదు తేఁటి !
ముండ్లు నిండియుండు మొగలిపొదల !
జాజిపూవుతోడ సరివచ్చుపువు నీకు
దొరకదెంత దిమ్మఁదిరుగుచున్న ! ౫౩

(పై. ఉ. ౧౦, పు. ౧౧౬)

తే. సింగముల జూలు, లోభులచేతనున్న
పసిఁడి, పెనునాగుఁబాములపడగ మణియు,
కులవధూరత్నముల కుచంబులును - దాఁక
వచ్చునెట్టులు మేనిలోఁ బ్రాణముండ ? ౫౪

(పై. ఉ. ౧౦, పు. ౩౪౪)

---

(౫౧) 'చెమట దీయించుకొనుట' రాయలసీమలోని దేశినుడి. భద్రాకరణమర్థము. ఇది 'చెమట' గాదు 'చిమటా' కాఁబోలునని యొక మిత్రులన్నారు; కాఁబోలును.

ఆ. గాయపడినవారికే యగు నొప్పియు
నెనెడు పలుకసత్యమయ్యె నిపుడు;
చెక్కులందుఁ బంటినొక్కులాచెలికిఁ గ-
ల్గంగ నొప్పి సవతులకు జనించె! ౫౫

(పై. ఉ. ౧౦, పు. ౩౭౫)

ఆ. చెలువ! యిందురమ్మ! చెడునింద యొండు జ-
నించె నీకు; నాలకించి పొమ్మ;
చాటుచున్నవారు చంద్రుఁడు సరియంచు
మోటుజనులు నీదు మోముతోడ! ౫౬

(పై. ఉ, ౧౦, పు. ౩౮౩)

ఆ. మేనిమెఱుఁగులెందు మిసమిసలాడఁ, బ్రా-
యంపుమగల మనసులన్ని దోఁచి,
యందునిందుఁ దిరుగులాడెడు దీని నీ-
పల్లెటూర నాఁగువారు లేరు! ౫౭

(పై. ఉ, ౧౦, పు. ౩౮౯)

ఆ. అన్ని యింద్రియములకాప్యాయనంబయి
సరసకావ్యమందు జాలువాఱు
పనితనంపుమెఱుఁగు పాతికపాలైనఁ
గనము వినము వేఱుకడలనెందు. ౫౮

(పై. ఉ. ౧౦, పు. ౩౯౪)

క. కవివదనాంబురుహంబుల
నివసించుచు, ముసలిమగని నేర్పుల నవ్వన్
దివిరిబలెఁ, గ్రొత్తతెలుఁగుల
భువనంబులు సూపు పలుకుపొలతిఁకి జేజే ! ౫౯

(పై. ఉ. ౪, పు. ౧౦౬)

తే. చనవుమెయి నిరుగేలఁ బట్టిన యశోద-
గుబ్బపాలింటిమొన మోవిఁ గూర్చువేళఁ,
బాంచజన్యము మదిని దలంచుకొన్న
ముద్దుకృష్ణు గగుర్పాటు మ్రొక్కుఁడీరు ! ౬౦
(గోవిందుని కావ్యప్రదీపము ఉల్లా. ౧౦, పు. ౩౮౨)

○○○○○○○○

---

(౫౯) చతుర్ముఖుఁడు 'ధాతా యథాపూర్వమకల్పయత్' అని శ్రుతి చెప్పినట్లు ప్రాఁత త్రోవలనే సృష్టినడపు పురాణపురుషుఁడు. సరస్వతి నిత్యయౌవనశాలిని. కనుక భర్తను పరిహసించుటకేమో క్రొత్తక్రొత్త రీతుల సృష్టిచేసి పెట్టుచున్నది - అని యుత్ప్రేక్ష.

(౬౦) పాంచజన్యము శ్రీవిష్ణుపంచాయుధములలో రెండవదగు శంఖము. ఆపరమపురుష లీల వదలి యీబాలలీలలు చేయుచున్నందుకు విస్మయముచేత ఆతనికే గగుర్పాటు.

(౫౮, ౫౯ వ పద్యములు రెండును కావ్యకళాప్రశంసకై మంగళమునకై క్రమము మార్చి చేర్పనైనది.)

శ్రీ

# అనుబంధము ౧

ఇందలి గాథాకవుల పేళ్లు లభించినంతవఱకు అకారాదిగా ఆయాగాథల సామాన్యసంఖ్యతో ఇందమర్పఁబడినవి.

* ఈ గుర్తుగలవారు స్త్రీలు.

౧ అంగరాయఁడు (గా. సం) ౨౩
౨ అంధుఁడు ౧౯౫, ౧౯౬
౩ అజయుఁడు ౩౬౬
౪ అజ్జుణుఁడు - (అర్జునుఁడు) ౨౦౧, ౪౨౭.
౫ అట్టరాజు ౩౪౩
౬ అణం (వం) గుఁడు ౨౫, ౧౪౯, ౪౪౬, ౪౪౭.
౭ అణిరుద్ధుఁడు ౩౭
౮ అణురాయుఁడు ౫౧, ౯౫, ౧౦౬.
౯ * అణులచ్చి ౧౮౨, ౨౧౦.
౧౦ అణ్ణాయుఁడు ౨౫౯
౧౧ అత్థుఁడు ౨౯౯
౧౨ అద్ధరాయఁడు ౨౦, ౧౭౨, ౧౮౭.
౧౩ అనుత్సాహకుఁడు ౪౩౪
౧౪ అమియుఁడు ౩౪
౧౫ అరికేసరి ౧౨౨, ౧౭౪.
౧౬ అలక్కుఁడు ౨౨౬
౧౭ అలయుఁడు ౮, ౫౪.
౧౮ అల్లుఁడు ౩౦౫
౧౯ అవంతివమ్మ ౨౫౦, ౨౫౧.
౨౦ అవణ్ణాంగుఁడు ౧౧౫
౨౧ అవటంకుఁడు ౨౮
౨౨ అవణాయరుఁడు ౨౨౮
౨౩ అవియకణుఁడు ౮౦.
౨౪ అసమసాహుఁడు ౧౮౪
౨౫ * అసులద్ధి ౧౩౯, ౧౪౦.
౨౬ అహోయుఁడు ౨౮౦
౨౭ అహాయుఁడు ౨౬౨, ౨౬౩.
౨౮ అహరాయఁడు ౧౨౯
౨౯ ఆయివరాహుఁడు ౬౪
౩౦ ఆహవసత్తి ౧౪౩
౩౧ ఇందీవరుఁడు ౪౩౨
౩౨ ఇందుఁడు ౮౬
౩౩ ఇంద్రరాజు ౪౩౦
౩౪ ఈశ్వరుఁడు ౩౮౯, ౩౯౦.
౩౫ ఈసాణుఁడు ౬౩
౩౬ ఉజ్జయుఁడు ౯౭
౩౭ ఉద్ధవుఁడు ౨౦౫
౩౮ ఉల్లోలుఁడు ౩౪౨
౩౯ కంకణతుంగుఁడు ౩౩౪
౪౦ కంతేసరుఁడు ౪౯
౪౧ కజ్జలరాజు ౩౫౨
౪౨ కటిలుఁడు ౬౧
౪౩ కద్దిల్లుఁడు ౩౨౨
౪౪ కణ్ణవుత్తుఁడు ౯౪
౪౫ కణ్ణుఁడు ౪౨
౪౬ కమలుఁడు ౮౮

శ్రీ

# అనుబంధము ౨

## పద్యముల అకారాది పట్టిక.

## తాళ్ళపాక అన్నమాచార్యులు

తిరువెంగళనాథుమీఁద విన్నపము చేసిన శృంగారకీర్తనలు.

### అల్లోనేరేళ్లు.

(నాలుగేసి మాత్రల నాలుగు గణములు.)

రాగం, దేసాళం.

పల్లవి.

నెయ్యము లల్లో నేరేళ్ళో।
వొయ్యన వూరెడి వువ్విళ్ళో॥

చరణము.

పలచని చెమటలు - బాహుమూలల
చెలమలలోనాఁ - జెలువము లే।
దళదళమనుము - త్యంపుజె అంగు
దులిపెటి నీళ్ళా - తుంపెళ్ళో॥ ——నెయ్యము

తొటతొటఁ గన్నుల - దొరిగెడి నీళ్ళా
చిటిపొటి యలుకల - చిరునగవే
వటఫలంబు నీ - వన్నెల మోవికి।
గుటకల లోనా - గుక్కిళ్ళో॥

గరగరికల వేం - కటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చన లూ।
మరుని వింటికి - మ్మనియంప విరుల
గురితాకూ లినుప - గుగ్గిళ్ళో॥

శోభనము. రాగం, వసంతం.

పల్లవి.

శోభన మేశోభన మే
వైభవ ములపా వనమూ ర్తికి॥

చరణము.

అరుదుగ మునునర కాసురు డూ
సిరులతో జీరలు దెచ్చిన సతులా
పరువపు వయసుల పదారు వేలను
పొరిదిబెం డ్లాడిన సుముఖుని కి॥
చెండిన వేడుక శిశుపా లుండూ
అది పెం డ్లాడగ నవగళించి
విందువలెన తా విచ్చేసి రుక్మిణి
సందడి బెండ్లా డిన సరసునికి॥
దేవదానవులు ధీరతను
దావతిపడివార్ధిా దరువంగను
శ్రీవని తామణి జెలగి పెండ్లాడిన
శ్రీ వెంకటగిరి శ్రీనిధికి

సువ్వి. కేదారగౌళ.

పల్లవి.

సువ్వీ సువ్వీ సువ్వా ని
సుదములు దంచెద రో—లాల

చరణము.

వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగనిం చో (ఓ)-లాల

కనుస న్నలనెడి-రోకం-డ్లానూ
కన్నులు దంచెద-రో-లాల

బంగరు చెఱగుల-పట్టుపు ట్టముల
కంగులు దూలగ-నో-లాల

అంగన(నా) లందఱు(ఊా)-నతివేడుకా-తో
సంగడి దంచెద-రో-లాల.

కురులుదూలగ మంచి-గుబ్బచన్నూలపై
సరులుదూలాడంగ-నో-లాల
అరవిరిబాగుల-నతివలు ముద్దులు
గురియుచు-దంచెద-రో-లాల.

ఘల్లుఘల్లుమని-కంకణరవములు
పల్లవపాణులకో-లాల
అల్లన నడుములు-అసియాడుచు-సతు
లొల్లనె-దంచెద-రో-లాల ॥

కప్పురగంధులు కమ్మనిపువ్వుల
చప్పరంబులనే-ఓ-లాల
తెప్పలుగారతి దేలుచుఁ గోనే
టప్పనిం బాడెద-రో-లాల ॥

ఉయ్యాలపాట. రాగం, శంకరాభరణం.

పల్లవి.

ఉయ్యాల బాలూ నూచెదరూ-కదు
నొయ్యనొయ్య నొయ్యనుచూ ॥ ఉయ్యా.

చరణము.

బాలయవ్వనలు, పసిండి వుయ్యాల
బాలునివొద్దం బాడేరు ।
లాలిలాలిలాలి, లాలెమ్మయెల్ల
లాలిలాలి లాలెనుచు ॥

తమ్మిరేకుగను దమ్ముల నవ్వుల
పమ్మంజూపుల బాడేరు ।
కొమ్మలుమట్టుగునుకుల నడపుల
ధిమ్మిధిమ్మిధిమ్మనుచు ॥

చల్లంజూపుల జవరాండ్రు రే
పల్లె బాలునిం బాడేరు
బల్లిదు వేంకటపతిజేరియుందెలు
ఘల్లుఘల్లు ఘల్లనుచు ॥

గొబ్బిళ్ళపాట. రాగం, దేసాళం.

పల్లవి.

కొలనిదోపరికి - గొబ్బిళ్ళో - యదు
కులము సామికిని - గొబ్బిళ్ళో

చరణము.

కొండగోడుగుగా - ఆవులగాచిన
కొండొక శిశువుకు - గొబ్బిళ్ళో
దుండగంపుదై - త్యులకెల్లను తల
గుండుగండనికి - గొబ్బిళ్ళో ||

పాపనిధుల శిశు - పాలుని తిట్టిన
కోపకానికిని - గొబ్బిళ్ళో
యేపున కంసుని - యిడుముల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో ||

దండి వైరులను - తఱిమిన దనుజుల
గుండె దిగులునకు - గొబ్బిళ్ళో
వెండి పైడియగు - వేంకటగిరిపై
కొండలయ్యకును - గొబ్బిళ్ళో ||

---

అత్తా కోడళ్ళ జగడము. రాగం, పాడి.

రావే కోడల - రట్టడి కోడల
పోవే పోవే-అత్తయ్యా-పొందులునీతో-జాలూనూ

చరణము.

రంకెలువేయుచు - రాజునెదుట నీవు
కొంకూ గొసరూ - లేసి - కోడాలా|
పంకజముఖి - నీవు పలు దొడ్డవారిండ్ల
అంకెల దిరిగేవు - అత్తయ్యా ||

ఈడాడ, నలుగురు - నేడ్డురు మగలతో
కూడీ - శిగ్గూ - లేనీ - కోడాలా
వాడకు బదుగురి - వలపించు - కొనిసీవు
ఆడాడ - దిరిగేవు - అత్తయ్యా.
బొడ్డున బుట్టిన - పూపనికే నిను
గొడ్డెరు తెస్తీ - నే కోడాలా
గుడ్డముపయినున్న - కోనేటిరాయుని
నడ్డగించుకొంటి - వత్తయ్యా.

---

గయోపాఖ్యాన నాటకములోని యొక "దరువు"
రాగం-తోడి, ఆదితాళం-ఇది "ఏలా" లక్షణము
కలదై యున్నట్లగపడుచున్నది.

"నందివాహను డగుచువచ్చే నూ - గౌరీశు డిదిగో
నందివాహను డగుచువచ్చేను.

నందివాహను డగుచువచ్చెను-నందనందనుడైన యా గో
విందునకును పురందరప్రియు నందనునకును, సంధిసేయగ
(నంది)

జడలలోమిన్నేరు సగము నొడల పార్వతి మెరయుచుండగ
బుడుత చందురు నందముగదల పువ్వుగను సిగదురిమి వేగము
(నంది)

కరమునను శూలంబు మూడవ కన్ను ఫాలమునందు మెరయగ
వరదుడా శ్రీ వెంకటంపలె-వాసుడౌ శ్రీ విష్ణుకడకు (నంది)

## శోభనము.

(మృత్యుంజయ విలాసము-గోకులపాటి కూర్మనాథ కవి.)
(ఐదేసి మాత్రల గణములు)

శోభాన మే - శోభాన మే

శోభనమె - శర్వునకు, శోభనమె - పార్వతికి
శోభనమె కైలాస, శుభమంది - రునకూ (శోభాన మే)

మణికతుల-హారతులు, మదవతులు ఇయరమ్మ.
మతియుతుడు-శివ్వన్న, మగువగా-రమ్మాకు (శోభాన మే)

## సుగ్రీవవిజయము.

శ్రీరాముడు-గుణధాముడు, వారిజదళ లోచనుడూ
శూరతరా-వనుగూలిచి, నారీమణి-దేవలయున్ (శోభాన మే)

రామునికృప కపిరాజ్యము క్షేమంబున బాలించీ
శ్రీమంతుడు సుగ్రీవుడు, భూమండలి పొగడొందున్ (శోభా)

సంగరవిజ యముతోన-ప్పొంగెడు సుగ్రీవునకు
సంగతిగా యువరాజై యంగదుడిల బెంపొందున్ (శోభా)

## కొట్నముల పాటలు.

చెలియారావె, చేడెరావె, చిన్నిరావె, పొన్నరావె
వెలదిరావె, కొట్నమూలు, వేగదంచుమూ.

గరుడవాహ నములు మంచి, గొరిదుంతు మములు రత్న
నతులు పచ్చగన్నేరులు సన్న దినుసులూ
కలయగూర్చి దంచిరపుడు. (మ్రు. వి. 3-60)

గజేంద్రమోక్షము—కథాగీతమను పేర నున్నది.

రాగం, ఆనందభైరవి ఆటతాళము.

రాజేంద్ర వినుమువి రాజిత మగుగజ
రాజమో క్షణకథనూ.
మహాసుధను రహితమనోవ్యధనూ॥
రాజిల్లు భువిసుధా రాశిత్రి కూటాద్రి
యోజనా యుతయామ మున్నత త్వంబూ వి
భ్రాజితంబుగ కాంచనంబున రాజితంబు గరోమయంబున
రాజెలంగెడి శృంగములుమూ డతులమణిధా తువుల వెలు
గును ॥ రాజేం.

ఇవ్వారి చరమున-కెవ్వర-డ్డమువత్తు
రెవ్వారు నాకాధ్యు డూ-పరమేశ్వరు
డెవ్వాడు కారాణు డూ-సర్వాధారు
డెవ్వాడు పరిపూర్ణు డూ
పారాత్మకు డెవ్వాడు నిర్ధారణు డూ-మహాత్మకూ
డెవ్వా నిచేగర్త నెవ్వానినుంచ నెవ్వనిలోడిందు యీ జగ
[మంతాయు.

ఎవ్వడీలో కంబులునులో కేశులునులో కస్థులును దెగి
నవ్వలను పెంజీకటినిసే కాకృతిని వెలు గొందునతనిని॥

గజరాజ మోక్షణ కథవిను వారికి
కలుషాము హరియించు నూ
దుస్స్వప్నము తొలగును యశమెచ్చు నూ
దుఃఖమూ బాయూక లుములు ప్రా ప్తించూ నూ
సౌఖ్యము గల్గుకై వల్యములభించునూ.

తలుపుదగ్గర పాటలు.

శ్రీకాం-తా మణీ-నేనీ-సఖుడను
శీఘ్రుము-వాకిలి-తీ వే-నీవు
శీఘ్రుము-వాకిలి-తీ-వే.

ఓ కాం తుడనీ-గుణములు-తెలిసెను
ఊరికే-వెళ్ళగ-నో-యీా, నీవు
ఊరికే-వెళ్ళగ-దో-యీా.

ఈమా టలునీ-వెన్న డా-డవది
ఏ మే-అలు మెలు-మం-గా-అది
ఏ మే-అలు మెలు-మం-గా.

భామల-మరిగిన-వాడవు-నాతో
పలుకా-లేలపో-వో-యీా-యీా
పలుకా-లేలపో-వో-యీా.

పరభా మలనే-కూడితి ననియిటు
పలుకుట-కారణ-మే మే-సఖి
పలుకుట-కారణ-మే మే.

తరుణుల-కూడక-యుంచే-పువ్వుల
దండలు-ఎక్కడి-వో-యీ-పూల
దండలు-ఎక్కడి-వో-యీ.

హరిహరి-నేనే-మెరుగను-భక్తులు
అర్పించిరవో చెలీ యీ-నా
కర్పించిరవో చెలీ-యీ.

---

## మంగళవారం పాటలు.

కైలాస-గిరిలోను-కల్పవృ-క్షముక్రింద
ప్రమథాది-గణములు-కొలువగా-నూ
పార్వతీ-పరమేశు(లు)-బాగుగా-కూర్చుండ
పరమేశు-నడిగెం దా-పార్వతపు-డూ,
జయమంగ-ళంనిత్య-శుభమంగ-ళం.

ఏ వ్రతము-సంపదలు-నెలమితో-డుతనిచ్చు
ఏ వ్రతము-పుత్రపౌ-త్రావృద్ధి-నొసగూ
అనుచునా-పార్వతీ-యూహరూ-నడిగే.

శ్రావణా-మాసాన-శుక్లప-క్షమునందు
శుక్రవా-రమునాడు-మునిమాపు-నా
పంచకల్యాలు దెచ్చి-బాగుగా-నూనిల్పి
భక్తితో-బూజించు-మనిచెప్పె-నూ.

అయిదేసి మాత్రలతోఁ గూడిన నాలుగేసి గణములొక్కొక్క పాదమునకు. మూడవ గణము మొదటియక్షరమున యతి. రెండవ పాదము-తుదిగణ మేకాక్షర గణము కావచ్చును.

ఆనంద గీతములు.

ఆనంద మానంద మాయెనూ మన శ్రీ
రామూలు పెండ్లి కొడు కాయెనూ-మన
జానకి పెండ్లికూతు రాయెనూ-యెల్ల
జనులాకు సంతోష-మాయెనూ-సుర
మునులాకు-విన వేడు-కాయెనూ.

లాలిపాట—కృష్ణ జననము.

కస్తూరి-రంగరం-గా, మాయన్న-కావేటి-రంగరం-గా
శ్రీరంగ-రంగరఁ-గా-నిను బాసి-యెట్లునే-మర చుందు-రా.

జో అచ్యుతానంద-జోజో-ముకుందా
లాలి పరమానంద రారమాకుందా-లా-లీ.

లాలి శ్రీకృష్ణలాలీ-లాలిమానల్లనయనా,
లాలి మాబొజ్జతండ్రీ-లాలినావరహాల పంట-లాలీ.

మేలుకొలుపు పాట.

(3+4 మాత్రల 4-గేసి పాదాలు)

మేలుకొనవే-చంద్ర శేఖర-మేలుకొనవే-ఇంద్రవందిత
మేలుకొనవే-నీలలోచన-నీలకంఠా-హారహారా మేలుకొనవే.

శంభుశంభో-యనుచు వేడ్కతో-నమ్మునీశ్వరు-లరుగుదెంచిరి
జృంభణమ్మున-నారు మోముల-సూనుడే తెంచెఁ
పండు వెన్నెల-గ్రుంకుచూర్పున-కొండపైనుద-యించె
సూర్యుఁడు
దండికలువల-జారచోరుల-దర్పమడఁగఁగ మా
హరహరా-మేలుకొనవే?

మేలుకో-శ్రీరామ-మేలుకో-రఘురామ
మేలుకో-గుణధామ-మేలుకో-నాస్వామి-మేలుకో.
చాలునిం-కానిద్ర-పూనికతో-నిన్ను బూ
జించువా రలనుబో షింపవలె వేగ-మేలుకో.
నాస్వామి-మేలుకో.

## వెన్నెల పాటలు.

కాకీ కాకీ గంతుల కాకీ
కాకిని తీస్కెళ్ళి గంగలో ముంచితే
గంగానాకూ పాలూ ఇచ్చే
పాలూ తీస్కెళ్ళి అమ్మాకిస్తే
అమ్మా నాకూ డబ్బానిచ్చే
డబ్బా తీస్కెళ్ళి పంతులకిస్తే
పంతులు నాకు చదువూనిచ్చే
చదువూ తీస్కెళ్ళి మామాకిస్తే
మామా నాకూ పిల్లానిచ్చే
పిల్లా పేరూ-మల్లె మొగ్గ
నాపేరు జమీాందార్.

అట్ల తద్దెలలో వెన్నెట్లో వెన్నెల పరుగులు—చిన్నీ చిన్నీలని పిల్లలు పాడుకొనే పాటలు—

చిన్నీ చిన్నీ కెన్నెళ్ళూ
సింగలగారీ కెన్నెళ్ళూ
తరళనేత్రా కెన్నెళ్ళు
తామరసిరీ మొగ్గల్లు

## ఏల.

ఓబలేశుని కొండల నడుమా
ఒంచేగడ్డీ కోసేదానా
ఒంచేగుడ్డా వొల్లీ గుడ్డేమే!
కాళింగి కిణికిణి, ఘణక ఘణకని
ఒంచెతీసి, పంచవరవా లే.

గిద్దెగిరీ కొండలనడుమా
ఎద్దులతో-లే ముద్దులమరిదీ
నన్నుసూసీ నవ్వబోకోయీ—హరిఓబాబులేశా
నన్నుసూసీ నవ్వబోకోయీ.

"ఏగంటివారి వచనాలని" సామాన్యజన వ్యవహారమున సుప్రసిద్ధములు. వానిలో గొన్ని పాచ్యలిఖిత పుస్తక భాండాగారమున సేకరింపఁబడియున్నవి. వారిశిష్యులరచనలలోనివి. శైవము-వేదాంతము, గార్లపాటిలక్ష్మణకవిరచితము.

తుమ్మెద పాట. అయిదేసి మాత్రల గణములు.

శ్రీకరూఁ డను పువ్వు-తుమ్మెదా-మోదు
లో కాము లాయెను-తుమ్మెదా
సాకార మైయుండు-తుమ్మెదా-పర
మే కాంతమున జూడు-తుమ్మెదా.

శివశివ యన వే-ఎ-తుమ్మెదా
శివుడనగ విన మేలు-తుమ్మెదా
శివునిభక్తూలాకు-తుమ్మెదా
శివ శార-ణన మే లె-తుమ్మెదా ॥

ఆఱు రేకులపూవు తుమ్మెదా-అది
మీాఱీన వాసనె తుమ్మెదా
వేఱు నేయక నీవు తుమ్మెదా-శివు
చేరి భజించవె-తుమ్మెదా ॥

ఈళ పింగళాలు-తుమ్మెదా-సుషమ్న
నాళిమధ్యమున-తుమ్మెదా.
మేలిమెఱిగే-నీవు-తుమ్మెదా-శివ
కేళి జరించవె-తుమ్మెదా ॥

---

చిలుకపాటలు—అయిదేసి మాత్రల గణములు.

చెలగి చెప్పెదబుద్ధి చేకొనీ వినినీదు
చింతమీా దానుండు చిలుకా

కులముతో వైరంబు కొంటగాదు మిక్కిలీ
గూడువె శ్ళకయుండు చిలుకా
పట్టుబస లేని యాపదలకై కెమ్మోవి
పండ్లశే రాకుమీ చిలుకా
పట్టముట్టగరాని బట్టబైటను తేనె
పండు ఉన్నదిచూడు చిలుకా,
గురుతైన యేగంటి గురుపాదములు చేరి
గిరిగడచి యామీద చిలుకా
సిరులుమాయని తెలిసి జీవగుణమది యెఱిగి
చిగురుమే తలబోకు చిలుకా ॥

ఏల పాట.

సూర్యచంద్ర వహ్ని సదుమా
శౌర్యమానే చిలుకగంటీ
సూర్యదీప్తి గాయుచుండా గా— యేగంటిలింగా
చూడజూడా శ్చర్యమా యే రా— యేగంటిలింగా

కాంతాల పాలెములోన
చింతమానూ పుట్టెగదరా
చింత అసలూ కొనలుసాగా నా— యేగంటిలింగా
చింత పూసీ-వండు పండే-రా
కానరాని యడవిలోన
వానలేని మడుగునిండె

వాన లేని మడుగుమీఁదానూ — యే గంటిలింగా
మానరానీ అగ్ని పొడమే - రా
ఆకు లేని యడవిలోన
తోక లేని మృగము పుట్టె
తోకలేని మృగము కడుపూ నా — యే గంటిలింగా
ఈకెలేనీ పక్షి బుట్టెరా.

## లాలి పాట.

లాలనుచు ఊచేరు లలనలందఱునూ
ఫాలలోచన నిన్ను బాన్పుపై నునిచి-లాలీ
ప్రణవపంచాక్షర పాన్పుతా గాఁగ
భరితచిత్ప్రణవమే బాలీసుగాగా
చరలింగ చిత్కళలు దీపములుగాఁగ
పరమసద్గురునందు-పవళించుకోగా-లాలీ
లాలిచిద్రూపాంగ లాలయ్య లాలీ
లాలి సజ్జన హృదయ లాలయ్య-లాలీ.

## మంగళం.

అరుదొంద వృషభ వాహనుడు ఏగంటీశు
డరయులక్ష్మో భక్తవరదుడనుమా
పరికింప నేలినా ప్రమథగణములాను
సరసనా యుజ్వలిత సామూహ-మునకూ
జయమంగళం నిత్య శుభమంగళం.

